# శృంగార సంకీర్తనలు

(తాళ్లపాక అన్నమాచార్య విరచితములు)


పరిష్కర్త

కీ॥ శే॥ గౌరిపెద్ది రామసుబ్బశర్మ






ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

T.T.D. Religious Series - 551

ప్రథమ ముద్రణ : 1977
ద్వితీయ ముద్రణ : 1998



ప్రతులు : 2,000

వెల : రు. 29-00

ప్రచురణ :
శ్రీ M.K.R. వినాయక్, I.A.S.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

ముద్రణ :
త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
14/264, ఈడేపలి

కందువగు మంచిబంగారు చేయి ॥

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్ళపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్ళపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్ళపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్ళపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్ళపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్ళపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్ళపాక అన్నమాచార్యుల, తాళ్ళపాక పెదతిరుమలయ్య, తాళ్ళపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమల స్వామివారి ఆలయంలో 'తాళ్ళపాక అర'లో లభించాయి.

తాళ్ళపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది - తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్ళపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్ళపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్ళపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్ళపాక లఘుకృతులు, తాళ్ళపాక కవుల సంకీర్తనల సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్ళపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనల కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్ళపాకకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్ళపాక పదకవుల సంకీర్తనల

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల
హిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులన
ష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పం
యరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథ
రిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమా
జెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యా
షవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్త
హితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి.
కీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకు
హిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక
కీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడువున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబ
ళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరు
రుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమతః తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటా
కానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించు
కరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష
ద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరు
రుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యుమానిటీస్
స్టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య
మన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ
ంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణ
హిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకర
.A.,Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరు
హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడ
ణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటే
్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**

ాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తా
ులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనల
కవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార
పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు
కటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణా
న్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తా
న్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స
దేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు
కీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సం
నకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదా
గీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుత
వమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రా
దర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యు

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అం
మత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృత
కీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీ
నాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన
ళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తన
జనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకలి
న్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయ
ళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్ర
ష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచా
శోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమా
జెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించి
రియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామో
ందింది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమా
ంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా

సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర
ధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాద
ద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచ
దరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమ
పాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపో
ణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్య
డింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్ర
చున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్ర
బంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్ర
ర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్య
ర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యే
ట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు వె
మ ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించ
మోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలి
మచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు ఆధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తి
దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎమ్.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహక
శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సిం
సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచా
సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యుమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యా
తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్య
నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశో
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల
దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌర
శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph

డైరక్టర్

| ంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| ధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార |
| ధ్యాత్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్లపాక అన్నమాచార |
| ధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార |
| ధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార |
| ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార |
| ధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార |
| ంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార |
| ంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార |
| ంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్లపాక అన్నమాచార |

| | | | |
|---|---|---|---|
| ృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచారు |
| ృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచారు |
| ృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచారు |
| ృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచారు |
| ృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచారు |
| ృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచారు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచే
పుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధ
ండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టిక
నుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవ
ద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్ప
స్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు
థమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినది. ఈ మార్పును సహృదయ పాఠక
నించగలరు.

ఇరవైనాల్గవ సంపుటమున, ఇకమీదట ప్రతిసంపుటము
క్కొకవిషయమును గూర్చి చర్చించుటకు సంకల్పించినట్లు ప
సియుంటిని. భాషామర్యాదలకు, భావసంపదలకు, అలం
శేషములకు, తాళ్లపాకకవులవాఙ్మయరాశిలో వెలితి కానర

ఈ సంపుటమునందు ముఖ్యముగ 1. అనుస్వారము, 2.
కులవ్రాతలో కొన్ని విశేషములు అను రెండంశములను గ
థామతి సంగ్రహముగ ముచ్చటింపదలచితిని.

## 1. అనుస్వారము

ఈ అనుస్వారమును చర్చించుటకుముందు దీనికి పూర్వ
నవర్ణములనుగూర్చి కొంత విచారింపవలసి యున్నది. ము
పములను చర్చించునపుడు కొంత దీర్ఘప్రస్తావనగూడ అవసర

పాణినీయ వ్యాకరణమున లఘు గురువులను నిరూపించు
హ్రస్వం లఘు" 1-4-10 "సంయోగే గురు" 1-4-
ర్ఘంచ" 1-4-12 అని సూత్రించియున్నారు. దీనివ
అచల" వంటి వర్ణములు లఘువులని "అన్యత్ర" లో క్రిగీ
వర్ణములు గురువులని, అట్లే "పారావార" లో దీర్ఘ
న్నియు గురువులని తేలుచున్నది. గురులఘు నిర్వచనము ఛా
లకు (ఛందశ్శాస్త్రజ్ఞులకు,) ప్రధానమైనను వారుగూడ కొ
కు వ్యాకరణము ననుసరించియే సాగించినారని తోచుచున్న
దువలన ఈ గురులఘు విషయమున వ్యాకరణశాస్త్రమునుగు
స్తావించితిని. పై శాస్త్రమును గురిగా చూచితిమేని "సంయు

వ్యాకరణములోఆధార మగపడదు, కాని ఛందశ్శాస్త్రకర్తలు,

శ్లో॥ "దీర్ఘం సంయోగపరం తథా ప్లుతం వ్యంజనాంత మూష్మాన్తం।
సానుస్వారం చ గురు క్వచిదవసానేఽపి లఘ్వన్త్యమ్॥"

(పిం-సూ-1-4)

అని వాకొని యున్నారు. దీనికి గూడ యేదో వ్యాకరణ సంబంధము కలదని భావన. నిరాధారముగ నట్టి మర్యాదపాటు ఛాందసులు చెప్పియుండరు గదా!

అనుస్వారముతో కూడిన 'సంయమి' వంటి పదముల స్వరూపమును విచారింతము. 'సమ్ + యమి' అనునప్పుడు "మోఽనుస్వారః" 8-3-23 అనుసూత్రముచే మకార మనుస్వారమై 'సంయమి'గా మారుచున్నది. ఇట్లే సంవాద సంబంధాదులు సంస్కృతమునైనచో 'హరిమ్ + వందే' ఇత్యాదులలో 'హరిం వందే' ఇత్యాదిగ మారుటయు పైసూత్రప్రభావమే. ఇది నిత్య సూత్రమే; కాని, యీసూత్రముతో మకార మనుస్వారముగ మారనిపక్షమున[1] 'సమ్యమి' 'సమ్వాద' ఇత్యాదిగ రూపము లుండవలసివచ్చుగదా. అప్పు డాసకారము సంయోగపరము కావున "సంయోగే గురు" అను సూత్రముచే తప్పక గురువు కాగలదు. అందువలననే మకారస్థానీయమైన అనుస్వారమును గూడ సంయుక్తముగ భావించి దానికి ముందున్న వర్ణమునకు గురుత్వము ఘటిల్లియుందురు. అట్లే 'అన్ + కితః' 'శామ్ + తః' ఇత్యాదియేకపదములందును "నశ్చాపదాన్తస్య ఝలి" 8-3-24 అనుసూత్రముచే నకార మకారములు సున్నలుగమారి 'అంకిత' 'శాంత' వంటిరూపములు కాగా, "అనుస్వారస్య యయి పరసవర్ణః" 8-4-58 సూత్రముచే పరసవర్ణమువచ్చి 'అఙ్కిత' 'శాన్త'

ాటించి 'అంకిత' 'శాంత' ఇత్యాదిగ వ్రాయుట మన తెనుగు
ంప్రదాయము. దీనికి "యయితద్వర్గాన్తః" (ప్రాకృతప్రకా
–17) అను వైకల్పిక సూత్రము ఆధారమని చెప్పుటయు క
ందుఃల్' (1-1-40) (పాకృతమణిదీపిక) అను సూత్రమునందలి
ధి కారణమనుట బాగుండునేమో? "అఙ్కిత" 'కాఞ్చన' వ
అంకిత' 'కాంచన' ములుగామారుటకు పై ప్రాకృతపద్ధతినే
లుగువారు అవలంబించి యుందురు. పై నిరూపించినశా
ులతో వ్యస్త, సమస్త పదములయందు అనుస్వారమునకు (బి
కు), సాధారణముగ మూలరూపములోని అనునాసికాక్షరవ
ారణములగుచున్నవని తేలినది.

ఈ బిందువు మన తెలుగుబాసలో సిద్ధ, సాధ్య, ఖండా
(ఁ) (ం) ] భేదములతో నుండుట మరీ వినోదకరము.
ందువుగల పదములందు దానిమూలరూప మందలి అనునాసి
మును మాత్రము పరిశీలించినచో చాలును. మన తెనుగు
స్కృత, ప్రాకృత, తమిళ, కన్నడపదములు మూలరూపము
నే, వానిలో అనునాసికాక్షరమున్నచో వానినుండి బుట్టిన
ుగుపదములందు, యథాశాస్త్రముగ సున్న లరసున్నలు ప
ుండును. పదాద్యక్షరములపై సున్న లరసున్న తేర్పడునపు
ాద్యక్షరము లఘువైనచో దానిపై వచ్చు సున్న నిండుసు
ు, పదాద్యక్షరము దీర్ఘమైనచో దానిపై వచ్చుసున్న అరసు
ః, తక్కినస్థలములయందు వచ్చుసున్న ఉభయాత్మకముగను ఉండ
తెనుగుశాస్త్ర సంప్రదాయము. ఉదా: 'దణ్డః' సంస్కృత
ంటు' తెలుగు, 'కాణ్డః' సంస్కృతము 'కాఁడ, తెలు

వాఁటు,' 'దూఁటు,' 'దూఁటు', గ మారుట గుర్తింపద
యము.

ఇక్కడ ఒకవిషయము విచారింపవలసియున్నది. ము
వములలో అనునాసికాక్షరములు లేకపోయినను తద్భవముల
నుస్వారములుండుట, మూలసంస్కృతములో 'అనునాసిక, అ
స్వార' అక్షరమున్నను తద్భవములలో అనుస్వారము లేకుండుట
సిద్ధాంతమునకు విరుద్ధముగ తోచుచున్నది. 'వక్ర' శబ్ద
వంకర' గా, 'స్త్రీ' శబ్దము 'ఇంతి' గా, 'కక్ష' శబ్దము 'చంక'
మారునపుడు ఈ విరోధము స్పష్టముగ తెలియుచున్నది. క
వక్ర' శబ్దము వంటి వానిలో అనుస్వారమును "వక్రాదిప
ప్రా. ప్ర. 4–15) సూత్రముచే ప్రాకృతవైయాకరణులు సా
రి. దానినే మనవారాదరించిరి. 'ఇంతి' శబ్దములో భ్రా
తను 'చంక' లో భ్రాంతి-వర్ణవ్యత్యయములచేతను బిందువులు సాధిం
పన్నారుగదా! అనుస్వార, అనునాసికములు గల్గిన 'మాంసా
బ్దములు తద్భవములలో అవిలేకుండ ప్రయోగించుటను "మాం
షు వా" (ప్రా. ప్ర. 4–16) అనుసూత్రముచే ప్రాకృతవైం
రణులు సమర్థించిరి.

సిద్ధ సాధ్య ఖండాఽఖండ బిందు స్వరూప మిట్లుండ
ాళ్లపాక అన్నమాచార్యులకీర్తనలలో పై విధులను అన్ని
ాటిన ప్రయోగములు కొన్ని కానవచ్చుచున్నవి. అందుకొ
ాబోటివాని జ్ఞానమితికి సహేతుకములుగా, కొన్ని హేతుదు
ములుగా కనపడుచున్నవి. తెనుగువాఙ్మయమున ఇతరక
ప్రయోగములలో 'యేమిటికి' అనుశబ్ద సంగ్రహరూపమైన 'ఏ

యము సందర్భము శబ్దము [illegible] అర్ధానుస్వారము
కన్పట్టుచున్నది. మూలపదములోని మకారము లోపించుట
అస్థానములో అర్ధబిందువుండుట న్యాయ్యముగనే తోచుచున్న
మాట, మాటు, మాటికి శబ్దములందు ఈవాఙ్మయము నందచ్చటచ్చ
అర్ధానుస్వార ముండుట కొంత విచిత్రమే. కాని మాట శబ్దము
అర్ధానుస్వారము హేతువాదమునకు, పూర్వప్రయోగములు సాక్షి
తోచుచున్నను, మాటు, మాటికి పదములలో హేతువు కనబడుట లేద
అట్లే "కడ+కడ=కట్టకడ" అను రూపము 'కట్టఁగడ'
ఈ వాఙ్మయమునందు కనపడుచున్నది. ఇది తమిళ సంప్రదాయవ
యనిపించుచున్నది. 'అంట' (అనుట) కు రూపాంతరమ
'అఁట' లో 'ఎసఁగు' మొదలగు నిత్యసార్ధానుస్వారములై
రూపములలో అర్ధానుస్వారము లేకుండుటయు నీవాఙ్మయము
విచిత్రమే. 'ఎసఁగు' లో నొక్కొక్కచోట కనపడినను 'అఁట' ల
మాత్రము ఇంతవరకు నాదృష్టి కెచ్చటను అరసున్న కనపడలేద
'రాఁగు' 'రాఁపు' అని సార్ధానుస్వారము లున్నవి. 'రంగ
రాఁగైతే, 'రంపు' రాఁపైతే పరవాలేదు.

అన్నమాచార్యులు భాషావిషయమున భావకల్పనమ
వాలస్వతంత్రుడు. ఆయన ఈపదములను ఏదృష్టితో ప్రయో
గించెనో, దానిని పెద్ద తిరుమలాచార్యులవారు ఎంత పరిశీలిం
రేకులపై చెక్కించిరో, ఇందు పోగరపనివారి కైవాడ మెం
యున్నదో చెప్పలేము. మనకు లభించిన శాస్త్రములను, మనమ
చదివిన చదువును ఊతగా చేసికొని ఆయన భాషాపాండిత్యమ
కొలవలేము. ఇకపై అన్నమాచార్య భాషా సారస్వతముల
సూటిగా విమర్శింపగల పెదలు పై విషయములను సహేతు

పూర్ణానుస్వారముగ, అద్విరుక్తములైన హల్లులకు ముందున్న నిం
సున్న అరసున్నగా గుర్తించు సంప్రదాయము గలదు.

## 2. రాగిరేకుల వ్రాతలోని విశేషములు

పై చెప్పినవిధముగనే ఈ రేకులలో అరసున్న నిండుసున్న
వ్రాత నిండియున్నది. కాని కొన్నియక్షరములయందు పలుతావు
త పద్ధతి భేదించియున్నది. ఉదా:- రేకుల వ్రాతపద్ధతిప్రకార
'ఎంతైనా' 'ఎద్దాఁకా' ఇత్యాదిగా వ్రాయవలసిన స్థలముల
'ఎంతైనా' 'ఎందాఁకా' అనియు, 'కాంబోది' అని వ్రాయవ
ిన స్థలములలో 'కాంబోది' అనియు 'సుఖంబ్బు' అని వ్రాం
వలసిన స్థలములలో 'సుఖంబు' అనియు వ్రాత మాటిమాటికి క
పడుచున్నది. ఇట్టి స్థలములయందు మేము 'ఏఁ(ఎం?) తైనా' ఇత్యా
దిగా సూచించుచున్నాము. ఇట్టి వ్రాత అక్కడక్కడ విరివిగానుండ
టచే ఈ సూచనలు అచ్చులో కొంతవికారముగ గన్పట్టునని, పదమ
లను సందర్భములను అనుసరించి 'ఎంతైనా' అని వుంటేగూడ సూచ
ియివ్వకుండ 'ఎంతైనా' ఇత్యాది మామూలుగనే వ్రాయుచున్నామ
కారణము పై తెల్పిన వికారము తొలగించుటయే. అట్లే పెక్కుచో
'వ్రాయు' టకు, 'వాయు' అనియే రేకులలో కన్పడుచున్న
దానికిని పైవిధముగ [వా(వ్రా?)] సూచించుచు వచ్చితిమి
ఇదియు ననంతమగుటచే అచ్చులో వికారమును తొలగించుట
'వాయు'ను 'వ్రాయు' గనే వ్రాయుచున్నాము. 'భ్రమయుక
'భ్రమయు' అనియే పలుతావుల గలదు. బతుకు,బలిమి ఇత్యా
లో 'బ' ప్రత్యేకముగ కనపడుటచే, 'భ్ర' లో మహాప్రాణ సూచ
ముగుటత్తు లోపించియుండునని 'భ్ర'గనే వ్రాయుచున్నాము. ఎచ్చట
అర్థముతో సందర్భముతో పెద్దగా సందేహము తోచునపుడు సూచ

రేకులలోని పంక్తులకు ముందుగ ఒకపద్ధతి ప్రకారము గీతలు గీ
కొని తగినంత యెడమిచ్చి అక్షరములు చెక్కుతూవచ్చిరి. అం
'ఎంత్రై' అనుస్థలమున 'ఈా' వత్తు (ా) 'ఐత్వము' (ై) ల
వాలినంత స్థలము దొరక నప్పుడెల్లా ఈపని చేసిరేమోయని తో
మన్నది. ఒక 'త్రై'కి ఈహేతువు చెప్పవచ్చుగాని, పైదెలిపి
యుగత వర్ణముల విషయమున నేమి చెప్పుటకూ తోచదు, చేతిపా
పాటుగనే గుర్తింప వలసియున్నది. ఇట్టి ప్రమాదము ఇతర పదవ
ముందును గలదు

ఈ వాఙ్మయపరిష్కరణమున తమ నిండు సహకారముల
ఉత్సాహమును చూపుచున్న తి. తి. దేవస్థానము కమిటీ అధ్యక్షుల
శ్రీ సి. అన్నారావుగారికి, ఈ వాఙ్మయరాసిక్యమును లోకమున
నెంతోగొప్పగ అందివ్వవలెనను ఆసతో పనిచేయించుచున్న తి.
దేవస్థానముల కార్యనిర్వహణాధికారులు శ్రీ పి. యస్. రా
గోపాల్ రాజు, ఐ. ఏ. యస్., గారికిని నా ధన్యవాదములు. మా
వలసిన విధముగ ఈ కార్యమున తోడ్పడుచున్న శ్రీ వేంకటేశ్వ
ప్రాచ్యకళాశాలాధ్యక్షులు డా॥ కె. సేతురామేశ్వరదత్తాగారి
వెంట వెంటనే ముద్రణమునకు సర్వసంభారములను సమకూర్చుచున
తి. తి. దే. ప్రెస్ మేనేజరు శ్రీ యమ్. విజయకుమార్ రెడ్డిగారికిని, న
ప్రశంస దప్ప వేరేమీయగలను. నాచేర్పులు కూర్పులన్నింటిని సా
ధానముగ వీలైనంత నిర్దుష్టముగ ముద్రించుచున్న తి. తి. దే. ప్రె
అచ్చుకూర్పరులకు, ఈ పీఠిక వ్రాతలో తగు విధముగ సహకరించి
చిరంజీవి కె. రామచంద్రరాజునకు నామంగళాశాసనములు.

ధర్మమగుట" అను తిరుపతి వేంకటకవులమాట ననుసరించి, ...
జాగ్రత్తగ పరిశీలించినను మాకనుగప్పి దొరలిన దోషము...
సహృదయులు మన్నించి తెల్పినచో పైపై సంపుటములలో మ...
జాగ్రత్తపడగలమని మనవి.

సంగీత సాహిత్య చాంగికారాయ శారదా ముద్రామ్।
యస్య నిరీక్షిత స్వయ మభివందే తాళ్లపల్లికులమందారమ్॥

తిరుపతి
27–11–77

బుధవిధేయుడు,
శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశ
(తాళ్లపాక వాఙ్మయ పరిశోధకుడు)
ఆంధ్రశాఖాధ్యక్షుడు,
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలం.



నినిగూర్చి విస్తారముగ పరిశ్రమ సాగవలసియున్నది. దాని కుప క్కరకముగ నిఘంటువుల కెక్కనివీ, ఎక్కినా అర్థాంతరము యోగింపబడినవీ, ఇతర ప్రయోగములందు కానరానివీ, మాత్ర వే ా సమీక్షలో లఘువుగ చర్చింపబడునవి. ఈ చర్చలో నా ూచనమాత్రమే. పైపై పెద్దలు పరామర్శింపగలరు. ఈ సంపుట నుండి ఈ సమీక్ష కడపటగాక పీఠికానంతరము చేర్చబడుచున్నది.

అఁడుఁబోఁడి (517 పాట). 'అఁడుఁబోఁడిమి' లో సామాసి ముగ 'మి' లోపించి యేర్పడిన రూపము కావచ్చు. ఈ పద్ధతి ఈ వాఙ్మయమున అక్కడక్కడ కానవచ్చుచున్నది. చూ:- "మఁ యాఁడుఁబోఁడెడ్డెడు మగపోడిమా నేఁడు" 22వ సంపుటము 456 పాట. అక్కడ "దీనియర్థము విచార్యము" అని వ్రా యుంటిని. పరిశీలింపగా 'అఁడువారిపద్ధతి, ఆఁడుఁదనము' అని అర్థముగా తోచుచున్నది.

ఉంగిటి (149 పాట) ఉంగిడి = 'ఊపిరియాడనిస్థితి' అని వా. ని. ఆ 'ఉఁగిడియే ఉంగిటి' అయి యుండవచ్చు. ఉంగిడి ఛాయార్థముగా 'మీదమీద' 'యెడతెరపిలేక' 'దండి' ఇత్యాద్యర్థ ములలో ప్రయోగించినట్లున్నది.

ఒలినిలయా (414 పాట) ఒలి = 'శబ్దము' అని తమిళము అదే మన 'ఉలివు' కావచ్చు. ఒలిశబ్దార్థమునకు ఛాయగా (శ (వేదము) అని అర్థమైనచో, వేదాధారా అని అర్థము కావచ్చు

కడమదొడనులు = (181 పాట) ఇది జంటపదముగా తోచు చున్నది. ఈ నాటివ్యవహారములో కానవచ్చుటలేదు. 'మిగిలింది

తగిలించె', 'వచ్చిండి, పోయింది' ఇత్యాద్యర్థములలో వాడినట్లు తోచుచున్నది. 'మిగిలినది' అను నర్థమున కడమశబ్ద మీనాటికిని వ్యవహారములో గలదు.

కలుపడఁజేసితి (481 పాట) ఇది నిఘంటువుల గానరాదు. ప్రకరణమునుబట్టి 'నిర్వైరపడునట్లు,' 'ప్రమాన్పడునట్లు,' కలవరపడునట్లు,' చేసితివి ఇత్యాదిగ నూహింపవచ్చు.

కొండల మొయిలు మేసినట్లు (559 పాట) కొండల మొయిలు మేయుట అను పలుకుబడి యీనాటికినిగలదు. దండిగ మబ్బులు కొండలపై పారాడుచుండినచో, అదిచూచి గ్రామీణులు 'కొండ మొగిలి మేస్తావుంది వానకు బలమబ్బా' అంటారు. ఆయర్థములోనే యీ పలుకుబడి నిచట మాండలికముగ ప్రయోగించినట్లున్నది.

గురుమ (449 పాట) 'కురుమై' Lustre, Brightness, Superiority. అని తమిళము. అదియే ఇది కావచ్చు. 'పెద్దరికము, మహిమ' ఇత్యాది అర్థములుండవచ్చు. ఈ పదప్రయోగము మరియొకచోట చూ:- 517 పాట. 'గరిమ' శబ్దవికారమైనను కావచ్చు.

గొల్లముంజులు (505 పాట) ముంజు = 'మెదుక' అని వా. ని. ఆ అర్థ మిక్కడ సరిపడనట్లు తోచుచున్నది. ప్రకరణమునుబట్టి 'ముంజులు=నుచ్చులు' గా తోచుచున్నది. మేకల గొర్రెలపెంటలు బురదగ తడిపి, దానిని చిన్నపేలికలకు అంటించి, మేకపిల్లలు, గొర్రెపిల్లలు తల్లులదగ్గర పాలు త్రాగకుండుటకై

[illegible]
పాత్రము' అనునర్థమున వాడినట్లున్నది. 'పరాధీనుడు' చాయార్థము కావచ్చు.

చేలాగు (14 పాట) 'చేయూత' అను నర్థమున వాడినట్లున్నది. చేయిచ్చి లాగుకొనుటయు కావచ్చు.

తిరువుమొరువు (12 పాట) 'తికమక' అనునర్థమున వాడినట్లున్నది. ఈ యర్థమున శకటరేఫతో నీజంటపదము తమిళనిఘంటువున గలదు.

తీసిపెట్టుగానితమిన్ (98 పాట) 'తీయుటకు పెట్టుటకు వలనుపడని, లేదా తొలగించుటకు సాధ్యపడని' అను నర్థమున నీధాతుజవిశేషణములు క్త్వా-తముతో కూర్చి ప్రయోగించినట్లున్నది.

నిజపట్టేవు (48 పాట) 'భయము + పడు = భయపడువలె నిజము + పట్టు = నిజపట్టు' వాడినట్లున్నది. ఇది అపురూపమే

నిట్టి సిడిమేఁదాన (పాట 435) నిఘంటువుల కానరాదు ప్రకరణమునుబట్టి, 'నిలువైనపిడివంటి శరీరముగలదానను' అని తోచుచున్నది. 'సౌందర్యము లేకుండుట' దీ. లో అభివ్యక్తమగునేమో?

బగివాయ కాపెమీఁది <u>పరాకున</u> నున్నవేళ (189 పాట) ఇక్కడ పరాకుశబ్దము, 'పరవశము - మగ్నత' అను నర్థమున సరిపోవుచున్నది. పరాఙ్ముఖ శబ్దభవము గదా ఇది. పై తెల్పిన యర్థములోనే 'విస్మరణంబైనది మాటలపరాకుచే ననుచు కళా 3-81. దీనినే వా. ని కూడ నుదాహరించినది.

పరిశీలించగ పేనిపట్టి లేక పూసిపట్టి అనువానివికారముగ తోచుచున్నది.

చేసేటి బత్తి (265 పాట) భక్తిశబ్దభవమైనయీబత్తి, ఈ వాఙ్మయములో, స్త్రీ పురుషు లొకరొకరిపై చూపెడి 'ప్రేమ' కు పర్యాయముగ చాలచోట్ల గలదు. పై యర్థములోనే యెక్కువగ నుండుట గమనింపదగినవిషయము.

మోమోము (437 పాట) మోము + మోము = మోమోము అని విచిత్రమైన ఆమ్రేడితసంధి. ప్రతివారిముఖము అని యే కాక, ఒకరిముఖము నొకరుచూచుట, (మొగము మొగము చూచుకొంచే) అను నర్థముగూడ సరిపోవుచున్నది.

లాగవేగాలు (284 పాట) 'లాఘవ' శబ్దభవము 'లాగ' కాగా, 'సుళువుగ వేగముగ' అని యీజంటపదముల కర్థము కావచ్చు, వేగమునకు లాఘవము కారణమూ కావచ్చు. అప్పుడు ద్వంద్వము పొసగదు.

సంతము (197 పాట) శాంతశబ్దభవముగా తోచుచున్నది. అర్థము అదే. తద్భవించుటలో అన్నమయ్య స్వతంత్రుడు.

వెఱచరో (534 పాట) వెఱచు ధాతువేనా? శకటరేఫము చింత్యము. అర్థానుస్వారమును బట్టి పై 'వెఱచు' గనే భావింపవచ్చు.

3. కొన్నిశబ్దములకు వివరణము పాదదీపిక (Foot-Note) లోనే ఇచ్చియుండుటచే ఈ సమీక్షలో శబసంఖ్య తగ్గినది. ఇకపై సంపుటములలో గూడ: పాదదీపికనే

# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు



~~౨౫ వ సంపుటము~~

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౭ అ
నేంటిక్రోధి సంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదా
ేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అది మొదలుగాను శాలివాహ
శకవరుషంబులు ౧౪౨౪ అగు నేంటి దుందుభిసంవత్సర ఫాల్గుణబహుళ ౧
రుధానకు[1] తిరువేంగళనాథుని మీఁదను అంకితముగాను తాళ్లపా
అన్నమాచార్యులు విన్నపముచేసిన శృంగార సంకీర్తనలు.

రేకు 901 దేసాళం

అండకు రావయ్యా అన్నియుఁ దెలిసెను
నిండి నొసలిలత్తుక నీరువలె నున్నది ॥ పల్లవి

ముసుఁగు వెట్టుకొని మూల నేమి సేసేవు
నుసరానఁ బెదవులు చూపవయ్యా
యెసఁగి రెప్పలమీఁది కేలవచ్చెఁ దమ్ములము
కొసరితేను చెక్కిట గోరువలె నున్నది ॥ అండ

(1) ఈశబ్దము 'నిరోధ' 'నిరుద్ధ' శబ్దములకు వ్యావహారిక రూపముగా కా
చ్చుచున్నది. అడ్డగింపు, అవధి అని యర్థము. ఆనాడు కడపటిదినమని తా
ర్యము. కీ॥ శే॥ ప్రభాకరశాస్త్రిగారూహించిన 'సరియగు' అను నర్థము తాత్పర్యార్థ
వచ్చును. 'అవధి' అను నర్థములో, "ఈ నిరుద్ధమునకుఁ గుశలంబు మా క
ను తరిగొండ-వెంగమాంబగారి ప్రయోగము 'విష్ణుపారిజాతము' 55 వ పు
సాహిత్య అకాడమీవారిది దీనికి సహాయపడుచున్నది. నేనీప్రయోగ మివ్వగా శ్రీమా
ళ్ళపల్లి-అనంతకృష్ణశర్మగారు, 'నిఱుత్తం' అను అరవపదము గూడ 'నిలుపు' అ
ర్థముతో దీనికి సహాయపడు వనిరి.

ప్రతిగీతగల పలము చిఁదము దినుటచే దుంక పడియున్నది.

సోయగపునిపుణము చూపి...
చాయల కెంపు లెడవిసరీ బాహుమూలముల
నీయందుఁ గళలు నేఁడు నెలకొన్నట్లున్నవి ॥ అంద ॥

తెరవేసు కేలితి వొద్దిక నలమేల్మంగను
సొరిది నీనెమ్మొగము చూపవయ్యా
ఇరవై నన్ను శ్రీవేంకటేశుఁడ యేలితివి
వెరవుతో నీపుక్కిట విడె మున్నట్లున్నది ॥ అంద ॥

మాళవి

ఇయ్యకొంటి నిఁక నీయిచ్చాయను
కొయ్యతనాలదాననా కొసరితిఁ గాక ॥ పల్లవి

యెనయక నీతోను యెదురాడేదాననా
అనువల కొకమాట ఆడితిఁ గాక
పెనఁగుచు నీతోను బిగిసేటిదాననా
చనవు మెఱసి కొంత జంకించితిఁ గాక ॥ ఇయ్య

యెదచొచ్చి నీపట్టుకు నెగసక్కెపుదాననా
నడుమ నూరకే నీతో నవ్వితిఁ గాక
జడిగొని నిన్ను మీరి సాదించేదాననా
పుడివోనిచన్నుల నొత్తితిఁ గాక ॥ ఇయ్య

సొరిది గబ్బితనము చూపేటిదాననా
కెరలి కాఁగిటను బిగించితిఁ గాక
... యేలితివి నన్ను నిదె

తొలుత నఱఁగవా తొయ్యలిలాగు
బలిమి చూపఁగనేల పంతమియ్యనేల ॥పల్లవి

వాడిపట్టి తీసి నీవు వొడఁబరచఁగ నిదె
కొడిమెలు నిన్ను నెంచి కొసరీనాపె
అడరి యప్పటి నీవు అవుఁగాము లాడుకోఁగా
బెడిదపుఁబెదవులు పిప్పిగట్టీ నిదివో ॥తొలు

కక్కసించి పెనఁగుచు కాఁగిలించి వేఁడుకోఁగా
చక్కఁ గిందవేసుకొని జరసీ నాపె
వెక్కసమై నీ వందుకు వినయాలు సేయఁగాను
పక్కన నీసేఁతలెల్లాఁ బచ్చిదేరీ నిదివో ॥తొలు

శ్రీ వేంకటేశుఁడ యిట్టె చేరి నీవు గూడఁగాను
భావించి నీవురముపై నెక్కీ నాపె
వేవేగ నిప్పుడే నీవు విడెము చేతి కియ్యఁగా
చేవదేరి నీవలపు చిమ్మిరేఁగె నిదివో ॥తొలు॥

దేవగాంధారి

దేవరగుణములు దెలియవు
నీవే మాకును నేరుపవయ్యా ॥పల్లవి

వదలక నీతో వాసికిఁ బెనఁగిన
యెదుటనె నీమన సెట్టుండునో

పనులవి యేమని భావింతువో
ననిచి నీయెదుట నవ్వులు నవ్విన
తనివితేనిదని తగ నాడుదువో ॥ దేవ ॥

కూడుచు నిన్నిటు గుబ్బల నొత్తిన
వోడ దనుచు గో రూఁదుదువో
యీడనె శ్రీవేంకటేశ యేలితివి
పీడె మిచ్చితే వెరగందుదువో ॥ దేవ ॥

కన్నడగౌళ

సేసతోఁ బెండ్లాడితివి చెల్లుబడి కాకపోదు
గాసిఁ బెట్ట కిట్టె నన్నుఁ గరుణించరాదా ॥ పల్లవి ॥

చెన్నుమీర చిత్తము రా సేవలు సేయుకుండితే
నన్ను నీవప్పుడు మరి నగరాదా
వన్నెల నిన్నిట్టె కైవసము సేసుకుంటే
మిన్నక నీ పంతము లు మెరయరాదా ॥ సేస ॥

ఆయము లంటుచు నిన్ను నాసకొలుపకుండితే
పాయపుమదాన నన్నే పలుకరాదా
చాయల నే నీమోవి చవులుగొనకుండితే
సోయగపుని(వి?)న్నాణానఁ జూడఁగరాదా ॥ సేస ॥

చేపమీరినరతుల సిగ్గులు రేఁచకుండితే
నీవాసు లిన్నియును నెరపరాదా.

మంగళకౌశిక

ఎటువంటివాఁడవయ్యా యిచ్చకము సేయఁగాను
సటలంటా బొమ్మలను జంకింతురా

పూరకే నీపాదములు వొత్తుచుఁ బిసుకఁగాను
గోరుదాఁకెనంటా యేల కొచ్చి చూచేవు
చేరివూడిగాలు గడుఁ జేసితే మెచ్చుఁగాక
నేరుపు నేరము లెంచి నిందవేతురా

కన్నగన్నచోటనెల్లా గంధము నీకుఁ బూయఁగా
చన్నులు నాటెనంటా సాదించేవు
వున్నతి బత్తిసేసితే నొడఁబడుదురుగాక
సన్నలఁ దప్పులుమోపి చండిసేతురా

మొల్లమిరతుల నిన్ను మోవి యాని కూడఁగాను
పల్లు సోఁకెనంటా నాతోఁ బంతమాడేవు
యిల్లిదె శ్రీవేంకటేశ ఇందుకె నవ్వుట గాక
కొల్లగా సిగ్గువరచి కొసరుదురా

రేకు 902 దేశాక్షి

ఏమనేమయ్య నీవు యేలికవు మాకునెల్లా
ఆమనిగా మోవి చూపి యాసరేఁచేవు

ఇచ్చకములే సేసి యెలయించి యెలయించి
పచ్చిదేర నింతులను భ్రమయించేవు

మందపెండ్లికూఁతులను ముంగిటనుంచేవు
విందులపీడెము లిచ్చి వేసాలు గడునెరపి
యిందులోనే యేకతాన యెమ్మెల మించేవు ॥ ఏమ ॥

నమ్మిక లెన్నైనా నిచ్చి నగవులు పచరించి
మమ్ము నిందరినిఁ గూడి మన్నించేవు
నెమ్మది శ్రీవేంకటేశ నేరుపులు పచరించి
నిమ్మపండు చేతికిచ్చి నీటులు చూపేవు ॥ ఏమ ॥ 7

తెలుఁగుఁగాంబోది

దయఁజూడవయా తతిగాని మొక్కేము
ప్రియురాండ్లము నిమఁ బెండ్లాడితిమి ॥ పల్లవి ॥

చలములు నీతో సాదించేమా
వలచినవారము వనితలము
బలములు నీతోఁ బచరించేమా
కొలిచినవారము గోలలము ॥ దయఁ ॥

పెనఁగుచు నీతో బిగిసేమా నీ-
ననుపులవారము నాతులము
పవివడి నేరమి పైవేసేమా
చనవరివారము సాదులము ॥ దయఁ ॥

యీవేళఁ గూడితి మెలయించేమా
దేవుళ్లము నీతెఱవలము
శ్రీవేంకటేశ్వర చెలఁగి నగేమా

శుద్ధవసంతం

జంకించితనేవు నన్ను సాదవా నీవు
సంకించ వేమిటికి సాదవా నీవు

దూరి కొపకత్తెనంటా తొయ్యలుల కందరికి
సారె సారెఁ జెప్పేవు సాదవా నీవు
వూరకే మాటలాడుతా నొద్దఁ గూచుండి నా కిట్టె
సారపుబుద్ది చెప్పేవు సాదవా నీవు

గొరబుగా నావలపు కొల్లున నవ్వుతా నీవు
సరవితోఁ గేరేవు సాదవా నీవు
తెరవేసి యానవెట్టి దిమ్మరినేఁతలు చేసి
సరుగఁ జెక్కునొక్కేవు సాదవా నీవు

కలికినాకుచములు కాఁగిటను బిగియించి
చలపట్టి కూడితివి సాదవా నీవు
అలరి శ్రీవేంకటేశ అదరపుతేనె లిచ్చి
చలివాసితివి సిగ్గు సాదవా నీవు

కేదారగౌళ

వింటిమి యీకొత్తలు వీనులు చల్లఁగాను
జంటలై నీపై వలపు చల్లెనట చెలియ

వేడుకలు వెదచల్లి వీడెము పుక్కిటఁ బెట్టి
ఆడరానిమాట లాపె ఆడెనట

చెప్పరానిసేఁత లాపె చేసెనట
గొప్పలుగా నీవు పిల్లఁగోవి రాగా లొత్తఁగాను
దెప్పరాన నలపెల్లాఁ దేరెనట చెలియ

చాయలు సన్నలు చూపి చన్ను లురమున నాని
నేయరానిసేవ లాపె చేకొనెనట
యీయెడ శ్రీవేంకటేశ ఇటు నన్నుఁగూడితివి
మోయరానిచోటు మోపి మొక్కెనట చెలియ ॥వి

ఆహి రి

ఎప్పుడు మన్నించేవయ్య ఇఁక నీవు
వుప్పతిల్లువేడుకెల్లా వొడిఁగట్టుకొన్నది ।

జవ్వనమదముతోడ చన్నులవేఁకముతోడ
నివ్వెరగుపడి చెలి నిలుచున్నది
నవ్వులు నెలవిఁగార నయము మోమున మీర
వువ్విళ్లూరుచు నీపై నొరగుకొనున్నది

సిగ్గులనే విఱ్ఱవీఁగి చిప్పిలఁగ మోవి మాఁగి
వొగ్గి విడె మందుకొని వూరకున్నది
నిగ్గుఁబులక లెసఁగ నిట్టూర్పులు వొసఁగ
కగ్గుదేర నేకతానఁ గాఁగిలించుకొన్నది

పెనుఁగొప్పు కడువీడ ప్రియాలు మాటలఁగూడ
గునియుచు నీతొడపైఁ గూచున్నది

ఏమయ్య యింతయేల యెకసక్కేలు
సాము సేసిననీతో సతి పెనఁగీనా

ఎలచనినగవులపగిడికాఁడవు
వెలలేనివేడుకలవేసదారివి
మలకలపలుకులమతకరివాఁడవు
కలికి నీకు నేఁడు కత చెప్పఁగలదా

తిరువు మురువు సేసేదిమ్మరీఁడవు
పలుగుపెక్కువిద్యలబయకాఁడవు
అరుదైనజూదాలఆగడీఁడవు
గరిమ నీకు నింతి కత చెప్పఁగలదా

సంతకూటముల జాణకాఁడవు
మంతనపురతులమాసటీఁడవు
చెంతఁ గలసితివి శ్రీవేంకటేశ్వర
కాంత నీకు నిట్టె కత చెప్పఁగలదా

రేకు 903 లలిత

[1] కానీవే గొల్లెతా గబ్బిగొల్లెతా
అనుక తెలుసుకొంటి వవునవురా గొల్లఁడా

పంతకారిగొల్లెతా పదరకు గొల్లెతా
రంతుల నట్టేకానీరా గొల్లఁడా
యింతగట్టు(ట్టి?)వాయవౌత యెరిఁగితినే నేను

రతులకు మాయింటికి రారా గొల్లఁడా
కతకారివౌత ఇట్టి కానవచ్చెనే నేఁడు
చతురతలు మోమున జడిసేరా నీకును

చనవరిగొల్లెతా చనవిమ్మా గొల్లెతా
కెలయకు శ్రీవేంకటగిరిగొల్లఁడా
పొలఁతు లందరు నేఁడు పొగడేరే నిన్నును
కలపితి వౌఁట నిన్ను కమ్మటి మెచ్చితిని ॥ క

హిజ్జిజి

విన వేడుకయ్యీ మాకు వింతలైనమీసుద్దులు
యెనలేనిముచ్చటలు యెటువంటివో ।

యెంగిలిపెదవి వంచి ఇందాఁకా నీ చేతిలోన-
నంగవించి మాటలాడె నది యెవ్వతో
పొంగుచు నీమేన నిట్టె పులకలు గడునిండె
సంగతి న వెటువంటిసంతోసములో

చెమటచన్నులు దాఁక చేలాగు నీకు నిచ్చి
అమర లోనికిఁ దెచ్చె నది యెవ్వతో
తమితోఁ గళలు రేఁగి తతి నివ్వెరగైతివి
సమమైన వెటువంటిసంగడిపొందులో

జవ్వనమదము గార సదమదముగ నిన్ను
అవ్వలఁ గాఁగిటఁ గూడె నది యెవ్వతో

ఏఁటికి సత్యాలు సేసే వెందాఁకా నీవు
గాఁటముగ నింకాఁ దాయకాణించవలెనా ॥పల్లవి॥

చెలియిచ్చినపువ్వులచెండు నీచేత నున్నది
మలసి నీచేఁత కది మచ్చము గాదా
కొలఁదిమీరఁగ తొల్లె గొల్లెతల మగఁడవు
యెలమి నీయెద్దతనా లెంచిచూపవలెనా ॥ఏఁటి॥

రమణిచేముద్దుటుంగరము నీవేల నున్నది
కొమరై నీపొందు కది గురుతుగాదా
తమితోడ నీవు తొల్లె ధర్మరాజు మఱఁదివి
గములై నీ నిజాలకు కడగుసు తున్నదా ॥ఏఁటి॥

అంగనకంటసరి నేఁడట్టె మెడ నున్నది
సంగతిగా నీకదె లాంచనము గాదా
చెంగట నన్నేలితివి శ్రీ వేంకటేశ్వర
అంగపునీరతులకు నొఁగాము లున్నవా ॥ఏఁటి॥ 15

శ్రీరాగం

అంతలోనె తేరెనా ఆకెమనసు
పొంతనుండి యింకానేమి బుజ్జగించేవయ్యా ॥పల్లవి॥

నెలవి నవ్వులతోడ చెలియ మాటాడఁగాను
వెలయఁ బూబంతిఁ గొని వేసితివి

పొసఁగఁ బన్నీరు దిగఁబోసితివి
వెసఁ బయ్యెద దడిసి వేమక యానవెట్టఁగా
విసువక ఇప్పుడేమి విడెమిచ్చేవయ్యా ॥ అంత ॥

సిగ్గులచేఁతలతోడ చెలి కాఁగిలించుకోఁగా
వొగ్గి గందవొడి చల్లి వొనరితివి
నిగ్గుల శ్రీవేంకటేశ నిన్ను నాకె మెచ్చఁగాను
అగ్గమై యప్పటి నెంత ఆసనేసేవయ్యా ॥ అంత ॥ 1

ముఖారి

నీవలెనఁ గొసరఁగ నేరుతుమా
సేవలు చేసి నిన్నఁ జేకొందుఁ గాక ॥ పల్లవి ॥

వెలలేనివలపులవేడుకకాఁడవు
చలమరిచేఁతలజాజరకాఁడవు
పలుకులఁ గరిగించేబయకారివాఁడవు
నిలువుఁజక్కఁదనాలనీటుకాఁడవు ॥ నీవ

తచ్చనతరితీపులతగవరివాఁడవు
[1]పచ్చలాయకట్టేలాబపువాఁడవు
లచ్చిగొండితనములలాగవేగకాఁడవు
విచ్చనవిడి తగులువిరికాఁడవు ॥ నీవ

చొప్పలెత్తి సోదించేసుంకరివాఁడవు
కుప్పళించి పొందుసేసేకోడెకాఁడవు
ఇప్పుడె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
తొప్పఁదోఁగేరతులకు దొమ్మికాఁడవు ॥ నీవ ॥

శంకరాభరణం

అలివేణిని( బెండ్లాడవయా
చెలులవిన్నపము చేకొనవయ్యా

సొలపుల( దొలితొలి చూచినచూపులు
కొల(దిమీర నుంకువలాయ
చెల(గి చేతులను నేసినసన్నలు
తల(ప(గ నలుగడ( దల(బాలాయ

ననుపున సెలవుల నవ్వినవ్వులు
గొనకొన(గ( బాలకూళ్ళాయ
అనువుగ ప్రియమున నాడినమాటలు
మనసిజతంత్రపుమంత్రములాయ

వేడుకకౌ(గిటివినయపుచే(తలు
కూడినకూటపుగురులాయ
యీడనె శ్రీవేంకటేశ యేలితివి
తోడలమేల్మంగ దోమట్లాయ

రేకు 904

వేళావళి

ఏమిటికి( జలము యెందా(కా
నాములతోడుత నగవే యిక(ను

బలుము లేమిటికి( బచరించేవే

మగనితోడ పలుమరు నిపుడు
అగడుసేతురా ఆతని నింతేసి
చిగురుమో వొసఁగి చెలఁగుటగాక

కూడినవేళను గుట్టుసేతురా
యీడనె శ్రీవేంకటేశునెడ
ఆడకు వెంగెము లలమేల్మంగవు
పీడెము లంటుక వెలయుటగాక

రామక్రియ

అవునయ్యా నీసుద్దు లటువంటివి
జవళితో నంటుబచ్చలివంటివాఁడవు

చెలరేఁగి యేడలేని చేఁతలెల్లాఁ జేసివచ్చి
వెలయ నిప్పుడు నమ్మ వేఁడుకొనేవు
పలుమారు నీచేత బాసలుగొన వెరతు
కలువకంటులయెడ కాతరీఁడ వనుచు

వాడవారిపైనెల్లా వలపులు చల్లి వచ్చి
యీడ నాతో నేడలేని యిచ్చలాడేవు
కోడెకాఁడ నీవోః కొనియాడ సిబ్బితయ్యీ
జాడతో నింతులయెడ చంచలుఁడ వనుచు

పెక్కుగోపికలనెల్లాఁ బెండ్లాడి యిట వచ్చి
గక్కన నాకాఁగిటఁ గలసితివి

చెలులాల చూడరే చెలువునిబాగులెల్లా
నిలువుఁజక్కఁదనాల నిలుచున్నాఁ డీడను ॥ పల్లవి

ఇయ్యఁగదే విడెము యిందాఁకా నేడ నుండెనే
నెయ్యపురమణుఁడంటా నే నుంటిని
పయ్య దంటవచ్చీని పలుమారు నన్నుఁ జూచి
కొయ్యతనాలు నేరిచె గొంకఁ డేమిటికిని ॥ చెలు

అడుగవే సుద్దులు ఆడ నుండి తా వచ్చె
నడుమఁ దనప్రియాలు నమ్మితిని
వొడివట్టి పెనఁగీని వొనరి సంతోసాన
గడుసాయఁ జేఁతలను కరఁగఁ డెంతయినా ॥ చెలు

మొక్కవే నామారు ముంచి నన్నిటు గూడె
యిక్కడ శ్రీ వేంకటేశు కిరవైతిని
అక్కరతో మన్నించీని అలమేలుమంగ నేను
తక్కక రతుల మించీ దంట తనమునను ॥ చెలు ॥ 2

దేసాళం

ఇందరు నెఱఁగిసవే యీసుద్దులు
యెందాఁకా వట్టిమాయ లేఁబనేసే నిపుడు ॥ పల్లవి

తప్పులుదారులు నన్ని తానె తేరీఁగాని
చెప్పరాదా నీమాట చేరి వినేను
అప్పట నుండియు నీపు అఱత్తపడే విట్టె
నెప్పున నీనిజములు నెరపేవు సారెకు ॥ ఇంద

చూపరాదా నీమోవి చూచే నేను
పైపై నే మలసేవు పంతగారితనమున
వోపికఁ జెలుల నేమి నొడఁబరచేవు

పాడియునుఁ బంతమును బాయిటఁబడీఁ గాని
కూడరాదా నీవు నన్నుఁ గోరి మెచ్చేను
వేడుక నేలితివి శ్రీ వేంకటేశ ఇంతలోనే
యీడ నే నలమేల్మంగను ఇంపు నాకుఁ జేసేవు ॥ ఇ

పాడి

బొంకనితప్పనియట్టి పురుషుఁడవు
మంకుదీర నీవెట్లా మాటలాడేవయ్యా

చనవుచేసుక ఇంతి సారె సారె నొలయఁగా
ననుపుచేసుక నీవు నవ్వఁగాను
మొనసి సవతులెల్లా మోములు చూచుకొనేరు
పొనుగక వారినెట్టు బుజ్జగించేవయ్యా

ప్రియము గూరిచి యాపె బెట్టియాన వెట్టఁగాను
క్రియగూడ నీవు నట్టె కెలయఁగాను
కయిపుగాఁ దోడివారు కనుసన్నలఁ జూపేరు
నయమున వారి నెట్టు నమ్మించేవయ్యా

మక్కువ ని న్నలమేలుమంగ గాఁగిలించఁగాను
నిక్కి శ్రీ వేంకటేశుఁడ నీవు మెచ్చఁగా
తక్కిన సవతులెల్లా[1] నాసగించేరు
అక్కరతో వారినెట్టు ఆదరించేవయ్యా ॥ బొ

ఎటువంటివలపో యెవ్వరికొలఁది గాదు
ఘటనతోఁ దమకించీఁ గనుఁగొనవయ్యా ॥ పల్లవి ॥

తటుకున నిన్నుఁ జూచి తలవంచుకొని యింతి
తలపోసీ నీరూపు తనలోననె
నిలువుఁజెమటతోడ నిట్టూరుపులతోడ
చెలరేఁగి గుబ్బతిలీఁ జిత్తగించవయ్యా ॥ ఎటు ॥

కోరి నీపై నాసపడి గొబ్బునను సిగ్గువడి
పేరఁబెట్టి మాటలాడీఁ బెదవులనె
సారపుతుఝముతోడ జవ్వనభారముతోడ
ఆరీతి నివ్వెరగందీ నాదరించవయ్యా ॥ ఎటు ॥

కాఁగిటికిఁ జెయ్యి చాఁచి కన్నులనే నీకు మొక్క
మూఁగినమోవి యిచ్చీ మతకాననె
చేఁగదేర నిన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడ
వీఁగ దలమేలుమంగ వినోదించవయ్యా ॥ ఎటు ॥ 24

905 భల్లాటి

ఏమిటికి మాముందర యెమ్మెలెల్లాఁ జూపేవు
నేమూ నీవలె మేలు నెరపఁగఁగలమే ॥ పల్లవి ॥

చక్కనిదాన వౌదువే సణఁగులాఁడి వౌదువే
నిక్కి విభునిఁ గొసర నేరుతువే
దక్కినే నీపంతములు తరుణులలోనెల్లా

నవ్వు లీడేరెనే నీకు నడుమ నిందరిలోన
బువ్వాన సీతని నింత పొందు సేసుకొంటివి

మేటి వొదువే అలమేలుమంగ వొదువే
పాటించి శ్రీ వేంకటేశుఁ బనిగొంటివి
మాటలు చెల్లె నీకు మావంటివారిలోనెల్లా
చాటువ మమ్మేలితని చనవు గైకొంటివి ॥

పాడి

ఎంతైనా నాతఁడు నీకు నెక్కుడుగాదా
కాంతుఁడు మన్నించఁగానే ఘనురాల వైతివి

వెక్కసములాడకువే విభునితో సారె సారె
మిక్కిలి నాతఁడు నీకు మేలువాఁడు
చక్కవపిట్టలవంటిచన్నులు విసికెనంటా
వుక్కవంటి గోరనేల వూఁదేవే నీవు

ఆరితేరి యెంచకువే అండనుండి ఇంతలోనె
చేరి నీకుఁ బ్రియములు చెప్పీ నాతఁడు
తోరపుమొయిలువంటితురు మాతఁ డంటెనంటా
బీరానఁ జేతులు చాఁచి పెనఁగుదురటవే ॥

నీ వలమేలుమంగవు నిందలు వేయకువే
శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జెందినవాఁడు
ఆవటించి నిన్నుఁగూడి యట్టె చెక్కుంటెనంటా
కావరించి నీ వప్పటి ఘాత సేయఁదగునా ॥ ఎం

సూటిగా నన్నమి చూచవు
   నీటుతోడ నన్ని నేరుపవయ్యా ॥ పల్లవి ॥

నవ్వుతా నిన్ను నాయము లడిగీ—
   నెవ్వతో ఆనతి యియ్యవయ్యా
   జవ్వని యప్పటి సరిజేసుకాడీ
   వువ్విళ్లూరఁ బందే లొగి వేయవయ్యా ॥ సూటి ॥

మచ్చికతోడుత మనవి చెప్పి
   విచ్చనవిడిని వినవయ్యా
   వచ్చి యాపె నీతో వసంతమాడీ
   పచ్చివలపులు పైఁ జల్లవయ్యా ॥ సూటి ॥

పలుమరు నీపైఁ బాటలు వాడీ
   మెలుపున నిట్టె మెచ్చవయ్యా
   అలమేలుమంగనై నన్నేలితి—
   వెలమి శ్రీ వేంకటేశ నేఁడయ్యా ॥ సూటి ॥ 2

## దేవగాంధారి

మిక్కిలి మేలుది అలమేలుమంగ
   అక్కరతో నిన్నుఁజూచీ నలమేలుమంగ ॥ పల్లవి ॥

కొచ్చి కొచ్చి యాశా(లా?)పించి కూరిమితోఁ బాడఁగాను
   మెచ్చీ నిన్నునిదె యలమేలుమంగ
   నెచ్చెలులతోడనెల్లా పొసఁగాలు సారెసారె

... నడ కలమేలుమంగ

యీలీల శ్రీ వేంకటేశ ఇంతచన వియ్యఁగాను
మేలములాడీ నలమేలుమంగ
యేలినవీరతులను ఇదె తననేరుపెల్లా
ఆలోచనలు సేసీ నలమేలుమంగా || మి

శ్రీరాగం

ఎట్టు దరించఁగవచ్చు నిల్లాండ్లకు నూరిలోన
చుట్టమవై సిగ్గుతెల్లా చూరలాడేవు ||

మాయదారిమాట లాడి మనసులు మరిగించి
పాయపుగొల్లెతలను భ్రమయించేవు
చాయలుసన్నలుఁ జేసి చవులుగా మోవిచూపి
ఆయములు గరఁగించి ఆసరేఁచేవు

నెలవుల నవ్వునవ్వి చిట్టంటుచేఁతలు సేసి
కలికిజవరాండ్లఁ గాఁకరేఁచేవు
ప్రియముల నవ్వునవ్వి పెంపుగఁ గాఁకలఘుంచి
నయగారితనమున నమ్మించేవు

కన్నులఁ దప్పక చూచి కౌఁగిటను బిగియించి
కన్నెలనుఁ జొక్కించి కైకొనేవు
అన్నిటా శ్రీవేంకటేశ అలమేలుమంగను నేను
మన్నించి నన్ను నేలి మంతనమాడేవు || ఎట్టు

వింతలుగా సిగ్గులెల్లా విడిచినమీఁదట
యెంతకొసరినా నందు నేమిగలదయ్యా

నావద్దనుండి యాకెతో నవ్వులు నవ్వితివి
భావించి చూచిన నీకఁ బనియేది
వేవేలకు మతిలోనివెరపు దీరినమీఁద
చేవమీరినసుద్దులు చెప్పఁ జోటేదయ్యా

చలివాసి యాకెతోనే సరసములాడితివి
పలుమారుఁ బచ్చినేయఁ బనియేది
అలమేల్మంగనైన నన్నట్టె యేలితివి
యెలమి శ్రీవేంకటేశ యెట్టు మెచ్చేదయ్యా

రేకు 906 మనోహరి

అలమేలుమంగవు నీ వన్నిటా నేరుపరివి
చలములేఁటికి నీఁక సమ్మతించవే

విడియము చేతికిచ్చి విభుఁడు వేడుకపడి
వాడివట్టి పెనఁగగా నొద్దనకువే
వుడివోని వేడుకతో నుంగరము చేతికిచ్చి
యెడయక వేఁడుకొనఁగా నియ్యకొనవే

కొప్పు దువ్వి బుజ్జగించి కొసరి మాటలాడి
అప్పసము నవ్వఁగాను అట్టె కానిమ్మనవే

యిచ్చగించి శ్రీవేంకటేశ్వరుఁడు నిన్నుఁ గూడి
మచ్చికఁ గాఁగిలించఁగాను మారాడకువే
పచ్చడము మీఁదఁ గప్పి పట్టపుదేవులఁ జేసి
నిచ్చలాన నేలుకొనె నీవూఁ గైకొనవే ॥

కురంజి

ంతకాకు గలదా యేమోయి చెలులను
చెంతల మందెమేళాలు సేసుకొంటి విట్లా

యేకతాన నీవు నాకు నిట్టె కతలు చెప్పఁగా
దాకొని సతులెల్లాను తామూ వినేరు
జోకతో నీవు విడేలు సొరిది నాకందియ్యఁగా
చేకొని తామూ నట్టె చేతులు చాఁచేరు

సరసమాడుచు నా చన్నులు నీవంటఁగాను
సొరిదిఁ దమచన్నులు చూపేరు నీకు
తెరలో నాకు నీ మోవితేనె విందువెట్టఁగాను
గరిమఁ దామును నట్టె కడునోరూరేరు

పలుమారు నీవు నాకుఁ బచ్చడము గప్పఁగాను
కలికికాంతలు తమ్మూఁ గప్పుమనేరు
అలమేల్మంగనైన న్నట్టె నీవు కూడితేను

కొలువులోపలనున్న కొమ్మలెల్లా నవ్వేరు
కొలఁదిమీరకువయ్య గోవిందరాజా

పాదములొత్తేయట్టిపడఁతికి నిదివో
అదిగాని చెమరించె నంగమెల్లాను
కాదనక పచ్చడము గప్పి మఱఁగునసె
పోదితో నాపెఁ దనివిబొందిఁచవయ్యా

సరుసఁ గూచుండినట్టిసకియకు నిదివో
సిరులుగాఁ బులకించె చెక్కులెల్లాను
తెరవేసుకొని సిగ్గుదేరిచి గుట్టునసె
గరిమతో లోలోనె కాఁగిలించవయ్యా

శ్రీసతికి భూసతికిఁ జేరి కూడఁగ నిదివో
రాసి నిట్టూర్పులు మిఁచె రతులలోనా
ఆసతోడుత శ్రీవేంకటాద్రిగోవిందరాజ
లేసుగా నిద్దరిని లాలించఁగదవయ్యా

వరాళి

ఎంతలేదు నీయాసోద మేమిచెప్పేది
బంతినుఁడి రతులకే బాఁతిపడేవు

చెలులై తేఁజాలు నట్టె చేరి యెంతవడియైనా
మలసి మలసి నీవు మాటలాడేవు

వుప్పతిలుఁదమకాన నోలలాడేవు
చిప్పిల నవ్వితేఁజాలు చెంతల నట్టెభ్రమసి
వొప్పగుమోవితేనెకు నొగి నోరూరేవు ॥

కాఁగిలించుకొంటేఁజాలు కడుసంతోసముతోడ
చేఁగదేరి వలపుల చిమ్మిరేఁగేవు
ఏఁగక శ్రీ వేంకటేశ వెస నన్నుఁ గూడితివి
పాఁగినతరితీపులఁ బచ్చిదేరేవు ॥ ఎం

ముఖారి

ఏమే విభునినేల యెలయించేవే నీ-
మోమున సింగారాలు మొలచున్నవి ॥

నెలవుల నొకమాటు చేరి నీవు నవ్వితేనే
వెలలేనిమహిమలవెన్నెల గాయు
తళుకున నీవటు తప్పక చూచితేనే
నిలువెల్లాఁ జీఁకటుల నిగ్గుదేరును

మురిపేన వాతెరమోవి నీవు చూపితేనే
సొరిదినే పగడాలసొంపు నిండును
మరుగుచు నీవిట్టె మాటలు సారె నాడితే
యిరవై కప్రపుపల్కు లిటు నిండును

సందడి నీపయ్యదలో చన్నులు చూపితేనే
కుందణం(నం?)పువన్నెలెల్లా గుదిగొనును

[illegible]

ఎంతవేడుకకాఁడవు ఇన్నిటా నీవు
సంతసించేవు మోహము చల్లినంతనె

వన్నెవచ్చె మేనికిని వాడుదేరె మోమెల్ల
కన్నులను నాపె నీవు గాంచినంతనె
చెన్నుమీర సంతోసాన చెక్కులెల్లాఁ బులకించె
పన్నుగా నాకెమాటలు విన్నంతనె

ఆసవుట్టె మనసుకు అరిమురిఁ జెమరించె
నేసవెట్టి యాపె నిన్నుఁ జేరినంతనె
వాసిమీర పైపైనే వలపులు గడుమించె
చేసన్నలు నీయెడకుఁ జేసినంతనె

నిట్టూరుపులు రేఁగె నిండుఁదమకము నిండె
గుట్టుతోడ నీవు రతిఁ గూడినంతనె
అట్టె శ్రీ వేంకటేశ ఆనందము గడునుబ్బె
చుట్టి ఆకెఆయములు సోఁకినంతనె ॥

రేకు 907 ఆహిరి

ఎడసి కూడినపొందు ఇంపులాయను
తడవి మీభావములు తలపోసేమయ్యా

చెక్కునఁ బెట్టినచెయ్యి నెలవిఁ బారేటినవ్వు
వొక్కమాటే చెలియకు నొనగూడెను

యీ రెండు నింతికి నిచ్చి ఇరవాయను
అరయ వోరమణుఁడ అమరించితివి రీతి
యేరుపరచి మీసుద్దు లెంచుకొనేమయ్యా ॥ ఎద

పయ్యెదలెడజారును పచ్చిదేరేరతిచొక్కు
నెయ్యపుఁగామిని కిచ్చె నెలవాయను
యియ్యెడ శ్రీవేంకటేశ యెనసితి వింతలోనె
చయ్యన మిమ్ముఁ బొగడి సంతోసించేమయ్యా ॥ ఎద ॥ 3

బౌళి

చెక్కునొక్కి ఇచ్చకము సేతురుగాక
వెక్కసపుసేఁతలను వింత సేతురా ॥ పల్లవి

వలచినరమణుఁడు వాడికెకు నీమీఁద
కలువల వేసితేను కాఁతాళింతురా
తలుపుదెరచి నీదండఁ గూచుండినవాని
చలపట్టి బొమ్మలను జంకింతురా ॥ చెక్కు

పొందైనమగవాఁడు బుజముపైఁ జెయివేసి
కందువ లంటితేనే కాదందురా
విందులమోవి చూపి విడెమడిగేటివాని
మందెమేళములాడుచు మారుకొందురా ॥ చెక్కు

శ్రీవేంకటేశుఁడు చేరి నిన్నుఁ గాఁగిలించి
ఆవటించి కూడితేనే అలయుదురా

చిత్తగించవోయి నీవు శిరసువంచుకొనక
  చిత్తరాన నీకె నీపై బ్రియము చల్లీని

పలుచనిసిగ్గుతోడ బాసికము గట్టుకొని
  చెలరేఁగి సతి నీపై సేసచల్లీని
  చెలులమాటుననుండి చిప్పిలుఁదమకమున
  తళుకుఁజూపుల నిన్ను తప్పక చూచీని

చెంది మురిపెముతోడ సింగారించుకొని
  కందువ లంటుచు నీకాలుదొక్కీని
  సందడివేళలందు జాణతనాలాడి నీకు
  ముందుముందుగాఁ దాను మోవి చూపీని

గాటఁపుటాసలతోడ కంకణము నీకుఁ గట్టి
  పీఁటమీఁదఁ గూచుండి పెండ్లాడీని
  యీటున శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
  మేటియై యిందుకు నాపె మెచ్చు మెచ్చీని ॥

అమరసింధు

ఉచిత మెఱఁగవద్దా వువిదలకు
  రచనల నీసరి రాదా యెవ్వరును

యింతులెల్లా నిలుచుండి యిట్టె కొలువుసేయఁగ
  మంతనములాడేవు మగనితోను

వివరించి వెతనవా నువుమీఁది
కవగూడఁగా నీకే కాణాచాయనా యేమి
తవిలి నీసాటికి రాఁదగదా యెవ్వరికి ॥ ఉచి

తోడివారెల్లా నట్టె వూడిగాలు సేయఁగాను
వేడుకఁ గూడితివి శ్రీవేంకటేశుని
కూడిమాడి నీవే రతిఁ గొల్లగొంటివా యేమి
వోడక నీవంటియాస వుండదా యెవ్వరికి ॥ ఉచి ॥

సౌరాష్ట్రం

చూడవయ్యా నీ సేఁతలు సూటిపడేను
ఆడరాదు నీతో మారు అవుఁగాదనుచును ॥ పల్లవి

సరసములాడితివి చనవు లొసఁగితివి
తరుణితోడ నీవు తమకానను
యిరవై యీపె నేఁడు యేమిభాగ్యము సేసెనో
సిరులవలపులెల్లా చెక్కుల నిండెను ॥ చూడ

సేవ సేయించుకొంటివి సిగ్గులు దేరిచితివి
భావించి వనిత నింత పనిగొంటివి
పావనమె తనజన్మఫల మదియెట్టిదో
చేవదేరినవలపు మోవిమీఁద నున్నది ॥ చూడ

గక్కనఁ బెండ్లాడితివి కాఁగిటఁ గూడితివి
మిక్కిలివేడుక నలమేలుమంగను
యిక్కువ శ్రీవేంకటేశ యెటువంటితగులవో

సుదతివున్నజాడలు చూతువు రావయ్యా

యిప్పుడే వచ్చేవని యింటవాకిటను చెలి
కప్పురపుటారతెత్తఁ గాచుకున్నది
దప్పిదేర నీకునేల(నీయఁ?) తట్టిలోన బాగాలు
కుప్పలుగా మీఁదెత్తుకొని వున్నది

ఆరగించవచ్చేవని అన్నిదెరఁగులనెల్లా
చేరి విందాయితముగాఁ జేసుకున్నది
గారవానఁ బాదాలుగడిగేనంటాఁ బన్నీరు
ఆరీతిఁ బైఁడిబిందెల నమరించకున్నది

పవళించవచ్చేవని పట్టెమంచముమీఁదట
వివరించి పూఁబరపు వేసుకున్నది
నివిరి శ్రీవేంకటేశ నీవు విచ్చేసి కూడఁగ
తవిలి యలమేల్మంగ తనివితో నున్నది

రేకు 908. శుద్ధదేశి

ఇప్పటికిఁ జనవరి యింతి నీకు
కొప్పుదువ్వి నన్నునేల కొంగువట్టే విభుడు

మలసి నీవు నాతో మాటలాడితివంటాను
సొలసీ నాపె నిన్నుఁ జుట్టి చుట్టి
కలికి యన్నిటా కదుఁగతలెల్ల నేరుచును

గునిసీ నాపె నిన్నుఁ గొచ్చి కొచ్చి
ధనవరివినోదాల సరసురా లన్నిటాను
వొసర నాపెతో నవ్వి వుండవయ్యా నీవు ॥ఇప్పు

గక్కన నన్ను నీవు కాఁగిటఁ గూడితివంటా
కక్కసించీ నాపె నిన్నుఁ గమ్మి కమ్మి
నిక్కి శ్రీవేంకటేశుఁడ నే నలమేలుమంగను
తెక్కుతోనే యాపెఁ గాగిలించవయ్యా నీవు ॥ఇప్పు॥ 4

తెలుఁగుఁగాంబోది

నీవే యెరఁగుదువు నానెయ్యము వోరమణి
భావములోపల నుండి భ్రమయించనేఁటికి ॥పల్లవి

చూపుటమ్ము బొమ్మవింట జోడై నిలిచెఁగాన
చేపట్టి మర్మవేదనఁ జేయుఁగాక
కోపులమంచితనపుఁగుచమండలము నేఁడు
యేపునఁ బ్రాణాలతోడ యేలాట మెట్లాడీనే ॥నీవే

తొడఁగి మబ్బుగవిసి దొడ్డకుటిలపుఁగొప్పు
కడుఁగామాంధకారముఁ గప్పుఁగాక
నడుమ మోముఁజంద్రుఁడు నవ్వువెన్నెల గాయుచు
చిడుముడి నామదినిఁ జీఁకటేల సేసీనే ॥నీవే

పచ్చిదొండపండ వంటిబాగుల రాగపుమోవి
రిచ్చవడ మోహము రేఁచుఁగాక

తరుణులతోడనా నీతరితీపులు
తొరలింపుఁగూరిముల దొరపాటివాఁడవు ॥పల్లవి॥

వలచినసతితోను వాసికిఁ బెనఁగుదురా
పలుకులునేరిచినపంతగాఁడవు
బలిమిఁ జెనకఁగాను పరాకు సేయుదురా
నెలకొన్నజవ్వనపునెరవాదివాఁడవు ॥తరు॥

ఆసగించివున్న యింతి నారఁడిఁ బెట్టుదురా
సేసవెట్టిపెండ్లాడినచెలువుఁడవు
సీసరిఁ గూచుండఁగాను సీటులు చూపుదురా
వేసటలేనిరతులవేడుకకాఁడవు ॥తరు॥

అలమేలుమంగఁ గూడి అలయించి నవ్వుదురా
తెలివి శ్రీవేంకటాద్రిదేవుఁడవు
కలసి మొక్కఁగా మోవి కడుపిప్పి సేతురా
తలపోఁత లెఱిఁగిన దయగలవాఁడవు ॥తరు॥ 45

వసంతవరాళి

ననుఁ జూడవే ఇఁకను నాసొమ్ము చేసుకొనేను
ఘనుఁ డీతనిచెయ్యి సోఁక గైదండ చేకొంటిని ॥పల్లవి॥

చనవరి నవు చలమరిదానవు
యెనలేే కాతనిఁ గూడ కేల మానేవే

సతముగా నన్నిటా సమ్మతి చేసుకొంటివి
బలుతు నీవలె నిట్టె ప్రచరించవలదా

పాయరానదానవు పంతగారిదానవు
చాయల నేపొద్దూనేల ఉంటవానేవే
రేయి వచ్చి శ్రీ వేంకటాద్రిగోవిందుఁడే నన్నేలె
యీయెడ నవ్వునవ్వితి వింతమెచ్చవలదా ॥ న

సాళంగం

వలపేల దాఁచేవే వనిత నీవు
తిలకించి యెంతతరితీపునేసేవే

పలుమారు నాతఁడు బాఁతిపడి పిలువఁగా
వొలసీనొల్లమి నేల వూఁకొనేవే
బలిమి నాతఁడు నీకు పచ్చడము గప్పఁగాను
అలరి వొయ్యారాన నట్టె లోనయ్యేవే

చిమ్మిరేఁగి యాతఁడు చేసన్న సేయఁగాను
వుమ్మడిజాగుతోనేల వొద్దికయ్యేవే
నెమ్మితోడ నాతఁడు నీకు విడెమియ్యఁగాను
చిమ్ముల మెల్లనే యెట్టు చేయిచాఁచేవే

అట్టె శ్రీవేంకటేశుఁడు అంకెఁ గాఁగిలించుకోఁగా
గుట్టునఁ గరఁగి యెంతగుబ్బతిల్లేవే
యిట్టె యాతఁడు నిన్ను నేలి నేఁడు మన్నించఁగా

మాకేల విన్నవించ మాపుదాఁకా నీతోను
దాకొని నీవే దయఁ దలఁచేవుగాని ॥పల్లవి॥

హత్తి రమణి విలిచి నాడకు విచ్చేయరాదా
చిత్తము వచ్చినట్లాఁ జేసేవుగాని
మొత్తమి నిప్పుడే నీవు మొగము చూడఁగరాదా
యిత్తల నన్నియు నీవే యెఱిఁగేవు గాని ॥మాకే॥

మనసిచ్చి యేకతాన మాటలాడి చూడరాదా
పనివడి నీవే నిజపట్టేవుగాని
చెనకుచుఁ బానుపుపైఁ జేరి కూచుండఁగరాదా
ననిచి మానిజమెల్లా నమ్మేవుగాని ॥మాకే॥

కక్కసమేఁటికి యాకెఁ గాఁగిలించి కూడరాదా
మిక్కిలి శ్రీవేంకటేశ మెచ్చేవుగాని
యిక్కువ నిప్పటిపొందు యిట్టె యీడేరించరాదా
మక్కువలు సేసి నీవే మరిగేవు గాని ॥మాకే॥ 48

909. నాగగాంధారి

ఇంకా నేమనేవయ్యా యెదుట నుందాన నేను
కుంకుమ నీకుఁ బూయనా గురుతుగా నేను ॥పల్లవి॥

సన్నలు నీవు సేయఁగా సమ్మతించి కాదనక
విన్నపము సేయనా వేడుకతోడ

ఆయములు సోఁక నిన్ను నాదనా నేను
దాయక పాయక నీవు దండ నిట్టె కూచుండఁగా
నేయనా వూడిగములు చెప్పినట్టెల్లాను

పంతమున కాఁగిటను బలిమి నీవు గూడఁగా
మంతనాన మెచ్చనా మచ్చికతోడ
చెంతనే మన్నించితివి శ్రీవేంకటేశ నన్ను
సంతోసించనా నీసరసములకును ॥ ౬

మాళవి

వేగిరకాఁడవు నీవు వెసలఁ బెట్టుమనేవు
ఆగడము నేసి యేల అలయించేవు

చలము సాధించరాదు జంకించి చూడఁగరాదు
యెలమి నింతలో నేరా యెగ్గుపట్టేవు
బలిమి చూపఁగరాదు పంతములాడఁగరాదు
తిలకించి యేమిరా తిట్టు దిట్టేవు

బెట్టిమాటాడఁగరాదు బిగువు చూపఁగరాదు
అట్టు అదేరా ఇట్టె యేఁచేవు
గుట్టున నుండఁగరాదు కొసరి నవ్వఁగరాదు
వుట్టిపడి నీవేరా వుప్పతించేవు

కదిసి పెనఁగరాదు కాఁగిలించుకొనరాదు
వుదుటున నౌరారా వొడివట్టేవు

మేలు మేలు నీగుణము మెచ్చితి నేను
నీలీల లోకమెల్లా నిండెఁగా నేఁడు ॥పల్లవి॥

లపుగలుగువారు వద్దనే వుందురుగాక
తిలకించి వాడలకుఁ దిరుగుదురా
తెలిపి చెప్పఁగనేల తేటతెల్లమిగ నాపె-
కలువదండ నీ మెడఁ గంటిగా నే నిపుడు ॥మేలు॥

నుపుగలుగువారు నవ్వుతానుందురుగాక
తనివో కెవ్వతెనైనాఁ దలపోతురా
వెనకటి సుద్దులేల వేడుకతో నాపెచేతి-
కొనవేలివుంగరము గురుతాయఁగా ॥మేలు॥

వసమైనవారు కాఁగిట నుందురుగాక
ఆవలివారితో మేలాలాడుదురా
శ్రీవేంకటేశ నన్నుఁ జేరి యిట్టెకూడితివి
నీవే నన్ను మన్నించుట నిజమాయఁగా ॥మేలు॥ 51

కేదారగౌళ

ద్దరిఁ గూర్చఁగదవె యింతిరో నీవు
సుద్దులు చెప్పేనంటే చోటెంతైనాఁ గలదు ॥పల్లవి॥

డఁతి కడకు నిట్టె పతిఁ దోడుకొనిరావె
యెదమాట లాడఁబోతే యెన్నిలేవు
వెడవెడ మాని యట్టె విడెము చేతి కియ్యవే

సద్దరఁ బొమ్మమీఁదఁ గూచుండఁ బెట్టవే
తగవులఁ బెట్టేమంటే తనివిలేదు
బిగి వాయకుండా నట్టె పచ్చడము గప్పవే
పగటు లాతనివి చెప్పఁగఁ గొత్త లిపుడు ॥

శ్రీవేంకటేశ్వరుచేత నేసలు వెట్టించవే
వావులు దెలుపఁగాను వయిపాయను
దేవులకు దేవునికి తెరవేయఁగదవే
చేవదేరేమోహము చెప్పనరు దిఁకను ॥ ఇద్ద ॥

గుండక్రియ

దేవరవు గావా యీ తెలుఁగులకు
చేవదేరె నిఁక రట్టునేయఁగవలెనా ॥ పల్లవి ॥

అఱిముఱి నూడిగాలు ఆపెచేతఁ జేయించేవు
యెఱఁగనా నీజాడ తెప్పుడు నేను
మఱి నీవు దొరవౌదు మనసున మెచ్చితివి
గుఱుతులు నాకిన్నిటాఁ గొచ్చి చూపవలెనా ॥ దేవ

కానుకగా నాపెసొమ్ము గక్కన నాకిచ్చేవు
కానవా నీ నేఁతలు కలకాలము
పూని విజమరి వౌదు పొంచి నిన్ను నమ్మితిమి
తావకమై అనుద్దులై తలపెట్టవలెనా ॥ దేవ

అలమి నన్నుఁగూడి ఆపెపేరఁ బిలిచేవు
తెలియనా నీగుట్టు తెల్లమిగాను
యిల జాణఁడ వౌదువు

తొల్లె ఇన్నిటా నీవు దొడ్డవాఁడవు
చెల్లఁబెట్టి యిందరితోఁ జెప్పఁగ నేమిటికి ॥పల్లవి॥

పలుకులఁ గరఁగించి భావములఁ జొక్కించి
నెలఁతల వలపించ నేరవా నీవు
వెలయ గొల్లెతలెల్లా వెన్నతోఁ బెట్టిరి నీకు
పొలసి నీ మహిమలు పొగడ నేమిటికి ॥తొల్లె॥

నముపులు గడుఁజేసి నయములట్టె చూపి
వొనరఁ బెండ్లిండ్లాడ నోపవా నీవు
చనవిచ్చి రుకుమిణి సాముసేయించెను నాఁడె
పెనఁగుచు మెచ్చి నిన్నుబ్బించఁగ నేమిటికి ॥తొల్లె॥

చెక్కులు వేమరు నొక్కి నేఁతలన్నియునుఁ జేసి
లెక్కలేనిరతి సేయలేవా నీవు
యిక్కువతో శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
తక్కిననీపొందులెల్లాఁ దడవ నేమిటికి ॥తొల్లె॥ 5

ప 910 ఆహిరినాట

ఎంతలేదు నీపగటు యెందాఁకానే
కాంతుని కిచ్చకమాడి కలయఁగరాదా ॥పల్లవి॥

వేడుకకు రమణుఁడు వేమారు నవ్వితేను
జాడెఱఁగక బొమ్మల జంకించేవే

పెలుచవై సారెనేల పెనఁగేవే
కొలువులోపలనున్నకొమ్మలఁ గాఁగిలించితే
చలపట్టి నీవు మరి సాదించేవటే

శ్రీ వేంకటేశుఁడు నిన్నుఁ జేరి యిట్టె కూడితేను
ఆవటించి రతినెంత అలయించేవే
కావరించి వూడిగపుకాంతలతోఁ జెప్పితేను
తావుకొన్ననీవలపు దాఁచేవటే ॥ ఎం

రామక్రియ

ఎంతటివాఁడవు నిన్ను నేమిచెప్పేది
కంతునితండ్రివౌట కంటిమి నేమెల్లాను ॥

తేనెలు(ల?)వంటిమాటలు తివిరి నీవాడఁగాను
అనుకొని వలచిరి యతివలెల్లాను
మోనముతోఁ బొరుగున మొక్కులు చేత మొక్కఁగ
మానలేక తగిలిరి మగనాండ్లెల్లను

జోడుగాఁ దరితీపుల చూపులు నీవు చూడఁగ
వేడుకతోఁ బైకొనిరి వెలయాండ్లు
వాడికెనవ్వులు నీవు వరుసతో నవ్వఁగాను
ఆడానీడాఁ బొందిరి పాయపుకన్నెలెల్లాను

సేయరానిమంతనపుసేఁతలెల్లాఁ జేయఁగాను
ఆయ మెఱిఁగి పెండ్లాడి రచ్చరలెల్లా
యీయెడ శ్రీవేంకటేశ యేలితివి మమ్ము నిట్టె

శంకరాభరణం

ఆకెఁ బిలువవయ్యా యిచ్చటికిని
కాకరిపను లడుగఁగవలె నిఁకను ॥పల్లవి॥

ననుపులమాఁటలు నాతోనాడఁగ
కనుఁగొని నవ్వీఁ గడ నొకతె
యెనయఁగ నీగుణ మేమిదెలిసెనో
వెనకటిపను లవి వినవలె నిఁకను ॥ఆకెఁ॥

సరసముతో నాసరులు దిద్దఁగా
కెరలుచు నటు గొణఁగీ నొకతె
ధర నీసేఁతలు తానేమెఱుఁగునొ
గరిమ లన్నియును గనవలె నిఁకను ॥ఆకెఁ॥

కందువతో ననుఁ గాఁగిలించఁగా
చెంది సన్న సేసీ నొకతె
యిందునె శ్రీవేంకటేశ కూడితివి
చందము లిటు మెచ్చఁగవలె నిఁకను ॥ఆకెఁ॥ 57

దేశాక్షి

మంచివాఁడవయ్య నీవు మరిగి సిగ్గువడవు
యెంచరాని నీవలపు ఇటు చూపవలెనా ॥పల్లవి॥

నవ్వులకు నీతోను నాతియానడిమాటలు

అందరిలో నేలచెప్పె వంగడి నీవు
అందుకొనేవు పయ్యెద అట్టె చన్నులు మూసేవు
ఇందులోనే తమకములు యిటు చూపవలెనా

కలసిమెలసి యింతి కాఁగిలించి కూడితేను
వెలినేల నవ్వేవు వేడుకతోను
యెలమి శ్రీవేంకటేశ యేలి కమ్మటి నంటేవు
యిలపై నీయెమెలెల్లా నిటు చూపవలెనా ॥ మ

శ్రీరాగం

ఎఱఁగరా నీసుద్దులు యింతులెల్లాను
అఱిముఱి దొడ్డివారమని మమ్మ నవ్వేవు

గొల్లవాఁడవై తిరిగి కోరి నీవు మరికదా
వెల్లవిరి మధురలో వెలవెట్టితి
పల్లదపునేఁతలతో పసులఁ గాచికదా
యెల్లవారికిని మరి యేలికవైతివి

బెరసి యశోదకు బిడ్డఁడవై వుండికదా
పొరలి దేవకినిజపుత్రుఁడవైతి
వరుసతో రేపల్లెవాడలఁ దిరిగికదా
నరపతివై ద్వారకానగర మెక్కితివి

మందలోనిసతులను పొంది పొంది మరికదా
అంది పదారువేలఁ బెండ్లాడితివి
యిందునె శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడికదా

పరగ నేఁ జేసినట్టి భాగ్యము గాక
సరస నీదేవుళ్లలో చక్కనిదాననా

మన్నించి నీవు నను మాఁటలాడించేవుగాక
యెన్నిక నీసతులలో నేమిబాఁతి
అన్నిటా నేరుపరివై యాదరించేవుగాక
కన్నెలు పదారువేలకంటె దొడ్డదాననా

యెల్లగా నాచే విడె మిప్పించుకొనేవుగాక
తొల్లిటికాంతలకంటె దొరనా నేను
మెల్లనె నాచన్నులమీఁదఁ జేయివేసేవుగాక
గొల్లెతలకంటె నే నెక్కుడుదాననా

నను పునఁ గూడి నన్ను నవ్వ నవ్వించేవుగాక
చనవరికాంతలసరివత్తునా
యెనసితివి శ్రీ వేంకటేశ నన్ను నింతలోనె
మనెడివారికంటె మలసేటిదాననా

కురే 911 శుద్ధవసంతం

ఇంతేసిమీగుట్టు లెవ్వఁ డెఱుఁగు
వింతలాయ నేఁడు వివరించఁగాను

చల్లనిచూపుల నీవు సారెఁ దన్నుఁ జూడఁగాను
మెల్లనిమాటల *ూపె మెచ్చనాడఁగా

నలువంకలను నాపె నవ్వఁగాను
తెలిసి రిందరు నేఁడు తేటతెల్లమిగాను
వెఱకులంటా నంటిటు ప్రియము లిందాఁకాను

శ్రీ వేంకటేశ నీవు చేకొని కూడఁగాను
కావరించి పయ్యదాపె గప్పఁగాను
యీవల మమ్మేలితివి ఇంతులు సంతోసించిరి
ఆవలపులే సతమనుచు నేముంటిమి ॥ ఇ

## సామంతం

మారుమాట లాడరాదు మరి నేరా లెంచరాదు
సారెకు విదివో నీసంగాతాలు

ఇచ్చకము లాడవలె ఇయ్యకొని యుండవలె
నిచ్చలు నేపొద్దు నాకు నీతో బదుకు
పచ్చిదేర నవ్వవలెఁ బనులన్నిఁ జేయవలె
గచ్చులను నీతోడికాఁపిరము నాకు

తప్పక చూడఁగవలె తమకము చూపవలె
నెప్పున నెప్పుడు నాకు నీపొందులు
ముప్పిరిఁ బొగడవలె మోహము చెప్పఁగవలె
కుప్పలుగ నీతోడిమక్కువనేస్తాలు

కలిసి వుండఁగవలె కాఁగిట బిగించవలె
తొలఁగరా దెంతైనా నీతో చెలిమి

అదివో నీచిత్తము ఆకెభాగ్యము
కదలిక లిందులోనే కనుకో నీవికను ॥ పల్లవి ॥

పున్నమవెన్నెలలోనఁ బొద్దువోక జవరాలు
నిన్నుఁ దలఁచి రేయల్లా నిద్దురవోదు
విన్నవించితిమి నీకు వేవేలకు నొక్కమాటె
యెన్నికలెల్లా నీవే యెఱుఁగుదు వికను ॥ అది ॥

చేరి యారామములోనఁ జెక్కుచేతితోడఁ జెలి
నీరూపు భావించి నివ్వెరగందె
యీరీతిఁ గానుక నీకు నిచ్చి వొప్పగించితిమి
తారుకాణ లన్నియుఁ దలఁచుకో యికను ॥ అది ॥

కనకపుమేడలోనఁ గామించి యలమేల్మంగ
తనివోనినీరతికిఁ దమకించెను
యెనసితివి శ్రీవేంకటేశ యింతలో విచ్చేసి
మన నొక్కటాయ నిట్టె మన్నించు మికను ॥ అది ॥ 63

రీతిగౌళ

ఏమిటికి దూరేవు యెరవులవానివలె
యీమోహమే నిజమైతే యింటికి రారాదా ॥ పల్లవి ॥

ంతనము గాకుండఁగా మాటలాడదాయఁ గాని
పంతముగాదు నీతోఁ బడఁతికిని

వెగ్గళించి కాడుసుమ్మీ వెలఁది నీతో
అగ్గమై సందడిలోనన్నైతే [1]గొల్లదోమటౌను
యెగ్గులేనివాఁడవైతే నింటికి రారాదా ॥ఏమి॥

కడుఁబరవశములుగాఁగా నవ్వదాయఁగాని
గడుసుగా దలమేల్మంగ నియ్యో[2]డను
అడరుచు శ్రీవేంకటాధిప కూడితి విట్టె
యెడయ కెప్పుడు నిట్టె ఇంటికి రారాదా ॥ఏమి॥ 64

ఆహిరి

చిత్తగించి నీవు దయ సేయఁగరాదా
బత్తిసేసి నీకుఁ గడుబాఁతిపడి వున్నది ॥పల్లవి॥

చెక్కు చేతఁబెట్టుకొని నెలవుల నవ్వుతాను
నెక్కొని యున్నది చెలి నీయెదుటను
వెక్కసపుఁదమకాన విడెము చేతఁ బట్టుక
యెక్కువైన యాసలతో నిచ్చగించి యున్నది ॥చిత్త॥

సారె జారుఁగొప్పుతోడ జవ్వనాన విఱ్ఱవీఁగి
నేరుపుతో మాటలాడీ నీ యెదుటను
బోరున నిన్నెచ్చరించి పువ్వుల వేసుకొంటా
కూరిములు గానరాఁగా గుట్టుతోడ నున్నది ॥చిత్త॥

అలరి కాఁగిటఁగూడి అలపుసొలపుతోడ
నిలిచె నలమేల్మంగ నీయెదుటను
యెలమి శ్రీవేంకటేశ ఇరవై పానుపుమీఁద
వెలసినసింగారాల వేడుకతో నున్నది ॥చిత్త॥ 65

---

[1]గీతలు గలవి చెలుమూరినందున నేనూహించిన యక్షరములు.

ఆనతియ్యవయ్య అదేల దాఁచేవ
యీ నేర్పు లేకుండితే నింత సేతువా ॥ పల్లవి

చెక్కులు నొక్కుచు సేదలు దేరిచి
పెక్కుప్రియాలు చెప్పేవు నాకు
యెక్కడ నెవ్వతె నెనసి వచ్చితో
యిక్కువ నూరకే యింత సేతువా ॥ ఆన

కన్నుల మొక్కుచు కందువ లంటుచు
యెన్నెసివేసాలు పన్నే వింధు
కన్నె నెవ్వతె నిక్కడకుఁ దెచ్చితివొ
యెన్నఁడైన నీవు యింత సేతువా ॥ ఆన

వావులు చెప్పుచు వరుసఁ గూడేవు
శ్రీవేంకటగిరి గోవిందుఁడా
దేవుళ్ళ నెందరిఁ దీపులఁ బెట్టితో
యీ వేళ నన్నేలి యింత సేతువా ॥ ఆన ॥ 6

912-వ రేకులేదు.

రేకు 913. శంకరాభరణం

చెప్పదు యెంతైనఁ జెలులకును
చొప్పులెత్తుచును సోదించరాదా ॥ పల్లవి

ననుపున నీవిటు నవ్వులు నవ్వఁగా

యెలమినిఁ బొడమినయింపు లెట్టివో
తిలకించి అవియుఁ దెలియఁగరాదా ॥ చెప్ప॥

గక్కన నీవిటు కాఁగిలించఁగా
చొక్కులు మించెను సుదతికిని
యిక్కువలు శ్రీవేంకటేశ యెట్టివో
మిక్కిలి మేలిఁక మెచ్చఁగరాదా ॥ చెప్ప ॥

కేదారగౌళ

నాతో నేలానవెట్టరే నడుమ మీరు
యీతల నాతనిచేఁత లెఱఁగనా నేను ॥ పల్లవి ॥

కడుబత్తిగలవాఁడు కడల కేలపోవునే
వొడయఁడై నావద్దనే వుండుఁగాక
వుడివోక మీరెంత వొడఁబరచేరే నన్ను
యెడనెడ తనగుట్టు యెరఁగనా నేను ॥ నాతో ॥

బాసలిచ్చినట్టివాఁడు పరుల నేల చూచునే
నేసవెట్టి కాఁపురము నేసుఁగాక
వేసరక మీరేల వేఁడుకొనేరే నన్ను
యీ సుద్దు లన్నియు ముందే యెరఁగనా నేను ॥ నాతో ॥

చేరి కూడినట్టివాఁడు సిగ్గులేల నెరపునే
వూరకే లోనై మరిగుండుఁ గాక
మీరెల్లా శ్రీ వేంకటేశు మెచ్చి

ఏమని వినెనో యిటు నీసరితళు
తామర విసురుచుఁ దాఁకించీని. ॥ పల్లవి॥

యీలాగున నీ వింటికి రాఁగా
వాలుకచూపులు వంచీఁ జెలి
ఆలరివై మాటాడకమునుపే
కోలుముందుగాఁ గొసరీని ॥ ఏమ ॥

వనుపున నీవిటు నవ్వులు నవ్వఁగ
కినియుచుఁ గడుఁ జంకించీని
చనవునఁ బైఁ జేయి చాఁచకమునుపే
పెనఁగుచు నానలు వెట్టీని ॥ ఏమ ॥

గక్కన నీవిటు కాఁగిలించఁగా
అక్కజపురతుల నలసీని
యిక్కువ శ్రీవేంకటేశ మునుపనే
చెక్కులు నొక్కుచుఁ జెనకీని ॥ ఏమ ॥ 69

నాగవరాళి

నేనొకటి సేయఁగాను నీ వొకటి భావించేవు
ఆనతీవయ్య యింక ననుమాన మేఁటికి ॥ పల్లవి ॥

చనవుగలదంటాను సారె నిన్నుఁ గొసరితి
ననుపుగలదంటాను నవ్వితి నేను

పెనమైతివంటాను కాఁగిలించితి
చేవదేర నీవేల శిరసు వంచుకొనేవు
నీవాళ్ళ నేమైనా మరి నేరములు గలవో

విన్నపము విందువంటా వేవేలు నాడితి
మన్నింతువంటా నిన్నె మరిగుంటిని
యిన్నిటా శ్రీవేంకటేశ యింతలో నన్నేలితివి
తిన్నఁగా నీవేమి బుద్ధిఁ దలఁచుకొంటివో ॥

కన్నడగౌళ

బాయిటఁ బడె వలవు పడఁతికి నీకును
యీయెడ నామోము చూచి యెంత నవ్వేవు

అక్కర యంతో కాని అప్పటప్పటికి నిన్నుఁ
జెక్కు నొక్కి చెలి నీపై సేసవెట్టీని
పక్కన నాకెసేసేబత్తి చేకొనఁగరాదా
యిక్కవ నామోము చూచి యెంతనవ్వేవు ॥

యేకతా లెట్టివో కాని యెదుటనే కాచుకుండి
మేకొని నన్నులునేసి మేలమాడీని
నీకేమి యీపెసలిగె నెమ్మదిఁ జెల్లించరాదా
యీకడ నామోము చూచి యెంతనవ్వేవు ॥

వేడుక యెట్టిదోకాని వెలఁది కాఁగిటఁగూడి
జోడై శ్రీవేంకటేశ చొక్కించీని
యీడుగా నన్నేలితివి

మలహరి

ఎఱిఁగినపనులకు నేల గుట్టు సేసేవు
గుఱిలేనికోరికలు గూఁటఁ బెట్టేవా

చెలపచెమట గారీఁ జెక్కులను
నెలవుల నవ్వులూరీఁ జెలియకును
పిలిచి మాటాడరాదా ప్రియుఁడవు
వలపులు దాఁచుకొని వడ్డి కిచ్చేవా

పున్నమవెన్నెల చిందీఁ గన్నుచూపుల
చన్నులఁ బులక లుబ్బీ సకియకు
మన్నించి కూడఁగరాదా మగఁడవు
పిన్నవయసుఁదనము పెట్టెఁ బెట్టేవా

ముప్పిరిఁ దేనెలు జారీ మోవిమీఁదను
చిప్పిలీఁ గళలవివో చిన్నిమోమున
యిప్పుడె శ్రీవేంకటేశ యేలితివి
తప్పకుండా రతులు వెదలు వెట్టేవా

సామంతం

ఆయలేవయ్యా సుద్దులన్నియు నెరుఁగుదుము
చాయకాఁడ వౌదువు సీసట లేఁటికయ్యా

మితిమీరినవలపు మిక్కుటమై వుండఁగాను
సతిమాటలెల్లా నీకుఁ జవులాయను

వొప్పి యాపెవిందులెల్లా నొద్దికాయను
ఇప్పు డెవ్వరైనా బోనమింటికి సీకుఁదెచ్చితే
చప్పనై తోఁచుఁగాక ఆసలు వుట్టీనా ॥ఆయ॥

పానుపుమీఁదిరతులు పచ్చిదోఁచి వుండఁగాను
తేనెగారేఆపెమోవి తీపులాయను
ఆనుక శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యేనెలఁతలందునైనా ఇటువలె మెచ్చేవా ॥ఆయ॥ 7

వేళావళి

తగుతగు నీదొరతనము లేఁక
పెగటులన్నియును వేడుకలాయ ॥పల్లవి॥

విరసపుతిట్లు వేవేలు దిట్టిన
సరసపువేళల చవులాయ
యెరవులచేఁత నీవేమి సేసినా
సరి నాకాఁగిట చందములాయ ॥తగు॥

బొమ్మజంకెనలు పొరి నెన్నైనా
సమ్మతించితే చవులాయ
దిమ్మరివై యెందు దిరిగివచ్చినా
నెమ్మి నన్నేలఁగా నేరుపులాయ ॥తగు॥

అంగము లలయఁగ నంటఁబెనఁగినా
సంగడిరతులను చవులాయ

నవ్వుతా నీసేవ సేతు నడుమ నేను ॥ పల్లవి ॥

మనసున నొకమాట మఱఁగున నొకమాఁట
యెనసి నే(న?)నయములు యెఱఁగ నేను (?)
వనితనై నీమీఁదివలపే గతియని
తనివోక బదికేటిదానను నేను ॥ ఎవ్వ ॥

ొలిసితే నొకటియు నొల్లకుంటే నొకటియు
చలివేఁడివేసాలు జరప నేను
కలికితనాన నీతో కాఁపురమే గతియన
తలఁచి పొందులు సేసేదానను నేసు ॥ ఎవ్వ ॥

ొక్కపరి యిచ్చకము వొక్కపరి మచ్చరము
యిక్కడా నక్కడ యెలయించను నేను
గక్కన శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
మక్కువ నిటువలెనే మరుగుదు నేను ॥ ఎవ్వ ॥ 75

## గంభీరనాట

ఇంకా మమ్ముఁ జెనకేవు యేరా వోరి
కొంకులేక కొసరేవు కొమ్మల నందరిని ॥ పల్లవి ॥

గోవుల మరపినట్టు గొల్లెతల వలపించి
కావరించి తిరిగేవు కానీకానీరా
వేవేలు ఇండ్లు చొచ్చి వెన్నదినేనంటానే



[illegible]
కల్లరివై తిరిగేవు కానీకానీరా
చల్లదుత్తలంటాను చన్నులపైఁ జేయి చాఁచి
కొల్లగొంటివి మానము కోమలులనెల్లను

మడుగులఁ జొక్కుచల్లి మచ్చిక సేయించుకొని
గడుసరివై తిరిగేవు కానీకానీరా
నడుమ శ్రీవేంకటేశ నన్ను నిట్టె యేలితివి
తొడిఁబడఁ గూడితివి తొయ్యలులనెల్లను ॥ ३

శ్రీరాగం

వలపేమి వెగటా వనితలకు
చిలుకుగోళ్ళనేల చెమట చిమ్మేవే

అదనెరిఁగి వచ్చిమా టాతఁడు విన్నాడితేను
వదనకమలమేల వంచేవే
సదరానఁ గప్పురము చన్నుదాఁక వేసితేను
వుదుటున లోలోన వుసురనేవేలే

చవులువుట్టిం చాతఁడు సన్న సీకుఁ జేసితేను
అవలివలై యేల అలసేవే
తివిరి యట్టె ముసుఁగు దీసి మోము చూచితే
జవళిఁ జొక్కుచు నేల జడిసేవే

శ్రీ వేంకటేశుఁడు నిన్నుఁ జేరి కాఁగిలించితేను
భావము గరఁగి యెంత వదరేవే

వంతులు వెట్టుక యేమి వల్లెవేసేవు

కందువ మర్మములంటి గజరుఁదనము చూపి
యెందరితో నవ్వునవ్వి యెలయించేవు
చిందేటిమోవితేనెలు చిమ్మిరేఁచి చవిగొని
విందులవలపులెట్టు వెదచల్లేవు

చన్నులపైఁ జేయివేసి జాణతనములు చూపి
యెన్నికతలఁ గరపే విందరి నీవు
వెన్నెలనవ్వు నవ్వించి వేడుకలు చిత్తగించి
పన్నినమాయల నెట్టుభ్రమయించేవు

కాతరాలు వుట్టించి కాఁగిటను బిగియించి
యేతుల నెందరిఁ గుండే వింపుల నీవు
యీతల శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
జాతుల నెందరిపై నేసలు వెట్టేవు ॥

915-వ రేకు లేదు.

రేకు. 916 ఛాయానాట

నేఁడు గొత్తలా తనకు నెయ్యపుజాణతనాలు
నాఁడే కానవచ్చెను ననుపులెల్లాను

చెంతనుండి పలికీని చేయి మీఁదవేసీని
యెంతలేదు తనవల పెరుఁగనటే
వంతుతోఁ బువులెల్లాను వాసనలు చూపీని

బలిమి నూరకే తాను పచ్చడము గప్పీని
కలిగెనె తనపొందు కాణాచి నాకు

కన్నులఁ దప్పక చూచీ కాఁగిలించి కూడీని
నన్ను శ్రీవేంకటేశుఁడు మన్నించెఁ దానె
సన్నల నప్పుడే నాతో సరసములాడీని
పన్నినవేడుకతో; నాభాగ్యమాయనే

నట్టనారాయణి

ఈడనుండేచుట్టరిక మిది చాలదా
వాడికసుద్దులు నీవు వదలేటివాఁడవా

పలుమారు నీతోను పంతములాడఁగరాదు
చలములు సారె సారె సాదిఁచరాదు
పొలుపుగ నీవు నన్నుఁ బొందులు సేయుమనేవు
వొలిసినట్టు మట్టున నుండేటివాఁడవా

యెక్కువ తక్కువ నీతో నెదురు మాటాడరాదు
కక్కసించి నిన్నెంతైనాఁ గాదనరాదు
ఇక్కువ లంటుచు నన్ను నియ్యకొలుపవచ్చేవు
తక్కినపనులు నీవు తలఁచనివాఁడవా

శ్రీ వేంకటేశ్వర నీ చిత్తము దెలియరాదు
వావితో నన్నేలితివి వద్దనరాదు
కావలె ననుచు నాకుఁ గంగణము గట్టితివి

రమ్మనవే చెలియా రమణుని నీడకు
యిమ్మనవే చనవులు యెలయింపు లేఁటికే

కన్నులఁ జూచినదాకాఁ గడలేదు తమకము
సన్నల మొక్కినదాఁకా చల్లీఁ గూరిమి
మన్నన లడుగుదాఁకా మలసీఁ గోరికలు
యెన్నిలేవు యెడమాట లింకానేఁటికే

సరసమాడినదాఁకా జడివట్టీఁ జెమటలు
వరసకు వచ్చుదాఁకా వంచీఁ జలము
గరిమఁ బైకొన్నదాఁకాఁ గమ్మీ నడియాసలు
ఇరవై నడుమఁ దెర యిఁక నేఁటికే

కదిసి కూడినదాఁకా కడుఁ జన్ను లదరీని
పెదవి యానినదాఁకా నిదే నోరూరీ
అదన శ్రీవేంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె
యెదుటనే వాడఁబాటు లింకానేఁటికే ॥ ర

ఆహిరి

ఎవ్వతెకో నేఁడు నిన్ను నింత సేసెను
పువ్వులైన వలపులే పూఁపలు నౌను

చెవిలోఁ జెప్పినమాట చిత్తములోపల నాటీ
వివరింప వినుకలి విరహ మవును
తనివి యదే సారెఁ దలపోయ తలపోయ

వెలయుచు నేకళయ్యీ విరహ మౌను
అలమి శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యెలమి సంతోసాల కిరవులౌను ॥

దేసాళం

వలపులలో నీకీవన్నె లివి ఇన్నియును
మలతురు సొలతురు మంకుల నుండుదురు

చలపాదితనములు సహజము సతులకు
వెలఁది నేమీననక వేఁడుకోవయ్యా
పలుకదు రేమైనాఁ బక్కన జంకింతురు
పిలువఁ బిలువ నట్టె బిగుతు రెంతైనా

కడుగట్టితనములు కలిగిన వెప్పుడును
పడఁతికి నీవిట్టే పంతమీవయ్యా
కొడిమెలు గట్టుదురు కోపములు చూపుదురు
తడవినంతటిలోనే తప్పులువట్టుదురు

ఆసోదపుఁదనములె అంగములు కాంతలకు
యీ సుదతిఁ గూడితివి యేలుకోవయ్యా
బాస లడుగుదురు పైపై శ్రీవేంకటేశ్వర
నేసవెట్టి గర్వాన చెక్కులు నొక్కుదురు ॥

ఎవ్వతెతో మాటలాడే విప్పుడు నీవు
జవ్వని నిలుచున్నది చక్కఁజూడవయ్యా

కలువకన్నుల నిన్నుఁ గసరి
కులుకుఁజన్నుల నిన్నుఁ గొసరి
చెలిఁ బయ్యదకొంగు విసరి
చెలి నీ సేవలు సేసీఁ జిత్తగించవయ్యా

చిమ్మల మోహరసము చిలికి
పమ్మిచు ప్రియములెల్లాఁ బలికి
అమ్ముడుసిగ్గులఁ గొంత యలికి
కొమ్మ నీకుఁ దమకించి కొసరీ మెచ్చవయ్యా

చొక్కపుటాసల నిన్ను సోలఁ
మక్కువలు చల్లి చల్లి మలసి
గక్కన శ్రీవేంకటేశ కలసి
మొక్కీ సంతోసాన నింతి; ముదమందవయ్యా

రేకు 917. పళవంజరం

ఆఁటది యేమి యెఱుఁగు నన్నిటను మగవాని-
మాఁటలోని దింతమర్మము నీచే నున్నది

సేయకుండవచ్చునా చెప్పినట్టెల్లా నేను
పాయపువాఁడవు నీవు బలువుఁడవు

కోడెకాఁడవు నీవు గొంటరివి
పాడితో నూఁకొఫగానివచ్చివి నీసుద్దులు
వాడిక నా జవ్వనము వడి నీకె నెలవు

పూరకుండవచ్చునా వొద్దఁగమున నీతో
ధీరుఁడవు శ్రీవేంకటాద్రినివాసుఁడ
యీరీతి మానఁగరావు యెన్నఁడు నీపొందు లివి
కేరడముగాఁ దేలినకీరితి నీది

నాట

చిత్తాన నోరుపు లేదు సిగ్గు విడువఁజాలవు
హత్తి నిన్ను నేమందు నౌదువయ్యా జాణవు

మోము చూచితే ముసిముసినవ్వులు నవ్వేవు
కామించి తలవంచితే కాతరించేవు
గోమునఁ జెనకితేను కొంకి సాములు సేసేవు
నేమమున నుండితేను విక్కి పైకొనేవు

ఆనుక మాటలాడితే నటు గుట్టు చూపేవు
మోనాన నుండితే చనుమొన లంటేవు
కానుక లిచ్చితేను నలుగడలుసుఁ జూచేవు
మాని వూరకుండితేను మంతనమాడేవు

సేవలు సేయవచ్చితే చేతు లొడ్డించుకొనేవు
వోవరిలోఁ బండుండితే నొడివట్టేవు

ఎరవులే నీగుణాలు ఇన్నాళ్ళదనకాను
    సరివచ్చె నాడుకొనే జవరాండ్లమాటలు ॥ పల్లవి ॥

వెలవెట్టనివలపు వెలఁది నీపైఁ జల్లఁగా
    నలువంకలా నీకు నవ్వులు గావా
    మొలకచన్నులు మరి మోమున కెగరఁగాను
    యెలమి సంతోసాలుగా కేఁక నెన్నఁడయ్యా ॥ ఎర ॥

పోరచి దెచ్చి విడేలు పొరుగాపె యియ్యఁగాను
    సారె కిందరిలోనా చవులు గావా
    తీరనిమోవితేనెలతీపు నీమోవి సోఁకఁగ
    యీరీతి నీభాగ్యమాయ నిన్నిటా మేలయ్యా ॥ ఎర ॥

పీఁటమీఁద నీకు నిట్టె పెండ్లికూఁతు రుండఁగాను
    పాటించి ఇన్నిటా నీరపములే కావా
    యీటున శ్రీవేంకటేశ ఇటు నన్ను నేలితివి
    మీటాయ నీసుద్దులెల్లా మెచ్చాయనయ్యా ॥ ఎర ॥ 87

సాళంగం

నీచేఁతలే ఇవి నీవేల సిగ్గువదేవు
    చేచేత వలపులు చిమ్మరేఁచకుండునా ॥ పల్లవి ॥

తగ నీతనికి నీవు తతిగాని చెప్పఁగాను
    చిగురుమోవికి వాడుచెందకుండునా

నడుమ నూరక నవ్వు నవ్వుదు నవ్వఁగాను
జడియని నీకొప్పు జారకుండునా
వొదివట్టి తీసి పతి నొద్దికిఁ బిలువఁగాను
వెడవెడ వోఁకముడి వీడకుండునా

ముందె శ్రీవేంకటేశుమోవి చవిగొనఁగాను
కందువమర్మము కరఁగక వుండునా
సందులేక కాఁగిటిలో సతములై వుండఁగాను
మందలించి వేడుకలు మరిగించకుండునా ॥

ఆహిరి

ఘనుఁడైనవాని నింతకాకు సేతురా
మనసునఁ బెట్టుకొని మంతనము లాడవే

అంగనలు కొలువు సేయఁగ నుండేరమణుని
వెంగెములాడకువే వేమారును
సింగారించుక యద్దము చేతఁబట్టి చూడఁగాను
చెంగట నాతనిమై మచ్చములు చూపకువే

చెప్పరానిబాసలెల్లాఁ జేసేటిమగవానిఁ
దప్పులెల్లా నెంచకువే తగవు గాదు
ముప్పిరివల్లెవాటుతో మురిపెముచూపేవాని
దుప్పటిపసపు చూపి దూరులు సేయకువే

చేరి కాఁగిలించుకొన్న శ్రీవేంకటేశ్వరుని
నేరము లెంచకువే నీకుఁ దగదు

ఇంకనేల కొంకను యిన్నియుఁ జెల్లుబడాయ
అంకెకు వచ్చినపని ఆపె దానే యెరుఁగు ॥పల్లవి॥

మోహముగలవాఁడవు మొక్కించుకో ఆపెచేత
పోషణించి నన్నేమి బుద్దెడిగేవు
సాహసివని పొగడి సాముసేయు మాపెతోడ
బాహుమూలములఁ గలపస తానే యెరుఁగు ॥ఇంక॥

పొందుసేసినవాఁడవు పొత్తున నాకెఁ బెట్టుకో
విందువలె నాతోనేల విచారించేవు
అందరిలో సంతోసించి ఆపెనే నీవడుగుము
మందలించి; నీ వాడేటిమాటలు దానెరుఁగు ॥ఇంక॥

పెండిలాడినవాఁడవు పిలువు నీవే యాపెను
అండనే నాతోనేమి ఆలోచించేవు
నిండుక శ్రీ వేంకటేశ నీవు నన్ను నేలితివి
పండుమోవిగురుతులభావము దా నెరుఁగు ॥ఇంక॥

రేకు 918. దన్నాసి

ఊడిగపునిబ్బరాన వొరపు లెరఁగరు
తాడుపడి గోళ్ళేల తాఁకించేరే మీరు ॥పల్లవి॥

పన్నీట మజ్జనమార్చి పావడలఁ దడివొత్తి
చన్నులేల తాఁకించేరే సతులాలా

తట్టుపుణుఁ గలది యంతటా మెరుఁగులు వెట్టి
చుట్టుఁబయ్యెద లేఁటికి సోఁకించేరే
గట్టిగా సొమ్ములు వెట్టి కడుసింగారాలు నేసి
వట్టి మీ చెమటలేల వడియించేరే ॥ ఊడి ॥

అలమేలుమంగ నురమందు నెలవుకొలిపి
యెలమి శ్రీ వేంకటేశు నేలనవ్వేరే
బలిమి నానాజాతిపండ్లు నైవేద్య మిచ్చి
అలమి మోవిపండ్లవి యేమి చూపేరే ॥ ఊడి ॥ 91

రామక్రియ

ఏమి నెరపేవు మేఁటు లింతులెల్లాఁ జూడఁగాను
ఆమని వేడుకకాఁడ వౌదువయ్యా నీవు ॥ పల్లవి ॥

నీవద్దఁ గాచుకున్న నెలఁతుక వుండఁగాను
ఆవలా కెతో సరసమాడేవు
తోవలఁ బెళ్ళిచెట్టు మందుగాదనినమాటలు
నీవల్లనే కానవచ్చె నెమ్మది నిందరికి ॥ ఏమి ॥

వరుసతోఁ బెండ్లాడినవనిత మాటాడఁగాను
పొరుగాపెతో నవ్వేవు పోరచిగాను
సరిమున్న మేనవారు సరకుగా రనుమాట
నిరతితోడుత నీవే నిజము సేసితివి ॥ ఏమి ॥

అలమేలుమంగ వురమందు నిల్చి వుండఁగాను

మని విన్నవించేము యిట్టె కనుఁగొనవయ్య
మోమునఁ జేతులలోన మొక్కు లున్నవి ॥ పల్లవి ॥

లఁతమనసులోన సంతువలపు లున్నవి
నెలవినవ్వులలోన సిగ్గు లున్నవి
తలిరుమోవిమీఁద తరితీపు లున్నవి
కలువకన్నులలోన కాంతు లున్నవి ॥ ఏమ ॥

ంగనమాటలలోన నడియాస లున్నవి
రంగగుచన్నులపై కరఁగు లున్నవి
అంగపుసేవలలోఁ బ్రియములెల్లా నున్నవి
సింగారంపుఁగొప్పుమీఁద నేస లున్నవి ॥ ఏమ ॥

ప్పి యలమేలుమంగకాఁగిట నీమేనున్నది
చిప్పిలఁ జెక్కులమీఁద చిహ్నా లున్నవి
యిప్పుడె శ్రీవేంకటేశ యిద్దరుమఁ గూడితిరి
నెప్పున నీకెవేల నీ వుంగర మున్నది ॥ ఏమ ॥ 93

శంకరాభరణం

మాటలాడఁగదె మగనితో
ఆఁటదాని కింత యమరునా ॥ పల్లవి ॥

చెలులు బుద్దులుచెప్పినా వినవు
చలము పతితో సాధింతురా

రవ్వ లింతయేలే రామలకు
జవ్వనమదాన జడియుచు నుండి
అవ్వలి మోములు అమరునా ॥ మాట ॥

మచ్చికచుట్టాల మందాటు సేయవే
హెచ్చుఁగుందులేల యీవేళను
యిచ్చల శ్రీవేంకటేశుఁడు గూడెను
అచ్చమాయ సిగ్గు లమరునా ॥ మాట ॥ 94

నాదరామక్రియ

ఎంతగోస నాసనేసేవేల మమ్ముఁ గొసరేవు
పంతము నీకిచ్చినదే పైకొంటగాదా ॥ పల్లవి ॥

యెదిరించి నీకుఁ జేతులెత్తి మొక్కినపుడే
కొదలేక నిన్ను వేఁడుకొంటగాదా
పొదిగి యేపొద్దు నీపొంత నున్నయపుడే
అదనఁ గూడుకొని నీయాల నౌటగాదా ॥ ఎంత ॥

కనుఁగొని కొలువులోఁ గాను కిచ్చినపుడే
చెనకి నీకుఁ బ్రియాలు చెప్పుటగాదా
ననుపుతో నెలవుల నవ్వునవ్వినప్పుడే
యెనసేననుచు నీతో నియ్యకొంటగాదా ॥ ఎంత ॥

మచ్చిక నీచెవిలోన మాటలాడినపుడే
కొచ్చికొచ్చి నీకాఁగిటఁ గూడుటగాదా
అచ్చపు శ్రీవేంకటేశ అలమేలుమంగను నేను

సామంతం

సారె వల పందరిపైఁ జల్లుచున్నాఁడు
తీరుగా సరసమాడి తిల్లగోవిందరాజు

ధరితమై మేడలోనఁ బవ్వళించి వున్నవాఁడు
తరుణులతో నవ్వుతా నున్నాఁడు
పరగ నందరిచేత పాట వింటానున్నవాఁడు
తెర దీసుకున్నవాఁడు తిల్లగోవిందరాజు

వేసపాలశిరసున సిగ్గుతోడ నున్నవాఁడు
ఆసపాటుచూపులచాయల నున్నాఁడు
బాసికపుసతులపై పాదాలు చాఁచుకున్నాఁడు
తీసిపెట్టుగానితమిఁ దిల్లగోవిందరాజు

భావపురతులఁ గూడి పంతముతో నున్నవాఁడు
శ్రీవనిత భూవనితఁ జేసుకున్నాఁడు
వావు లిందరికిఁ జెప్పి వన్నెకాఁడై పొందినాఁడు
దేవుఁడు శ్రీ వేంకటాద్రి తిల్లగోవిందరాజు ॥

రేకు 819 శంకరాభరణం

వింటిమయ్యా నేఁడు నీవేడికెలు
కంటిమయ్యా తోడుతనే కందువ వాడికెలు

వలపుల తమ్మివిరివాటులు
[illegible]

మెల్లనె తమకముల మేదేలు
కొల్లలు నీతమకపుగూడేలు
పెల్లురేఁగెఁ బుక్కిళ్ళ పెండ్లిపీదేలు ॥వింటి॥

పాలకూళ్ళలోననె పంతాలు
చాలా నమరె నీసంతాలు
యేలితివి శ్రీవేంకటేశ యలమేల్మంగను
యీలీల నాతో నాదేవు యేకాంతాలు ॥వింటి॥ 97

కాంబోది

ఏమిటికిఁ జేసేవే యెగసక్కేలు
కామించినరమణునిఁ గలయఁగరాదా ॥పల్లవి॥

కప్పి నిన్నాతఁడు తమిఁ గాఁగిలించుకొనఁగాను
యిప్పుడు నీవిన్నపము లేమి సేసేవే
ముప్పిరిదప్పికని నీమోవితేనె లడుగఁగ
అప్పటిఁ బన్నీరేల అందియిచ్చేవే ॥ఏమి॥

సొలసి చక్కఁదనాలు చూచి యాతఁడు చొక్కఁగా
తల దువ్వి తురుము యెందాఁకాఁ బెట్టేవే
కలికి నీచన్నులకుఁ గడు చేయిచాఁచఁగాను
వెలయ నిప్పుడు యేల పిడె మందిచ్చేవే ॥ఏమి॥

శ్రీవేంకటేశ్వరుఁడు చేరి రతిఁ గూడఁగాను
యీవేళనే పాదములు యేఁటి కొత్తేవే
కావిరి వేకతమునఁ గదు నీతో నవ్వఁగాను

నీవు మొదలు జాణవు నీకంటె నాకె జాణ
ఈవల నావల మిమ్ము నిద్దరి మెచ్చేము

వయ్యద మాటు సేసుక పలుమారు నవ్వుకొంటా
వుయ్యాలమంచాన నిన్ను నూఁచీఁ జెలి
వొయ్యనె పాదాన నాపెవొడి నీవు దాఁకించఁగ—
నియ్యెడ సిగ్గువడీ నింతలో నీదేవులు

పుక్కిటివిడెముతోడ పొంచి పొంచి చూచుకొంటా
వొక్కట నాకుమడిచి వొసగీఁ జెలి
చక్కనినీకొనగోరు చనుమొన నంటించఁగా
చెక్కు చేతమోపుకొని సిగ్గువడీ దేవులు

తనివోనిగుట్టుతోడ తమకము రేఁచుకొంటా
యెనసి కాఁగిట మోవి యిచ్చీఁ జెలి
ఘనుఁడ శ్రీవేంకటేశ కళలుమించఁ గూడఁగ
చెనకేచెలులఁ జూచి సిగ్గువడీదేవులు ॥

మధ్యమావతి

ఏపాటిబత్తిగలఁదో యిటు నామీఁద
దాపుగా నాసుద్దులిట్టె తలపెట్టి చూడవే

మనసు దెలియరాక మర్మము లడుగరాక
వొనగూడి గుట్టుతోడ నున్నదాననే

కూరిమి గొసరరాక కొంగువట్టి తియ్యరాక
వోరుచుక సిగ్గుతోడ నున్నదాననే
నేరుపరి యీతఁడు నెట్టుకొని నీవైనా
చేరి వద్దివారిచేతఁ జెప్పించి చూడవే ॥ఏపా॥

బలిమి సేయఁగరాక పాసి వుండఁగరాక
వొలిసి కాఁగిటఁ గూడివున్నదాననే
యెలమి శ్రీవేంకటేశుఁ దేలె నన్ను నీవయినా
నొలవక కోరికలు నోదించి చూడవే ॥ఏపా॥ 100

ముఖారి

ఏఁటికి నన్ను గుంపించే వేమే నీవు
చాటిచెప్పేవు నాకిది సఫలము గాదా ॥పల్లవి॥

కుప్పళించి నీవు నాకొంగువట్టి తీసేననే—
విప్పదే లోకములెల్ల నేలనా నేను
పిప్పిగట్టి నీవు నాతో పెనఁగులాడవచ్చేవు
కప్పుచు నత్తైతే నాభాగ్యముగాదా ఇపుడు ॥ఏఁటి॥

చేరి చేరి నామీఁద చేతులు చాఁచవచ్చేవు
గారవించ నాకిది ఘనతగాదా
ఆరితేరి నామేన నటు గోరు నోఁకించేవు
నేరుపుతో నాకిది నిధానముగాదా ॥ఏఁటి॥

పిక్కటిల్లఁ గాఁగిట బిగియించవచ్చేవు

సింధురామక్రియ

ఒద్దనున్న కాంతలకు నుల్లములు గరఁగెను
సుద్దులేమి చెప్పేము చూతువురావయ్యా ॥ పల్లవి

పట్టెమంచము మీఁదటఁ బవ్వళించీని చెలియ
నెట్టుకొన్న వేడుకతో నిన్నుఁ దలఁచి
గుట్టున మనోరథాలు గోరుకొంటా ముక్కుమీఁది—
జుట్టువేలితో నున్నది చూతువు రావయ్యా ॥ ఒద్ద

వొక్కతె యేకతముననుండి యుల్లాసముతోడ
పక్కన నీమీఁదటిపదాలు వాడి
యిక్కువ నీమోవితేనె కేఁకట నోరూరుకొంటా
చొక్కి నిట్టూర్పులు నించీఁ జూతువు రావయ్యా ॥ ఒద్ద

ఇట్టె నీవు రాఁగా శిరసెత్తి నీమొగము చూచి
గట్టిగా శ్రీవేంకటేశ కాఁగిట గూడిఁ
నెట్టుకొని రతులను నిన్ను మెప్పించీ దినముఁ
జుట్టి చుట్టి ఇట్లానే చూతువు రావయ్యా ॥ ఒద్ద ॥ 1

కు 920 సామంతం

ఏమిటికిఁ దలవంచే వేల సిగ్గువడేవు
కామించి వచ్చేఁగాక గాతనేయవచ్చెనా ॥ పల్లవి

దిట్టయై నీచేఁతలు సోదించవచ్చెనా
నెట్టన నీసేవసేయ నెయ్యముతో వచ్చెఁగాక
గట్టిగా నీసేస్తాలు కాకుసేయ వచ్చెనా ॥ఏమి॥

మిక్కిలి కాఁగిటఁ గూడి మెప్పించవచ్చెఁగాక
కక్కసించి నీపై నద్దికము వచ్చెనా
మొక్కుచు శ్రీవేంకటేశ మోవి యానవచ్చెఁగాక
పక్కన నాపెను విన్నుఁ బచ్చిసేయవచ్చెనా ॥ఏమి॥ 10

మలహరి

ఇంతసేతురా యిటువలె రమణుని
యింతివి నిను నెలయించె ననుచును ॥పల్లవి

సారెకు నేఁటికి జంకించేవే
కేరుచు వతఁడు నగె ననుచును
జీరలుగా గోరఁ జిమ్ముదురటవే
వూరకె పరాకై యుండె ననుచును ॥ఇంత

పెనుఁదుర మేఁటికిఁ బిడికిటఁ బట్టేవే
ననుపున నీతోఁ బెనఁగె ననుచును
అనుగుకుచంబుల నదుముదు రటవే
తనలో నొకతెను తలఁచె ననుచును ॥ఇంత

జంటల నింతేల చలములు మీరేవే
నంటున నీతో నెనసె ననుచును

వేడుకకు వెలలేదు విభుఁడ వాకెకును
జాడలెల్ల సరివచ్చె సమ్మతాయ మాకును ॥ పల్లవి ॥

తచ్చితచ్చి మాటలలోఁ దనవల పఁ(పం?)తయును
యెచ్చరించెఁగా నేఁడు యింతి నీకు
పచ్చిచేఁతలనే నీతోఁ బచరించవచ్చెఁగా ననుపు
యిచ్చకముగాఁ బొంచి యిందరిలోన ॥ వేడు ॥

నెలవినవ్వులలోనే చేసేటివిన్నపాలెల్లా
తలఁపించెఁగా నేఁడు తరుణి నీకు
పిలిచేనేరుపులోనే బెరయించెఁగా పగటు
నలువై నీమెచ్చుగాను నడుమఁ దాను ॥ వేడు ॥

కూడినకాఁగిటిలోనే గురుతైనకాఁపురాలు
యీడేరఁ జేసెఁగా యీసతి నీకు
జోడై శ్రీవేంకటేశ చొక్కి నన్ను నేలితివి
పీడెమిచ్చెఁగా మఱియు వింతలేక యిపుడు ॥ వేడు ॥ 105

బౌళిరామక్రియ

ఏమాయనయా యింతటిలోనే
కామునికి నివి గలసహజములు ॥ పల్లవి ॥

వనవరికాంతలు సరసములాడఁగ
ననుపున విభుఁడవు నవ్వితివి

సొలయుచుఁ దప్పక చూచితివి
కలువపువ్వులటు కానుక లిచ్చిన
అలరి కరంబుల నందితివి

వూడిగపుసతులు వాడివట్టుకొనిన
వేడుకతోఁ బెండ్లాడితివి
యీడనె శ్రీవేంకటేశ నన్నెనసి
తోడనె దోమటి దొడికితివి ॥ఏ

సాళంగనాట

వెక్కసపువలపుల విఱ్ఱవీఁగేవు
మక్కువలు మారుకొంటే మఱి యేమిసేసేవే

యింతులెల్లా నుండగాను యేకతము నీవాడేవు
చెంతనుండి విభునికి సేవసేసేవు
యెంత కెత్తుకొంటివే నీ వించుకాఁ దగవెంచవు
యింతలో దొమ్మి సేసితే నేమిసేసేవే

సరివారిలోననెల్లా చనవులు నెరపేవు
గరిమ నాతనితోడఁ గడునవ్వేవు
దొరతన మెంతగద్దే తోడివారిఁ గైకోవు
నిరతి దొమ్మి గూడితే నీ వేమిసేసేవే

కావరించి చెనకేవు కాఁగిటనుఁ గూడేవు
శ్రీవేంకటేశ్వరునిఁ జెలఁగించేవు

ఆసపడ్డవారిని అలయింతురా
ఓసరించి యేల జరపులఁబెట్టే విఁకను ॥ పల్లవి ॥

కన్నులనే మొక్కితి కైదండ నీకిచ్చితి
విన్నపములు సేసితి వేమారును
యెన్నిక యింతటనైనా యింటికి రారాదా
సన్నల నెందాఁకా రచ్చలుసేసే విచ్చట ॥ ఆస ॥

సేవలెల్లాఁ జేసితి చెక్కులు నే నొక్కితి
వేవేలకుఁ గొసరితి వేమారును
చేవదేర మంచముపైఁ జేరి కూచుండరాదా
తోవల చెలులతో సుద్దు లేమిటి కిపుడు ॥ ఆస ॥

కందువ లిట్టే యంటితి కాఁగిలించుకొంటిని
విందుగా శ్రీవేంకటేశ వేమారును
పందెము లేమాడేవు పవ్వళించరాదా
పొందితివి నన్ను నేఁడుఁ చింతలు మరేఁటికి ॥ ఆస ॥ 108

921 ఆహిరి

ఎవ్వరేమిచెప్పేరు యిఁక నీకును
నివ్వటిల్ల నింకా నవే నేరుచుకోవయ్యా ॥ పల్లవి ॥

ఆసపడి రతులకు నండనుండి చిత్తమురా
నెనేఁగా ఆకె నీకు సేవలెల్లాను
హాసగుచిన్నటు చెప్పి బుదులెలా నీకు నూరి—

యెడలేనిసుద్దులెల్ల నేచ్చరించి యింతేసి
తోడ సాముసేయింకేఁగా దొరతనమునను ॥ ఎవ్వ ॥

చెక్కునొక్కి నేసవెట్టి సేఁతలెల్లాఁ జేసి చూపి
చిక్కించేఁగా ఆపె నిన్ను శ్రీవేంకటేశ
మక్కువతో నీచేత మన్నింపించి నన్ను మెచ్చి
మిక్కిలి నవ్వునవ్వేఁగా మేరమీరి నిన్నును ॥ ఎవ్వ ॥ 108

మంగళకౌశిక

అన్నిసేవలునుఁ జేసీ అంగన నీకు
సన్నల నీతో నట్టె సరసమాడీని ॥ పల్లవి ॥

కామించి సిగ్గులతోడ కంకణాలు గదలఁగ
వేమారుఁ బాదము లొత్తీ వెలఁది
ఆమనివలపుతోడ నంగమెల్లాఁ జెమరించ
గోమున నప్పటి నీకుఁ గొప్పువెట్టీని ॥ అన్ని ॥

సెలవినవ్వులతోడ చెక్కిన పయ్యద జార
మలయుచు వీడెమిచ్చీ మగువ
పులకచెక్కులతోడ పొందులు(ల?) తలఁపు రాఁగ
వెలయ సురటి నీకు విసరీని ॥ అన్ని ॥

నిట్టూరుపులతోడ నిండునివ్వెరగుతోడ
గుట్టున గుబ్బల నొత్తీఁ గోమలి
యిట్టె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
జట్టిగొని యాపె యింతా చ[1]లు చూపీని ॥ అన్ని ॥ 110

1. ఇక్కడ పాదవిభాగపుగురుతు లేదు.

[1] ఎంత నీవు వోతరించి యింపులఁ బెనఁగినాను
వంతుకుఁ గొంగువట్టితి వదలకు మనవే

కాతరించి రమణునిఁ గలకాలమెల్లా నీవే
చేతఁ జొక్కించుకొంటివి చెప్పేదేమే
యీతల నాతఁడే మాయింటికి విచ్చేసె నేఁడు
నీతితోడ విలుపక నేనేల విడుతునే

బలిమితో మగవాని బాసలు చేయించుకొని
యెలయించి కైకొంటివి ఇంకా నేమే
వలపించి యాతని నావద్దికి రప్పించుకొంటి
వెలయ భోగించక నీవెంట నేలంపుదునే

కందువ శ్రీవేంకటేశుఁ గాఁగిటిరతులఁ గూడి
అందరిలో మెరసితి వప్పటినేమే
ముందుముందె నే నాతనిమోవితేనె దక్కఁగొంటి
అందముగఁ బెండ్లాడక అదేల మానుదునే ॥

కేదారగౌళ

నీవైనా నానతీవయ్యా నెరజాణవు
తావుల నీదేవులైతే ధాఁపిరము నేసెను

పొలఁతి నీమాటలకు బొమ్మల జంకించి చూచి
తలవంచి సిగ్గుతోడఁ దడఁబడీని
అలరి చెలికత్తెలు ఆరహస్య మడిగితే
తెలియఁ జెప్పఁగరాక తెరవేసుకొనెను

కప్పుకొన్నపయ్యదతో కాఁతాళించీని
వొప్పుగ నూడిగములవువిద లడిగితేను
ముప్పిరి నొడుగరాక ముసుఁ గిడుకొనెను

నీవు నవ్వినవ్వుకు నీతురుము వట్టి తీసి
వోవరిలోపలఁ గూడి వొగి మెచ్చిని
శ్రీ వేంకటేశ నీదేవు లలమేలుమంగ
వోవల నడిగితే నీవుర మెక్కకొనెను ॥

ఆహిరినాట

ఏల గడించుకొనేవు యెడలేనికతలును
లోలోనే గుబ్బతిల్లక లోనికి రావయ్యా

చిగురుమోవిమీఁద చిప్పిలుఁదేనె గారితే
వొగరుఁదిట్ల నేవు వూరకే నీవు
మగువ నీమీఁదట మచ్చరించి పలుకఁగ
నిగిడి యింతటిలోన నీవేమి నేసితివి

నలిఁ జంద్రవదనాన నవ్వువెన్నెల గాసితే
అలరుచు నెగసక్కెలనేవు నీవు
చెలియ నీమీఁదట చిట్టకము నెరపఁగ
నెలకొన్నయట్టితప్పు నీవేమి నేసితివి

జక్కవ చనుముక్కలు సరివాఁడు లై తేను
వుక్కనఁ గాఁగిట నిన్ను నొత్తెననేవు

సాళంగనాట

వేడుకకాఁడ వౌదువు వింతమాసటీఁడ వౌదు—
వేడ చూచినా మెచ్చేరు యింతులెల్లా మిమ్మును ॥పల్లవి॥

తెఱవఁ బెండ్లియాడి తేరుమీఁద నేఁగిరాఁగా
చిఱుఁజెమటలు గారెఁ జెక్కులమీఁద
మెఱయుచు వీదులను మించి విఱ్ఱవీఁగఁగాను
నెఱవాదిసాముల నిట్టూర్పులు నిండెను ॥వేడు॥

బాసికము గట్టుకొని పడఁతితో మెఱయఁగ
సేసముత్తేలు చూపట్టె శిరసులపై
ఆసతో వాడలనెల్లా నారతులెత్తించుకోఁగా
ఓసరించి మోముల గొబ్బున మించెఁగళలు ॥వేడు॥

~~అలమేలుమంగఁ గూడి అట్టె వసంతాలాడఁగ~~
చెలఁగెఁ బులకలు మెయి శ్రీవేంకటేశ
వెలయ నిండ్లనెల్లా విందు లారగించఁగాను
వలపులు మోవిమీఁద వన్నెచూపె నిపుడు ॥వేడు॥ 114

922 అమరసింధు

ఎంతబత్తో నీమీఁద నీరమణుఁడు
చెంతనుండి ఇయ్యఁగదే చేతికి బాగాలు ॥పల్లవి॥

పయ్యదకొంగు వట్టి పతి నీతోఁ బెనఁగీని

అట్టె కానిమ్మనఁగదె ఆతనితోను
వొట్టుకొని పాదము నీవొడిమీఁదఁ జాఁచీని
గుట్టుతో నానతిచ్చీ నూఁకొనఁగదె మాట ॥ఎంత॥

చెలరేఁగి మంతనాన శ్రీ వేంకటేశుఁ డేనసె
అలమేలుమంగవు నీవలమఁగదె
పలుమారు నవ్వుతాను బాసికము గట్టీని
చలమెల్లా నీడేరె చల్లఁగదె నేస ॥ఎంత॥ 115

సాళంగం

ఆయనాయ నుండవయ్య అలసితివి
చేయిమీఁదుగా నన్నుఁ జెనకేవు ఇపుడు ॥పల్లవి॥

వెలి నింతలో నొక్క వెలఁదికాఁగిట నుండి
కలలోన నొకకాంతఁ గలతువు
యెలమి నీయాసోద మేమిచెప్పే దప్పటిని
కొలఁదిమీరఁగ నాకొంగువట్టే విపుడు ॥ఆయ॥

శిర సీవలఁ బెట్టుక చెలితో మాటాడుతానే
తెరలో నొక్కతెఁ గూడి తెరలింతువు
గొరబులుగానీ నీగుణము లెట్టు గనేది
సరి నాపై నిదివో సేసలు చల్లే విపుడు ॥ఆయ॥

వెలయ భూకాంతను వీఁపునను మోచుకొని
అలమేలుమంగ నురమందు మోచేవు

ఆదరించవయ్యా అంగన నింతటనైనా
పోదివలపులు తలపోయుచున్నది ॥ పల్లవి ॥

చెప్పరానిప్రియములు చేరి నీకుఁ జెప్పఁగాను
దప్పిదేరీ మోవిమీఁద తరుణికిని
వుప్పతిల్లు సేవ నీకు వొద్దనుండి సేయఁగాను
చిప్పిలఁగఁ జెమరించె చెక్కులెల్లాను ॥ ఆద ॥

ననుపులు చేసుకొని నవ్వ నీతోనవ్వఁగాను
నినుపులై నిగిడీని నిట్టూర్పులు
తనియక పీడెమిచ్చి తగ నిన్ను వేఁడుకోఁ
వొనరెను పులకలు వొళ్ళనెల్లాను ॥ ఆద ॥

కలికితనాలు చూపి కాఁగిలించు కొనఁగాను
మలసీని కోరికలు మనసునను
అలమేలుమంగ నేలి తట్టె శ్రీవేంకటేశ
నెలకొనె వేడుకలు నిలువెల్లాను ॥ ఆద ॥ 117

శోకవరాళి

ఏమి విన్నవించేము యెందాఁకా నీకు
నీమనసునఁ గలట్టు నెలఁతను గావుము ॥ పల్లవి ॥

పంతగాఁడ వౌదువయ్య పడఁతి నింత సేసేవు
ఇంతకీ ర్తి గట్టుకొంటి విప్పుడు నీవు

చలి మిడుర్చుకొంటివి సాదువలెనె
సులభాననే నీకీసుకృతము చేరెను
నలుగడ నవ్వేరు నమ్మినట్టివారలు

నిరతపుజాణవయ్యా నేఁ డింటికి విచ్చేసి
గరిమఁ గూడితి వీకెఁ గరుణించి
సిరుల శ్రీవేంకటేశ చేఁతలు చందము లాయె
అ(అః)రుదుగ మెచ్చేరు అందరు నీకతలు ॥

ఆహిరి

తెలవ మొక్కఁగాఁ బిరితియ్యఁ దగవుగాదు
గుఱిగా మన్నించవయ్య కొసరేల ఇఁకను

పంతమాడనేరుతువు భావించనేరుతువు
యింతులను లాలించ నెఱఁగవా
అంత నీవు నేసినందు కాకె యలిగివున్నది
సంతము నేసుకోవయ్య చలమేల యిఁకను

పెనఁగనేరుతువు పెండ్లాడనేరుతువు
అనిశముఁ జనవియ్య నది నేరవా
యెనయ నిన్న రానందు కిటు మాటాడకున్నది
మనసు నమ్మించవయ్య మరఁగేల ఇకను

కలయఁగనేరుతువు కాఁగిలించనేరుతువు
అలరి యురమున మోయఁగనోపవా
కలికి (శ్రీ)వేంకటేశ [illegible]

ఎంతగద్దో నీయూనోద మిప్పు డీకెకు
చింతదీర మనసులో చిక్కువాపరాదా

ననుపున నొకమాఁటు నాతో మాటాడితివంటా
గునిసీ తప్పకచూచి కోమలి నిన్ను
పనివడి నీవాపెతో పచ్చిమాటలెల్లా నాడి
వెనకటిగఁజరెల్లా విడిపించరాదా

సమ్మతి నామోము చూచి సరసమాడితివంటా
వుమ్మడిఁ జన్నుల నొత్తీ నువిద నిన్ను
చిమ్ముచు నీకొనగోర జీరలు మేనెల్లాఁ జేసి
దిమ్మరేఁగినమదము తెలుపఁగరాదా

నవ్వుతా నప్పటి నీవు నన్నుఁ గూడితివంటా
రవ్వగా తాఁ గాఁగిలించీ రతికి నిన్ను
యివ్వల శ్రీవేంకటేశ యెదురుగా నాపెఁ బెట్టి
కువ్వలైనకూటముల గుదిగుచ్చరాదా ॥ ఎ

రేకు 923 హిందోళం

ఇద్దరివసంతము లీడేరెను
వుద్దండాలు మాని ఇంక నూరకుండరాదా

కామిను లిందరు నిన్నుఁ గాఁగిటఁ బెట్టుకుండఁగా
నీమీఁదఁ జె(జ?)ల్లెఁగా పన్నీరు చెలి

పూడిగాలవారిచేత నొంటి నడెవెట్టించి
జాడతోఁ గప్పురధూళి చల్లఁగా నీపై
వోడక నీవప్పటిని వొడ్డి తప్పించుక కొప్పు
పీడఁగా నాపెమీఁద విరుల సేసితివి ॥ ఇ ॥

దొమ్మి నడపాలవారి దోమతెర వేయుమని
చిమ్మఁగా గంధము నీపై శ్రీవేంకటేశ
యెమ్మెతో నీకెఁ గూడి ఇంపులచెమట్లలకు
కమ్మరఁ గప్పురం నట్టి కస్తూరి నించితివి ॥ ఇద్ద ॥ 1

దేవగాంధారి

బడలెను పానుపు పరచరే
అడుగరే యిదియేమియని చెలులు ॥ పల్లవి ॥

చెలపచెమటలు మైఁ జిప్పిలీని
అలసి వచ్చినాఁడు నేఁ డదే విభుఁడు
చలువగాఁ గప్రము పైఁ జల్లఁగదరే
వెలయ సురటిఁగొని విసరరే ॥ బడ ॥

పొనుగు నిట్టూరుపుల బుసకొట్టీని
పనిసేసి వచ్చినాఁ డప్పటి విభుఁడు
తనివారఁ ..ల్లనిగంధము మెత్తరే
నినుపుగఁ బన్నీరు నించరే ॥ బడ ॥

దాఁగక దప్పి మోవులు దడిపీని

పళపంజరం

ఎంత వేడుకకాఁడవో యీపెకు నీవు
అంతరంగమెల్లా మాకు నానతీవయ్యా ॥ పల్లవి ॥

కాంతకానుక యెంత కనుపట్టి వుండెనో
అంతటిలోఁ జేయిచాఁచే వందరిలోన
బంతి నాపెసరస మేపాటి మేన నంటెనో
వింతయి మోముకళల విఱ్ఱవీఁగేవు ॥ ఎంత ॥

చెలియపలుకు లెంత చెవిసోఁకి వుండెనో
అలరి యప్పటి మాఁట లడిగేవు
మలసి యాపెచూపు మర్మము లెట్లంటెనో
తలపోసి రతులకుఁ దమకించేవు ॥ ఎంత ॥

మగువవలపు లెంత మనసునఁ బట్టెనో
నగి నగి సారెసారె నంటుఁజూపేవు
జిగి నన్నుఁ గూడితివి శ్రీవేంకటేశ నేఁడు
పొగడి యాపెను నాతోఁ బురుఁడు వెట్టేవు ॥ ఎంత ॥ 12

సోమరాగం

మాతో నేమి చెప్పేవు మాపుదాఁకాను
యీతరవాతనే నీవు యియ్యవయ్యెవచనవు ॥ పల్లవి ॥

అనరాదుగాక నిన్ను ఆపెయెమ్మటనే నీవు

ఇట్టె యిందుకుఁగానే ఇంటిలోనే వున్నదేమో
గుట్టున వద్దఁ గూచుండి కూడవయ్య కాఁగిట ॥

తప్పు మోపరాదుగాక తరుణి నిట్టె కూడి
కప్పులు దేరఁగ మోవి గంటిసేతురా
ఛిప్పిలి యిందుకుఁగాను సిగ్గువడి వున్నదేమో
అప్పటి శ్రీవేంకటేశ చెప్పవయ్య ప్రియము ॥ మా

వరాళి

ఒక్కరు నోచిననోము వొకరికి ఫలియించె
నెక్కొని చూడ నిద్దరు నీదేవుళ్లే కారా ॥

మరిగి మీరిద్దరును మంచముపై నుండఁగాను
తరుణి తొంగిచూచి తలవంచెను
సరుసనున్నయాపెకే చాల నీవు వలతువు
నిరతి వెలినున్నాకె నీకే వలచును ॥

కందువ మీ రిద్దరును కాఁగిలించుకుండఁగాను
చెంది వేరొకతె చూచి సిగ్గువడెను
అంది ఆయాలంటినాపె కటు నీవు చిక్కితివి
విందువచ్చినాకె నీవేడుకకుఁ జె(జి,జొ?)క్కెను ॥

పొంచి మీ రిద్దరు మోవిబువ్వపుతేనె లానఁగా
పొంచుకున్నయాకె తాను పొత్తుగూడెను
మెచ్చఁగ శ్రీ వేంకటేశ ఇచ్చకుఁడ వొకతెకు

అంత మనసునఁ గద్దు ఆపెకు నీమీఁదిబత్తి
సంతోస మప్పటిఁ జేసీ చనవియ్యవయ్యా

ఘనమైననీదుచక్కనిరూపు చూచిచూచి
తనివి దీర దెంతైనాఁ దరుణికిని
పనివడి నీవలెనే బంగారుపతిమఁ జేసి
వెనుకొని నాపెమోమున వేలఁగట్టవయ్యా

సరసములాడి నీతో సారెకు నవ్వులు నవ్వి
మరిగియున్నది నీపై మచ్చికలెల్లా
సరుసఁ గూచుండి నీవు చవులుగాఁ జెనకుచు
కెరలించి కెరలించి గిలిగించవయ్యా

ముట్టి నీపాదము లురమున నిడుక వొత్తుచు
యిట్టె పాయదు శ్రీవేంకటేశ నిన్నును
నెట్టన నన్నేలితివి నీవింకా బొమ్మలు సేసి
మెట్టి నీపాదుక లాపెమెడఁ గట్టవయ్యా ॥అ

రేకు 924 శుద్ధదేశి

ఏది నిజమని వుందు మెరుఁగించవయ్యా మాకు
మేదించి వలపు లిరుమేలాఁ బూసేవు

విన్నపము నేఁ జేయఁగ వీనులనే వింటివి

యీటున నే నవ్వితేను యిచ్చగించే విందుకు
పాటించి మన సాపెపై నిలిపేవు

పిలిచితే వచ్చితివి ప్రియాన మాయింటికి
యెలమి నాసపడేవు ఇంకా నాపెను
కలసితి విటు శ్రీవేంకటేశ్వర నన్నును
తొలుతటిపొందు లాపెతోఁ బొదిపేవు ॥

పాడి

ఎట్టు నమ్మించేవో నీవే యెరుఁగుదువు
ఇట్టె అన్నిపనులు నెంచుకొని వున్నది

మనసు రంజిల్ల నీతో మాటలాడెఁగాని చెలి
వెనకటిసుద్దులెల్లా వినియున్నది
పొనసి వేడుకతో నీకిచ్చకమాడీఁ గాని
అనుగు నీగుణములు అరసే 'ననున్నది

నెలవి నవ్వుదెచ్చుక చేరి నీతో నవ్వేఁగాని
కలికి నీచేఁతలెల్లాఁ గని వున్నది
వలచినదై నీతో వాదించఁజాలదు గాని
పొలసి నిన్నేకతాన సోదించే ననున్నది

ఆసలు మానఁగలేక అట్టె నిన్నుఁ గూడెఁగాని
బాసలు నేయించుకొనఁ బరగున్నది
లాసి శ్రీవేంకటేశ నీలాగు దెలిసెఁగాని
మూసినముత్యమై నీముంగిటనే వున్నది ॥

ఇంకానేల దాఁచేవు యెదురుగుదురుగాను
 పొంకపునీగుణములు యీబూమెల్లా నెఱఁగదా

వుంకించి నిన్నిందరిలో వొడివట్టి తీసితేను
 ఊంకించి వద్దని యేల సన్న సేసేవు
 కుంకుమచన్నులచొప్పు గురిగా నీమేన నంటె
 లంకెల నీసుద్దులు యీలలన లెరఁగరా

జలజాక్షులనుఁ గూడ జాణవని పొగడితే-
 నెలమి నోరేల మూసే వింతలోనను
 పలుపోఁకులమచ్చము పట్టిఇయ్యఁదొడఁగెను
 వొళవైననీవోజ యీవొద్దివా రెరఁగరా

సొరిది నీనాసందిచుట్టరికాలు చెప్పితే-
 నెరవుసేయకుమని యేల మొక్కేవు
నిరతి శ్రీవేంకటేశ నిలువెల్లాఁ బచ్చిదేరె
 పొరి నీపొందు లిరుగుపొరుగు లెఱఁగరా ॥ ఇం॥

ఆరిబి

ఒక్కరిఁ గాదనలేక వూరకున్నాఁడవు నీవు
 మక్కువతో నెవ్వరిపై మనసున్నదయ్యా

ఇంతి నినొ్నకతె తమఇంటికిఁ బిలిచితేను
 పంతాన వేరొకతె చెయివట్టి తీసీని
 వంతులకు నిదుమేలా వలపులు దైవారి

నేమాన నెదుటుబడి నెయ్యము లాసలు చూపి
చేముంచి యెవ్వరిచేత నేఛగానేవయ్యా

కందువ నొకతె నిన్నుఁ గాఁగిలించి కూడితేను
సందడిఁ బెండ్లాడిని సరి నొక్కతె
ఇందులోనే కూడితివి యిద్దరి శ్రీవేంకటే
విందుచెప్పి యెవ్వతెకు వీడెమిచ్చేవయ్య ॥ ఒకి

శంకరాభరణం

గుట్టున నుండవే కోమలి
జట్టిగొనుచు నిను జరసీ నిపుడు

సముకాన నతఁడు సరసమాడఁగా
తమకించకువే తరుణీ
చెమటలు నీమేనఁ జిప్పిలఁగఁ జూచి
తిమురుచు రమణుఁడు తెగడీ నిపుడు

చెలిమి నేసి పతి చేకొనఁగానే
బలిమిసేయకువె పడఁతీ
పులకలు చెక్కుల పొదిగొనఁ గనుఁగొని
నలుగడఁ దా నటు నవ్వీ నిపుడు

పొరిది శ్రీవేంకటేశుఁడు గూడఁగానె
గరిసించ నేఁటికే కలికీ
నిరతి మోమునఁ గళ నిండఁగ దిష్టించి

చెప్పరయ్య వూడిగాలు సేసేము నేము
చిప్పిలుమోవితేనెలు చిమ్మనేల సిగ్గులు

మచ్చికలు దైవారె మదనకళలు దేరె
యిచ్చలో నిద్దరికిని యింపులు మీరె
తచ్చి సతు లాడుకొంటే తలవంచుకొననేల
పచ్చియైతి రిఁకనేల పలుమారు సిగ్గులు

అంగాలఁ జెమట మించె ఆసలు లోలోఁ బొంచె
రంగుగా నిద్దరి సింగారములు ముంచె
ముంగిటిచెలులతోడ మూసి మంతనములేల
యింగిత మెఱఁగవచ్చె నిఁకనేల సిగ్గులు

తలపోఁతలెల్లా దక్కె తనువులు కడుఁ జొక్కె
కలసితి రిద్దరిభోగములు నిక్కె
యెలమి శ్రీవేంకటేశ యిందరితో మఱఁగేల
యెలుఁగెత్తి నవ్వరాదా యిఁకనేల సిగ్గులు ॥ చె

రేకు 925 ఆహిరినాట

మాముందర నింత యాల మాటకాలు నెరపేవు
గామిడివి గావోయి కడపరాయా

కందువ సేవలు సేసి కడునవ్వులు నవ్వేని
పొందు గదా తొలి నీకుఁ బొలఁతితోను

నేసలు పైఁజల్లిని చెంగటఁ గొలువునేసీ
ఆసుద్దు లొనగూడెన ఆపెకు నీకు ॥ మాము ॥

కాయము చన్నుల నొత్తీ కాఁకదేరి మాటలాడీ
ఆయనా చుట్టరికము అంగనతోను
యీయెడ శ్రీవేంకటేశ ఇటు నన్ను నేలితివి
అయితమా పెండ్లికి ఆపెకు నీకు ॥ మాము ॥ 133

రామక్రియ

[1] ఏమి జాణతనా లాడే వింకా నీవు
ఆమాటే నిక్కమౌనె అతని వలనను ॥ పల్లవి ॥

సుదతిరో నీవద్దఁ గూచున్న చుట్ట మెవ్వఁడే
మదనగురుఁడే వీఁడు మాయింటిలోన
అదియేమె నావిభుఁడౌట నీ వెఱఁగవా
కదిసి నన్నేలేనంటేఁ గాదనఁగవచ్చునా ॥ ఏమి ॥

యెవ్వరితో నవ్వితివే యిందాఁకా నీవు
నివ్వటిల్ల గిలిగించీనే కృష్ణుఁడు
యివ్వల నాకిచ్చినబాసెరఁగవా
చివ్వనఁ బొందు సేయఁగ సిగ్గులు వడుదునా ॥ ఏమి ॥

మంచముపై నెవ్వఁడు నీటు చూపీనే; నన్నుఁ
బ్రేమ శ్రీవేంకటేశుఁడు పెండ్లాడెనే
ఆముందే నన్నుఁ బెండ్లాడె నదెరఁగవా
నామగఁడ ననఁగా మానఁగవచ్చునా ॥ ఏమి ॥ 134

అలనేవు సొలనేవు అప్పుడే నీవు
వలపు రేఁచుటగాక వట్టిసట లేఁటికే

సరసమాడేవిభుఁడు చన్ను లెంతపిసికినా
కరఁగి కూడుటగాక కసరనేలే
గొరబుగాఁ గూడేవాఁడు గోర నెంత పూఁదినాను
దొరసి మెచ్చుట గాక దూరనేఁటికే

మగఁడైనవాఁడు రతి మచ్చరము చూపితేను
నగుట గాక మాఁటలవెగటులేలే
తగుల మోహించువాఁడు తమకించి పొదిగితే
సొగిసి లోనౌటగాక బిగియనేలే

సందడిఁ బెండ్లాడేవాఁడు సారెఁ బువ్వులవేసితే
విందులఁ జొక్కుట గాక విసువులేలే
యిందరిలో శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్ను నేలె
సందుకొనవలెఁగాక చలపట్టనేలే ॥ అ

దేశాక్షి

కంటిమయ్యా నీచేఁతలు కన్నులపండుగగాను
వెంటలైనముచ్చటలే ప్రియము నీకు

మంతనమాడేటివేళ మజ్జనమాడేటివేళ
ఇంతితోడి సరసము లింపులు నీకు

ఇందుముఖితోడిమాట హితవు నీకు
చెందమ్మిపూవుదండలు సింగారించుకొనేవేళ
విందులమోవియీవులు చేదుక నీకు

సొలసి నవ్వేటివేళ సొమ్ము లిడుకొనేవేళ
అలమేల్మంగకూటమి అనువు నీకు
యెలమి శ్రీ వేంకటేశ ఇద్దరుఁ బెండ్లాడేవేళ
కొలువులోనిమొక్కులు కొసరు నీకు ॥ కం

సౌరాష్ట్రం

అందులోనే వున్నవివె అన్నివిన్నపములును
కందువతోడఁ గలసి కరుణించవయ్యా

చెక్కులపై వెదజారుఁజెమట నీపచ్చడాన
గక్కనఁ దుడుచుకొనీఁ గామిని
వెక్కసపుఁగుచములవెట్ట దీర నీచేతుల
అక్కరతో నద్దుకొనీ నప్పటప్పటికిని

అలయికలెల్లాఁ దీర నండనున్ననీమీఁద
పలుమారు నొరగీని పడఁతి
నిలువుఁగొప్పు వీడితే నిన్నే ముడువుమనీ
తలఁపించి విరహాతుతమకముతోడను

తెల్లమిగాఁ దనదప్పి దేరుచుకొని మోవి
మెల్లనే చేకొనీ నలమేలుమంగ

ఇంకనేమి గడ మిందరికి
పొంకముగా నిటు భోగించఁగలఁడు

జగడములడిచినసపతులకెల్లా
తగవులు చెప్పఁగఁ దాఁ గలఁడు
వెగటునఁ దనతో వెంగములాడిన
మగిడి వేఁడుకొన మఱి తాఁ గలఁడు

ప్రియపడి కాంతలు పెనఁగి యలసితే
దయలు దలంచఁగఁ దాఁ గలఁడు
రయమునఁ దనకై గాఁపుగ వలచిన
నయమున నవ్వుచు నమ్మించఁగలఁడు

సతమై వనితలు సరిఁ బెండ్లాడిన
తతిగొని కూడఁగ(గఁ?) దాఁ గలఁడు
యితవై శ్రీవేంకటేశుఁడు తానె
గతియై మమ్మేలెఁ(లఁ?)గమ్మటిఁ గలఁడు ॥ 6

రేకు 926 ఆహిరి

వద్దనేమా మిమ్ము నేము సట్టిదూఁపు మాకేల
పొద్దువొద్దు దప్పకుండా భోగించరాదా

మరిగినచెలి నీపై నిచ్చకలు చల్లఁగాను
తొరలింపుఁడ ఎకాన తోఁగి చూచేవు

[illegible]
చఁచలించి యట్టె నీవు సన్న సేసేవు
ఘంచితనముల నింతమతిగ్గినవారు మీరు
కొఁచక పీఁటమీఁదటఁ గూచుండరాదా

వెనకనుండాపె నేఁడు విడెము నీకియ్యఁగాను
యెనసితివి శ్రీవేంకటేశ ఆపెను
మనసార నలమేలుమంగను సన్నేలితివి
పెనఁగనేల ఇద్దరూఁ బెండ్లాడరాదా వ

పాడి

పొద్దువోక నీవు వట్టిపొందులు సేసేవుగాక
వొద్ద నాపె వుండఁగాను వారు లితవయ్యేరా

చెంగట నేపొద్దు నీకు సేవలు సేసీనాపె
వుంగిటి నెదుట నిలిచున్నది ఆపె
సంగతిగా నవ్వునవ్వి సరసమాడీ నాపె
సింగారపు సతులెల్లాఁ జిత్తానఁ బట్టేరా

వేడుకతో సారె మోవివిందులువెట్టీ నాపె
యీడుజోడై నీకు విడేలిచ్చీ నాపె
యేడలేని విన్నపాలు ఇట్టె సేసీ నాపె
వాడవారి మీఁద నీకు వలపు వుట్టీనా

సందికొని కాఁగిలించి చన్నులనొత్తీ నాపె
మందెమేళపుటలమేల్మంగే ఆపె

గక్కన లాలించరాదా కాఁగిట నించఁగరాదా
చెక్కుచేతితో నిదెంత సిగ్గులువడేవు ॥ పల్లవి ॥

చలివాసి నీతోను సరసమాడీ నదె
మొలకచన్నులు నీపై మోపీ నదె
చెలఁగి చుట్టరికము చెప్పీ నింతలోన నదె
చెలిఁ జూచి నీవెంత సిగ్గులువడేవు ॥ గక్క ॥

కడువెల్లవిరిగాను కన్నుల మొక్కీ నదె
వొడిమీఁదఁ గూచుండి వొరసీ నదె
జడియుఁదమితో మోవిచవు లడిగీ నదె
చిడుముడి నీవెంత సిగ్గులువడేవు ॥ గక్క ॥

చెనకుచు నిను గూడిసేవలు సేసీ నదె
మనసిచ్చె నలమేలుమంగ నీ కదె
ఘనుఁడ మమ్మేలితివి కందువ శ్రీవేంకటేశ
చినుకఁజెమట నెంత సిగ్గులువడేవు ॥ గక్క ॥ 141

శ్రీరాగం

నాఁడే నీవిచ్చినబాస నమ్మి వున్నారము నేము
పోఁడిమిఁ దలఁచవయ్య పొంతనే మాసేవలు ॥ నాఁడే ॥

పలుపుపైఁ బవళించి పడఁతి విడె మియ్యఁగ
నెరిసరసము గడునిండా నాడేవు

వొద్దిక నాపెతోడ నవ్వులు నవ్వేవు
కొద్దిలేనివలపులు కోటానఁగోటులు మీకు
సుద్దులు దలఁచి దయఁజూడవయ్య మమ్మును ।

కొలువులో నిలుచుండి కూరిమి నీపైఁ జల్లఁగా
అలమేలుమంగ నురమందు నించేవు
తొలుతె శ్రీవేంకటేశ దొరసితి రిద్దరును
అలరి మమ్మేలి మాయంకల రాఁగదవయ్య ॥ నాఁ

పాటి

కమ్మటి నెవ్వరినైనాఁ గాకుసేసీని
ఇమ్ముల నాసోదము యెంత గద్దో చూడరే ॥

కొలుపై వున్నాఁడు వాఁడె గోవిందరాజు మించి
చెలు లిద్దరు పాదాలు చేరి యొత్తఁగా
చెలరేఁగి నవ్వుకొంటా శేషునిపైఁ బవళించి
పలుమారు వలపులు పచరించీఁ జూడరే ।

తగవులు దిద్దీ వాఁడే తమితో గోవిందరాజు
మగువ [1]లందెంది యాకుమడిచియ్యఁగా
జిగి మర్మాలంటుకొంటా చిత్తరువుమేడలోన
వెగటులేనిమోహము వెదచల్లీఁ జూడరే ।

కదిసీ నదివో శ్రీవేంకటాద్రి గోవిందరాజు
సుదతులు కాఁగిట మెచ్చులు మెచ్చఁగా
గుదిగొన మోవియిచ్చుకొంటా నేకతమున

ఏఁటికి గుంపెన లిఁకనేలే నీకు
కూటమిరతులకుఁ గొసరఁగరాదా

వొడివట్టుచునుఁ బతి వొడఁబరచఁగాను
జడియుచుఁ బలికి కసరుదురటే
అదరి కెమ్మోవితేనియలు గురిసీ నదె
తొడరి నీవు బువ్వము దొడుకఁగరాదా

నమ్మిక లొసగుచు నవ్వులు నవ్వఁగాను
చిమ్ముచు నాలిడి యింత సేతురటే
వుమ్మడిఁ గుచము లాతఁ దొరసీ; వలపులు
నెమ్మి చుట్టరికములు నెఱపఁగరాదా

కలయుచుఁ గాఁగిట కందువ లంటగాను
కెలయుచుఁ గడును జంకింతురటే
యెలమిని శ్రీవేంకటేశుఁడు మన్నించీని
పలుకుఁబంతములపై కొనరాదా ॥

రేకు 927. కన్నడగౌళ

ఇంత సేసినవాఁడవు యీడేరించుకొనరాదా
వింతలాయఁ జేఁతలెల్ల వెరపేల నీకును

పొందులేనివాఁడవైతే పొంతఁ గూచుండఁగనేల
ఇందుముఖి నీతోడ నేల నవ్వీని

మోసదీర సతి నీకు మొక్కఁగనేల
బాసలిచ్చి నన్నునేల పైపై నాడఁబరచేవు
రాసికెక్కితివి విచారములేల నీకు

చుట్టమవు గాకుంటే సుద్దులు చెప్పఁగనేల
ఇట్టె ఆయింతి విడె మియ్యవచ్చునా
నెట్టన శ్రీవేంకటేశ నేఁడు నన్ను నేలితివి
గుట్టెల్లాఁ దెలిసితిమి కొంకనేల నీకు ॥ఇం

వరాళి

నీవొళ్ళఁ గల్లలేకుంటే నిందుక వుందువుగాక
చేపదేరి వుండఁగాను సిగ్గువడ నేఁటికి

మొగము చూచి చెలి మొక్కులు నీకు మొక్కఁగా-
నెగసక్కెలంటా నేల యెంచుకొనేవు
నగుతా నాపె నిన్ను నాయము లడుగఁగాను
వెగటువెంగేలంటా వీఁగఁగ నేమిటికి

మక్కువతో నేదలేనిమాట లింతి యాడఁగాను
వెక్కసము లందులో భావించి చూచేవు
యిక్కువ నాపె నీకు నిచ్చకములు చూపఁగ
పక్కన నొరపు లట్టె పట్టఁగ నేమిటికి

మనసిచ్చినసతి నీమర్మములు ముట్టఁగాను
తనివోనిసిగ్గుతోడఁ దలవంచేవు

దేవరవు గావా తెలిసితి మల్లినాఁడే
చేవదేరినపనులు చెప్పనేల యిఁకను

జఱిసి జఱిసి నీయాచారము లేమి చెప్పేవు
యెఱఁగనా నీసరిత లింతక తొల్లి
యెఱుకలు సేసి నీవు యెచ్చరించ నిపుడేల
మఱచేవా నీకతలు మాటికి మాటికిని

వెంటనే పొగడుకొని విఱ్ఱవీఁగే వెంతేసి
కంటిగా నీగుణములు గరగరగా
పెంటలుగాఁ బచారించి పెనఁగులాడఁగనేల
జంటగాక విడిచేవా చలముతో నీవు

పుక్కిటివిడె మిచ్చి పొంచి వాదఁబరచేవు
దక్కెఁగా నీకాఁగిలి తతితోడను
గక్కన శ్రీవేంకటేశ కలసితి విదె నన్ను
తక్కువయినవా నీతగినమన్ననలు ॥

దేసాళం

అన్నియుఁ దెలిసినవే అందరును
వెన్నలో నేతివంటిది వేడుక నీప్రియము

మొక్కలాన నాకె నిన్ను మోతనొకమాటాడితే
వెక్కసములాడేవు వేమారును
మక్కువ మీ ఇద్దరికి మాటలే వాండుగాని

వొట్టుకొని పెనఁగుతా నొద్దుకొనేవు
గుట్టుతోడ నుండేవి మీ గుణము లింతేకాని
పట్టుజిగురువంటిది పాయనిమీవలపు

చెలిమిసేయుచు నాపె సెలవుల నగితేను
చెలరేఁగి నవ్వేవు శ్రీవేంకటేశ
బలిమి చూపేవి మీ పంతము లింతేకాని
తలిరులవంటివి బిత్తరపు మీమోవులు

బౌళిరామక్రియ

నీదు సేఁతలకు నీవే దిష్టము
మేదిని నేమెల్లా మెచ్చితిమయ్యా

యీడగుకొంతలు యింటనే వుండఁగ
వాడలసతులకు వలచితివి
వోడక క్షీరాబ్ధినుండి రేపల్లెను
తోడనే వెన్నలు దొంగిలినట్లు

వుంగిటివాసన లొడలనే వుండఁగ
అంగడిగంధము లడిగితివి
బంగారు పీతాంబరము నీకుండఁగ
చెంగటికోకలు చేకొన్నట్లు

ఆనఁ గౌస్తుభము అక్కున నుండఁగ
శ్రీసతి నురమునఁ జేర్చితివి
వేస శ్రీవేంకట[illegible] నుండఁగ

అందుకేపో చింతించీ నప్పటనుండి
 చెంది వేఁడుకొనవయ్యా చెలిని యీ వేళను ॥ పల్లవి ॥

గుట్టున నుండినదాని గోరు చంటిమీఁదఁ దీసి
 నట్టనడుమ నూరకే నవ్వితివట
 అట్టె అదియునుఁగాక అలయించి యేమిటని
 అట్టుగాఁ గేరడము లిట్టె యాడితివట ॥ అందు ॥

ముప్పిరిసిగ్గరిదానిముసుఁగు దీసి మోమెత్తి
 తప్పక చూచితివట తత్తరానను
 అప్పటి వేరొకతెతో నాపెరహస్యములెల్లా
 చెప్పి మోవిమీఁద గంటి నేసితివట ॥ అందు ॥

చెలఁగి కూడినదానిచీర నీవు గట్టుకొని
 యెలమిఁ బచ్చడ మాపె కిచ్చితివట
 అలమేలుమంగపతివై నశ్రీ వేంకటేశుఁడ
 నిలువుఁగల్కితగాలు నేర్పితివట ॥ అందు ॥ 150

928 దేశాక్షి

చెల్లదా నీవేమేమి సేసినా నీకు
 వెల్లవిరిగా నేల వింతలు సేసేవు ॥ పల్లవి ॥

చీటికిమాటికి నన్ని నేఁతలెల్లాఁ జేసివచ్చి

చూపు లేమిచూచేవు సోద్యముగాను
వైపెరఁగి నేను నీవలపు సోదించితేను
పైపై నన్ను నెంత వొడఁబరచేవు నీవు

మాఁగినమోవిమీఁద మఱులెల్లా నించుకొని
కాఁగిట నెట్టు గూడితి కమ్మటి నన్ను
వీఁగకు శ్రీవేంకటేశ వేఁడుకొని మొక్కితేను
నాఁగువారఁ బొందులెల్లా నడపేవు నీవు ॥చే

మాళవిగౌళ

కానుకకుఁ జేయిచాఁచీఁ గమ్మటిఁ దాను
నానినచెమటతో సన్నలు సేసీని

ఆమనికాలము వచ్చె నంగనవలపు హెచ్చె
యేమని విన్నవింతమే యీతనితోను
కామునమ్ములు వాఁడెక్కె కమ్మటిఁ జిగురులు నిక్కె
నాములువారఁ దా నింక నవ్వులు నవ్వీని

చందురుఁడు నుదయించె జవ్వన మీకెకు మించె
కందు వేడఁ జూపుదమే కాంతునికి
మందమారుతము రేఁగె మలసి యలులు మూఁగె
చెంది మోము చూచితేనే సిగ్గులువడీని

కోకము లొద్దికిఁ జేరె గుబ్బచన్నుఁగవ మీరె
చేకూరిచే దెట్లా నే శ్రీ వేంకటేశు

కురంజి

మెచ్చవలదా నీవు మెలుఁతనేరుపులకు
హెచ్చుకుందు లెంచుకొని యెగ్గులువట్టుదురా

పంతమాడి నీమోవిఁ బచ్చిసేఁత సేసితేను
కాంతనేల దూరేవు గద్దెనతోను
దొంతినున్న వలపులు దోమటిదాడికితేను
చింతతోడ నిపుడేల శిరసువంచేవు

ఇట్టె జవ్వనమదాన నెంగిలి నిన్నుఁ జేసితే
తిట్టులేల తిట్టేవు దీకొనుచు
గుట్టుతోడఁ దరితీపుగుణ మేరుపరచితే
వొట్టుకొని చింతలేల వొడిఁగట్టుకొనేవు

రావాడి కడపలోన రతి నలయించితేను
శ్రీవేంకటేశుఁడ యెంత చిమ్మిరేఁగేవు
వేవేలుతమకముల పిడుదోడు లాడితేను
చేవదేర నెంతేసి సెలవి నవ్వేవు ॥ మె

శుద్ధదేశి

ఆతనినేల కొసరే వప్పటి నీవు నీ–
యేతులెల్లాఁ జూచెఁగదె ఇందాఁకాను

నిన్నుఁ బేరుకొని పిల్చి నీతోనే మాటలాడి

తెరవేసుకొని మోవితేనియలు నీకొసగి
ఇరవుగా నవ్వేఁగదె ఇందాఁకాను

వొడివట్టి నినుఁ దీసి వొద్దిక జూజాలాడి
జడిగొనఁ గూడేఁగదె చవికెలోన
చిదుముడి నన్ను నేలె శ్రీవేంకటేశుఁడు నేఁడు
యెడయఁడుగదె నిన్ను నిందాఁకాను ॥

ముఖారి

పొరిది నీసరితలు చూచితిఁగాక
సిరులనీ సేవలు సేయక విడిచేనా

కప్పురాన వేసేవు కడుసన్నలు సేసేవు
యెప్పుడు నీసుద్దులు నే నెఱఁగనివా
దప్పిదేరఁ బలికేవు తమితో బుజ్జగించేవు
చెప్పినట్లు నే నీకు సేయకుండేనా

విరులెల్లా ముడిచేవు పీడెము నాకిచ్చేవు
మరిగి నీమేలు నేను మఱచితినా
పొరిఁబొరిగుణములు పొగడేవు నావద్ద
తిరముగా నిట్టె సమ్మతించక మానుదునా

కలకలనవ్వేవు కాఁగిట బిగించేవు
తొలుతనే నే నిన్ను సంతోసించనివా
యెలమి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నెలవై [illegible]

జవ్వనపుదాన వింత చలమేఁటికే
చివ్వన పీడె మొసగి సేవసేయవే

మక్కువతో రమణుఁడు మంచిమాట లాడఁగానే
వెక్కసములాడి యేల వేగిరించేవే
పక్కన నందుకుఁగాను పైఁ జేయివేసితేను
మొక్కలానఁ గాతాళించి మోమేల వంచేవే

నయమిచ్చి యాతఁడు నవ్వు నీతో నవ్వఁగాను
రయమున నీవెంత రవ్వసేసేవే
ప్రియమున నప్పటిని పెనఁగి పొందుసేయఁగ
నియమానఁ జలపట్టి నీవేల లోఁగేవే

శ్రీ వేంకటేశ్వరుఁడు చేరి నిన్నుఁ గూడఁగానే
కావరించి నీవేల కక్కసించేవే
చేవదేర మీఁద మీఁదఁ జిమ్మిరేఁగ మన్నించఁగా
వేవేలువిధాల నెట్టు వెరగందేవే ॥ జ

కు. 929 ఛాయానాట

ఇట్టె రాఁగదరా యింటిలోనికి
పుట్టిపడి బిగియఁగ నొద్దురా ఇఁకను

జవ్వనపాయమువారు చలమునఁ బెనఁగితే
రవ్వలై వలపులు మేరలు మీరును

దోమటితమకములు గారు కెక్కను
కామించిసదాన నేను ఘనుఁడ విన్నిటా నీవు
వోముచు గుట్టున నవ్వనొద్దురా ఇపుడు

అలుమగఁడైనవారు ఆసల నూరకుండితే
చాలుకొన్నతరితీపు సందడించును
మేలిమి శ్రీవేంకటేశ మెచ్చి నన్ను నేలితివి
వోలవేసి కొసరఁగనొద్దురా ఇఁకను ॥ ఇ

## భౌళి

కంటిమి వింటిమి నేఁడు కందువగాను
వొంటిఁ జిక్కించుక నిన్ను నొరసే దేమి ॥

నిక్క నీవు సేయించుకొనినగురుతులెల్లాను
చెక్కులనే వుండఁగాను చెప్పేదేమి
పిక్కటిల్లుఁజెమటలు పిచ్చిలి మేననుండఁగ
అక్కడి నీసుద్దులెల్లా నడిగేదేమి

పెనఁగి యెక్కడనో తెప్పించుకొన్నవుంగరము
కొనవేల నుండఁగానే కొసరేదేమి
వెనకటి నీపొందులు వెంటనే వచ్చివుండఁగ
దినదినమును నీతోఁ దెలిపేదేమి

కాముకళలెల్లా నొక్కగనియై నేఁడింతలో నీ-
మోముననే వుండఁగాను మొఁగేదేమి
ఆమని శ్రీవేంకటాద్రి అహోబల నరసింహ

ఎవ్వరిముందరఁ జూపే వేడలేసినీగుట్టు
నవ్వులేమి నవ్వేవు నాలితనమునను ॥పల్లవి॥

విన్నవించీ నాపెమాట వినుకొనరాదా
యెన్నిపరాకులు సేసే వెఱఁగివుండే
సన్నసేసీ నివెల్లా జాడతోఁ జూడరాదా
కన్నులేల మూసేవు కడుసిగ్గుతోడను ॥ఎవ్వ॥

ఆపెయిచ్చేవిడెము అందుకొనరాదా
చూపులేమి చూచేవు సోరణగండ్ల
ఆపని కాసపడితే నట్టె కానిమ్మనరాదా
యేపున నేలకొంకేవు యిందరిలోపలను ॥ఎవ్వ॥

కూడినయాపెకూటమిఁ గోరి చెంగలించరాదా
వాడుమోముతో నెంత వాను లెంచేవు
యీడనే శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
యీడులేల పెట్టేవు యివ్వలా నవ్వలాను ॥ఎవ్వ॥ 159

## సామంతం

మాయలేల సేసేవు మన్నించరాదా
బాయిటఁ బడె నీగుట్టు ప్ర[1]హ్లాదవరద ॥పల్లవి॥

సారసివలపు తొల్లే వాడిఁ గట్టుకొన్నందుకు
అరుదైనతొడపై తొయ్యలి సాకిరి
సరుసనే మాతోను జాణతనాలాడేవు

ననుపు నాతోనే నవ్వులెల్లా నవ్వేవు
నినుపులై గజరెల్లా నిండె నీమై నిపుడు ॥

తమకమెల్లాఁ దవ్వి తలకెత్తుకున్నందుకు
కొమరైనశిరసుపై కొమ్మ సోకిరి
మమత శ్రీవేంకటేశ మరిగి నన్నేలితివి
జమళి నీపొందులు సతమాయ నేఁడు ॥ మాం

ఆహిరి

ఎటువంటివలపులో యిద్దరికిని
చిటుకంటే మెచ్చేవు శ్రీ నరసింహా ।

గిరులెక్కి లకిమమ్మ కిన్నెర వాయించుకొంటా
పరగ నీమోము తప్పక చూడఁగా
సరుగన నీవు వచ్చి సంగడినే కూచుండి
సిరులతోఁ బొగడేవు శ్రీ నరసింహా

యెదురుమేడపై నెక్కి యెలుఁగెత్తి పాడిపాడి
వుదుటునఁ దామరపూవుల వేయఁగా
పొదిగి నీవంతలోనే బుజముపైఁ జేయివేసి
చెదరక చెక్కునొత్తేవు శ్రీ నరసింహా

పలుపుపై నీకె నీపైపరాకునఁ జెలితోడ
అలిమిలి నిన్నుఁ జూపేకాంత మాడఁగా
మెఱయ శ్రీవేంకటాద్రిమీఁద వచ్చి కూడితివి

గచ్చు లేమిటికిరా చేఁగలమట్టిచెన్నుఁడా

అరితేరి కతలెల్లా నడుగుతా నన్ను నీవు
చేరి యానపెట్టకురా చెప్పేఁగాని
దూరు సేయ కిఁకనైనా దోసము లేదనరా
సారెసారె నీకు మొక్కి జట్టిగానే నేను

వొగ్గి కొంగువట్టుకొని వొకటొకటే యడిగి
సిగ్గులువడకురా చెప్పేఁగాని
అగ్గలమై కిందుపడి ఆసుద్దులు మఱవరా
అగ్గమై నీవూడిగాలే అన్నిఁ జేసే నేను

యెన్నఁగ శ్రీ వేంకటాద్రి నిరవై నన్నేలితివి
చిన్నిగోరు దియ్యకురా చెప్పేఁగాని
మన్నించితి వెప్పుడు నామచ్చిక దలఁచరా
సన్నల నీరతులకే సమ్మతించే నేను ॥ ఇ

రేకు 930 ధన్నాసి

చిత్తగింతువు రావయ్య చెలికడకు
హొత్తులతలపోఁతల బోగించీని

మనసు నిలుపరాక మాటలనుఁ బొద్దువోక
వొనరి విరహమున నున్నది చెలి
కొనలుసాగినయాస కొప్పునఁ బెటేసేసఁ

చెమటలఁ దొప్పఁదోఁగి సిగ్గులనె కడుమాఁగి
అమరినజవ్వనాన నలసీఁ జెలి
తిమురువలపులను తియ్యనిసోలపులను
జమళిపులకలతో జాజుకొనీని ॥ చిత్త

యెదురుచూపులు చూచి యిట్టె కాఁగిటికి లాచి
ముదమునఁ జేతులెత్తి మొక్కీఁ జెలి
అదె శ్రీవేంకటేశ అట్టె నీవు గూడఁగాను
వుదుటుఁగళలు రేఁగ నూరుపు లాఁగీని ॥ చిత్త ॥ 16

ఆహిరి

ఇన్నిటా నీచలములు యీడేరనే
పన్ని నీనేరుపు లిట్టె పచరించవలెనా ॥ పల్లవి

పెనఁగి యాతఁడు నీకుఁ బ్రియములెల్లాఁ జెప్పె
తనిసి ఇంతటా నీచిత్తము వచ్చెనా
యెనసి వలచేనంటా ఇందరిలోనా నీష
నవిచినమగవాని నగుఁబాటుసేతురా ॥ ఇన్ని

చెలరేఁగి సేయరానిచేఁతలెల్లా నీకుఁ జేసె
తలచినసీదుపంతము చెల్లెనా
మెలఁగి నీమాటలు మీరెనంటా నీవు
కిలకిలనగి యింత కిందుపరపింతురా ॥ ఇన్ని

కూరిమి నీకాఁగిటను కూడినట్టెల్లాఁ గూడె
కోరిననీకోరికలు కొనసాగెనా

అట్టునేయఁ బనిలేదు యిట్టె రామచంద్ర
గుట్టుతోడ జలనిధిపై గొండలు ముడివేసితి –
వెట్టు మఱవఁగవచ్చు నివి రామచంద్ర ॥రా

బతిమితోడుతఁ బైఁడిపతిమెఁ గైకొంటివి
రతికెక్కె నీచలము రామచంద్ర
మితిమీరి జవ్వనము మీఁదుకట్టితివి నాకై
యితరు లేమనఁగల రిఁక రామచంద్ర ॥రా

నావంటిసీతను నాఁగేటికొనఁ దెచ్చితి
రావాడితమకముతో రామచంద్ర
యీవేళ శ్రీ వేంకటాద్రి నిరవై నన్నుఁ గూడితి
చేవదేర గండికోట శ్రీరామచంద్ర ॥రాజ॥ 1

సాళంగం

ఏల కూరిమిగొసరే విప్పుడు నన్ను
వాలాయించి నీవాపెకు వశమై వున్నాఁడవు ॥పల్ల

తమకించి నే నిన్ను దప్పులుదేరిచేనంటే
అమరునా నీవద్ద నాపె వుండఁగా
సముకాన నుండి మోవిదవులు చూపేనంటే
తెమలేవా ఆపె తరితీపుల నున్నాఁడవు ॥ఏ

వింటే దయపుట్టి యిట్టె విచ్చేసీ నీడకు
యింటికిఁ దోడితేరమ్మా యీకెప్రాణేశ్వరుని

చిత్తరుపటము చూచి సెలవుల నవ్వు నవ్వీ
తత్తరానఁ బాన్పుచూచి తలవంచీని
పొత్తులడపము చూచి పులకించీ మేనెల్లా
హత్తి విన్నవించరమ్మా అంగనవిభునికి

చేరి కేళాకూళి చూచి చింతతోడఁ దలపోసీ
పోరువపుగుంపుఁ జూచి భ్రమసీని
కోరి పువ్వుటిల్లు చూచి కుప్పళించీఁ బెంజెమట
సారె నెరిఁగించరమ్మా సతినాయకునికి

నిలువుటద్దము చూచి నివ్వెరగుతో నున్నది
చెలికత్తెలనుఁ జూచి సిగ్గువడీని
కలసీఁ గాఁగిటఁ దానె గక్కన నేతించి నేఁడు
చెలఁగి కానుకీరమ్మా శ్రీవేంకటేశునికి ॥ విం

సాళంగం

గుట్టుగలవాఁడుగాఁగా గుంపించకున్నాఁడుగాక
వొట్టుక నేమెల్లాఁ జూచి వోర్వఁగఁగలమా

ఆతనినేల దూరేవే అంగడికెక్కె వలపు
యేతులఁ బెండ్లాడినవా రెందరు లేరు

వంతులకు నెందరైనా వద్దనున్నారు
వింతలుగా నవ్వుతానే విందారగించఁ బెట్టి
బంతిఁ గూచుండి విభునిఁ బంగించవలెనా

సిగ్గులే లలమేల్మంగ శ్రీవేంకటేశుఁడు గూడె
కగ్గులేనిసవతులు గాచుకున్నారు
యెగ్గులేక నన్నునేలె నితనిఁ బానుపుమీఁద
అగ్గలపురతుల నీ వలయించవలెనా ॥ గ

## పళవంజరం

ఏఁటిమతకములో యీపెకు నాతనికి
నాఁటకము లివి గొన్ని నడచీఁ జూడరే

కొలువుసేసేయాఁటది గుట్టుతోడ నుండుఁగాక
కలకల నగనేలే కాఁతాళాలను
చెలఁగి విభుఁడు లోలో నేఁత లేమిసేసెనో
తలఁపునఁ బుట్టుకొని తమకించీఁ దాను

విందుచెప్పవచ్చినాపె వినయాలు సేసుఁగాక
పందేలాడఁ దనకేలే పలుమారును
కందువ నాతనివల్ల కపటాలేమిగనెనో
మందలించవలసిట్టె మాట దీసీఁ దాను

పీఁటపై పెండ్లికూఁతురు ప్రియముతోఁ గూడుఁగాక
సీటున జంకించనేలే సేరుపుతోడ

ఔనయ్యా మంచివాఁడ వందుకెల్లా నేనా గురి
నానఁబెట్టి సెలవుల నవ్వులు నవ్వేవు

చెలియచేసినసేఁత చెప్పేవానివలెనే
కలపుకోలుగ నన్నుఁ గాఁగిలించేవు
పొలసి గోరనూఁదుట చూపేవానివలెనే
కెలయుచు నాబుజము గీరేవు నీవు

యెచ్చుగుందుమాటలు యెంచేవానివలెనే
పచ్చిదేరేవొట్టు నాపైఁ బచారించేవు
దిచ్చరిసాకిరు లిట్టె తెలిపేవానివలెనే
ఘుచ్చటఁ జేతులు నామోముపైఁ జాఁచేవు

పెనఁగులాటలు తలపించేవానివలెనే
గొనకొని నాపెద్దకొప్పు వట్టేవు
యెనసి శ్రీవేంకటేశ యిటతిఁ గూడినట్లానే
అనువైనఅలమేల్మంగనైననన్నుఁ గూడేవు ॥

రేకు 949 నట్టనారాయణి

ఇన్నాళ్లు నేడ నుండెనో యెవ్వరు నెఱుఁగరు
కన్నులయెదుట నేఁడు గానబడెఁగాని

యేమి గావలెనో కాని యీపె నీకు నెచ్చెలై
మోముకళలుదేరఁగ మొక్కె నిపుడు

సేవలెల్లాఁ జేసితేను చెలఁగితివి
భావమెరిఁగి గంటము పైఁబూసి నవ్వితివి
[1]దోమటి(వన?)మీఁదద్దరిపొందులు నేఁడు గంటిమి ॥

తనపే రేఁటిదోకాని తగిలి శ్రీవేంకటేశ
చెనకుచు నీపైఁ దాను నేసవెట్టెను
యెనసితి విటు నన్ను యే నలమేలుమంగను
నినుపులమీఇంపులు నేఁడు నేము గంటిమి ॥ఇన్నా

ఆహిరి

ఏమని విన్నవించేము ఇంతి నీపైఁ గలప్రేమ
కోమలపుఁగలికి చెక్కనఁ జేయిచేర్చెను ॥

యేకతాన నుండి సతి ఇట్టె నిన్నుఁ దలఁపైతే
చేకొని నిట్టూర్పు నించి చెలులఁ జూచె
పైకొని వారందరు కోపాన నిన్ను దూరితేను
దాకొని యేమీ ననక తలవంచుకొనెను

మంచముపై నుండి కాంత మనసు నీపైఁ బారితే
పొంచి మాటాడేచిలుకఁ బొక్కుచుఁ దిట్టె
ముంచి యందుకు నది నీముఁ(ముం?)జేత వాలితేను
దించనిచలమున నీదిక్కు చూచెను

వురమె క్కెలమేల్మంగ వొాగి చన్నులు నాఁటితే
వొరటుజక్కవలపై నొాలవేసెను
మొరసి శ్రీవేంకటేశ ముక్కల[2]న వెంటించితే

విన్నవించరే యీమాట విభునికిని
తన్నుఁ దానె యెఱుఁగును తలఁచుకొమ్మనవే ॥ పల్లవి ॥

మనసు లేకములైతే మాటలు సమ్మతులౌను
ననుపు గలిగితేను నవ్వు గలుగు
తనువులు సోఁకితేనే తమకములు రేఁగును
చనవు సతమైతేనే సరసము చెల్లును ॥ విన్న ॥

పొడితో నడచితేనే పంతము లీడేరును
జోడుగూడి వుండితేనే సొంపైవుండును
వేడుక లౌనగూడితే పీడుదోడు లితవౌను
వాడికలు దొరకితే వలపు లమరును ॥ విన్న ॥

యేకతములైతేనే ఇక్కువలు గరఁగును
కైకొని కాఁగిలించితే కళ లుబ్బును
యీకడ నలమేల్మంగ నేలె శ్రీవేంకటేశుఁడు
చేకొని నన్నుఁ గూడెను చిత్తగించుమనవే ॥ విన్న ॥ 278

భైరవి

కానీవయ్యా అందరికీఁ గలిగిన సంసారమే
వీనులార నన్నియును వినేము నే మిఁకను ॥ పల్లవి

చెప్పుదురు పతులతో చెలులు తమనేర్పులు
వొప్పు యెంతవడియైనా నూఁకొంటేను

ఆపనులకు నాయకుఁ డాసపడితే
పైపయి నాపెకు నీవు భ్రమసి వున్నాఁడవు
కోపగించ మాకేల కూడి సంతసించేము ॥ కానీ

నవ్వుదు రెంతవడైనా సనుపుతో వనితలు
రవ్వగా వలచినట్టిరమణునితో
యివ్వల శ్రీవేంకటేశ యేనలమేలుమంగను
చివ్వన మమ్మేలితివి చేరె మాకు రతులు ॥ కానీ ॥ 2

పాడి

మచ్చికతో నేలవయ్య మదనసామ్రాజ్యలక్ష్మి
పచ్చిసింగారాలచేత బండారాలు నిండెను ॥ పల్లవి

కొమరెతురుమునను గొప్పమేఘ ముదయించి
చెమటవాన గురిసెఁ జెక్కులపెంట
అమరఁ బులకలపైరు లంతటానుఁ జెలువొంది
ప్రమదాలవలపులపంట లివె పండెను ॥ మచ్చి

మించులచూపుల తీగెమెఱుఁగు లిట్టె[1] మెరిచి
అంచెఁ గోరికలజళ్ళవె పట్టెను
సంచితపుకుచముల జవ్వనరాసులు మించె
పొంచి నవ్వుల యామని పోదిగానె నిదిగో ॥ మచ్చి

అలమేలుమంగమోవియమృతము కారుకమ్మి
నలుగడ మోహపుసోనలు ముంచెను
యెలమి శ్రీవేంకటేశ ఇంతి నిట్టె కూడితివి

నేనే బుద్ధిచెప్పుకొనే నేరుపునఁ బతికిని
దానికేమి యింతలోనె తానే నన్ను నేలెను ॥పల్లవి॥

మగవాఁడు మేరమీరి మగువలఁ జెనకితే
తగవులఁ బెట్టనేల తడవకువే
మొగమోటయినచోట మోనాన నుండుట మేలు
పగటున మిగులాను బలిమిసేయకువే ॥నేనే॥

పాయపువాఁడు మిక్కిలి పరచై తిరిగితేను
బాయిట వేయఁగనేల పదరకువే
తోయరానిచుట్టముతో చాయసేసుకొంటే మేలు
రాయడించి సారెసారె రచ్చలఁబెట్టకువే ॥నేనే॥

శ్రీవేంకటేశ్వరుఁడు సిగ్గులు విడిచితేను
కావరించి నవ్వనేల కదుమకువే
వావులెనసినచోట వదలకుండుట మేలు
నీవలమేల్మంగ కూడి నెలవై పాయకువే ॥నేనే॥ 28

950 లలిత

అందులోనె కానరాదా అతివ యీతనిసుద్ది
కందువ లన్నియు నీవె కనుఁగొనఁగదవె ॥పల్లవి॥

నెలవినేల నవ్వినే చేరి నే మోము చూచితే
లలిఁ దనవంకను కలలేనివాఁడు

యెగ్గులుఁదప్పులులేక యేచినవాఁడు
దిగ్గనఁ గాఁగిలించితే దిక్కులేల చూచీనే
బగ్గన నెవ్వతెకైనా బాసియ్యనివాఁడు ॥

శిరసేల వంచీనే చెంత మోవి నే నంటితే
విరసమెరఁగని శ్రీవేంకటేశుఁడు
అరిది నలమేల్మంగనై కూడితే మెచ్చనేలే
గొరబై యెవ్వరికిని గుట్టియ్యనివాఁడు ॥ అం

మంగళకౌశిక

చూడఁ బిన్నవు నేఁతలు చూపి చెప్పఁగఁ గొత్తలు
జాదల నిన్నిటా నేఁడు జాణవైతివే

ఆయములుసోఁక మాటలాడ నేర్చుకొంటివే
కాయజుదీమవై నీవు గలగితివే
చాయలాను సన్నలాను సాదించ దొరకొంటివే
పాయపువిభుని నింత భ్రమలఁ బెట్టితివే ॥

నీటునెలవినవ్వులు నీవలనఁ గంటిమే
పాటలఁ జొక్కించ నీపాలాయనే
జూటుఁదనాలకు నీవే సూటియై నిలిచితివే
తాటించి ఆతని నిట్టె దక్కఁగొంటివే ।

అలమేలుమంగవు నీ వట భూకాంతను నేను
యెలమి శ్రీవేంకటేశు నెనసితివే

రామక్రియ

ఊరకేల దాఁచేవు వుదుటునీచేఁతలు
యేరీతి నీవుండినాను యెవ్వరేమనేరు

వింతచెలు లుండఁగాను వెలఁదితోఁ జెవిలోన
మంతనాన నీవప్పుడు మాటలాడవా
ఇంతలో నేఁటికి బొంకనేమాయ నేమినేసినా
చెంతలమగవాఁడవు చెల్లదా నీకిపుడు

కాకునేసిరంటాను కడవా రెఱఁగకుండా
ఆకెయిచ్చినవుంగర మందుకొనవా
నీకేల సిగ్గువడ నేఁడు గొత్తలా యివి
యీకడ నీయిచ్చరాజ వేల లోఁగే విపుడు

వలచి శ్రీవేంకటేశ వనితల మందలించి
అలమేలుమంగ నురమందు నుంచవా
కలసితి విటు నన్నుఁ గపటము లిఁకనేల
బలిమికాఁడ వౌదువు పదరకు మిపుడు ॥

రామక్రియ

మంచివాఁడవువలెనే మతకములు నేసేవు
అంచెలనే పైకొనే వవునయ్యా నీవు

చీర లెస్సాయనంటాను చెరఁగువట్టి తీసేవు

సింగారమాయఁ గొప్పంటా జేయిచాఁచేవు
సంగతాయఁ [1]గుచ్చలంటా సరుగ నొడివట్టేవు
చెంగటఁ గాకుసేతురా చెలువలను ॥ మంచి

మోవిపండు తీపులంటా ముంచి చవులు రేఁచేవు
శ్రీవేంకటేశుఁడ నన్నుఁ జేరి కూడేవు
ఆవల నలమేల్మంగనని నన్నుఁ బొగడేవు
భావించి సచ్చిసేతురా పడఁతులను ॥ మంచి ॥

## పాడి

వలచినదానికేలే వాసులెంచను
నెలవుల నవ్వుతాను చేకొనఁగవలదా ॥ పల్ల

పిలువఁగా నీవేల బిగిసేవే పతితోను
చలము లెందాఁకాను సాదించేవే
బలిమి నాతఁడు నిన్ను పైకొని పెనకఁగాను
కలువకన్నులఁ జూచి కాఁగిలించవలదా ॥ వ

వొడివట్టి తియ్యఁగాను వొరటు లింకానేలే
బడివాయకుండఁగాను పంతమేఁటికే
అడియాలముగ మోవి యాతఁడు నీకియ్యఁగాను
తడవి మోవి యొసఁగి దప్పిదేర్చవలదా ॥ వ

ముందుముందె మాటాడఁగా మోనము నీకిపుడేలే
కందువ నిన్నుఁ గూడఁగ కాఁతాళమేలే
చెంది యలమేల్మంగవు శ్రీవేంకటేశుఁ డతఁడు

నాట

నీచేతనౌనె నేర్పులివి యెల్లాను
కాచుకుండి మనసెల్లఁ గరఁగించఁగలవె ॥ పల్లవి ॥

కడువలచితినంటా కాంతుని కిచ్చకమాడి
తొడిఁబడఁ గాఁగిలించి దొమ్మిసేసేవు
అదరి చొక్కులఁబెట్టి అంత సేసినదానవు
బడిఁ దిప్పి యాతని భ్రమయించఁగలవే ॥ నీచే ॥

పాసియుండ నోపనంటా పక్కననుబ్బించి పతి-
కాసచూపి ఇంటఁబెట్టు కలయించేవు
బేసబెల్లివై ఇట్లాఁ బెదరేఁచినదానవు
బాససేయించు కేపొద్దూఁ బనిగొనఁగలవే ॥ నీచే ॥

పట్టపుదేవులనంటా పైకొని శ్రీవేంకటేశు-
నట్టు నిట్టుఁ గూడితివి అలమేల్మంగా
గుట్టున నన్నితఁ దేలెఁ గుచ్చితపుదానవు
వొట్టుక వురముమీఁద నుండఁగఁగలవే ॥ నీచే ॥ 28

951 పరాళి

ఇప్పుడే విన్నవించితి మెగ్గులువట్టేవుగన
వుప్పతించి మామీఁద నొలవేసేవుసుమ్మీ ॥ పల్లవి ॥

కొప్పేల దువ్వేవు నీవు కొంగేల పట్టేవు నన్ను

గుక్కక సవతులెల్లా గొణఁగఁగాను
చిక్కనినాగుబ్బలపై చెమట [1]నా మేననంటే
చొక్కుచు మామీఁద నీవు సొలసేవుసుమ్మీ ॥ ఇప్ప

కాయమేల నిమిరేవు కాఁగిటనేల నించేవు
పాయపుపెండ్లికూఁతులు పంగించఁగా
యీయెడ శ్రీవేంకటేశ యేనలమేలుమంగను
చాయలకే కూడితివి జంకించేవుసుమ్మీ ॥ ఇప్ప ॥ 2

## తోండి

కంటిమే నీవల్ల నిట్టికతలెల్లాను
వెంటవెంట వచ్చి కడు వేసాలు చూపేవు ॥ పల్లవి

కాటుకకన్నులతోడ కసరుచు రమణుని
సూటిదప్పకుండా నేమిచూచేవే నీవు
నే(నేఁ?)టనే కడమాయనా నీయాసోద మెంతలేదు
మేటివై యిందరిలోనా మేకులు నేసేవు ॥ కంటి

కానుకగా మోవిమీఁద కప్పుచుఁ దమ్ములమ్మున
నానఁబెట్టి యిప్పుడేమి నవ్వునవ్వేవే
కానరాదా నీవలపు కలయవేసేవు పొందు
పూని నీపెద్దరిక మిప్పుడే నెరపేవు ॥ కంటి

కంకణాలచేతులను కాఁగిటను బిగియించి
మంకవై యీవేళనేల మాటలాడేవే
కొంకక యలమేల్మంగ కూడె శ్రీవేంకటేశుఁడు

ఏమే యింతటిదాన వెఱుఁగవటే
నామాట సరివచ్చెనా నేఁడు నీకు ॥ పల్లవి

యెగసక్కెపుమాటలు యెన్నైనా నాడఁగవచ్చు
అగపడి ప్రియమాడే దరుదుగాని
మగవానితోడనేల మారుకొనఁగఁ జెలికి
మొగమోట ప్రియముతో మొక్కవలెఁగాక ॥ ఏమే

బచ్చెనపంతములను బయలీఁదించఁగవచ్చు
నిచ్చఁ బొందు సేరపేది నేరుపుగాని
యిచ్చకపుఁ బతితోడ నెమ్మెలేల మగువకు
మెచ్చుఁగుందులేక కాఁగి లియ్యవలెఁగాక ॥ ఏమే

నలిరేఁగి కేరడపునవ్వులు నవ్వఁగవచ్చు
యెలమి సరసమాడే దెక్కుడుగాని
అలమేలుమంగవు నిన్నతఁడు శ్రీవేంకటేశుఁ-
డలమె నిట్టె ముదమందవలెఁగాక ॥ ఏమే ॥ 29

దేవగాంధారి

జోడుగూడితి రిద్దరు సొంపగుజాణలె మీరు
తోడ నీళ్లాడరయ్య దొరకె మీకిపుడు ॥ పల్లవి

చెలియగుబ్బలమీఁదిచెమట పన్నీరుకాపు

పొంతఁ గడకుంటే చూపు పునుగుకాపు
సంతసపుసరసాలు జరపేటివూడిగాలు
యింతటా మజ్జనవేళ యితవాయ మీకు

ఇయ్యలమేల్మంగ కాంతులెత్తేతిరుపందికాపు
గయ్యాళిమదరాగము కస్తూరికాపు
ఇయ్యెడ శ్రీవేంకటేశ యెనసితి రిద్దరును
వొయ్యనే మజ్జనవేళ వొరపాయ మీకు ॥ జ

బౌళి

ఏల యెడతాఁకించే పీడకాదకు నింతుల
మేలములాడుచునే నమ్మించవలెఁగాక

చాయపాటుమాటలకు సమ్మతించీనా చెలి
ఆయెడకు నీవుంగర మంపినఁగాక
చేయరానిచేఁతలెల్లాఁ జేసితివి తొలుతనె
చేయిపట్టి ప్రియమెల్లాఁ జెప్పవలెఁగాక

అడియాస కానికల కాపె యీడకు వచ్చీనా
యెడయక నీవు వచ్చి యేలినఁగాక
తొడిఁబడ నీపై మోచె తోడనే ఆపెవలపు
గొడవదీరఁగ వేఁడుకొనవలెఁ గాక

చుట్టి రాయబారాలకు చొక్కీనా అలమేల్మంగ
గుట్టున శ్రీవేంకటేశ కూడినఁగాక

వను౯ జూచి యిప్పు డెంతనవ్వు నవ్వేవు నీ—
వనితనై వున్నదాన వలదనేనా ॥ పల్లవి ॥

చెలిమికాఁడ నీవేల సిగ్గువడేవు యేమో
వెలఁది విన్నవించీని వినరాదా
యెలమి నామోము చూచి యేల లోఁగేవు మీకుఁ—
గలసాజమే యిది కాదనేనా ॥ నను౯ ॥

తోడెకాఁడ నీవేల గుట్టునేసేవు ఆపె
తోడనే కానుకిచ్చి నందుకొనరాదా
వేడుక నేఁ జూచేఁగాక వెఱవనేలా మీ—
వాడికమోహము లివి వారించేనా ॥ నను౯ ॥

శ్రీవేంకటేశుఁడ యెంతచెలరేఁగేవు నీ—
దేవులు సన్నలుసేసీఁ దెలియరాదా
గోవిందరాజవు నీవే గుఱుతుగంటి యిదే
యీవల నన్నేలితివి యీకె [1]యేలనేనా ॥ నను౯ ॥ 294

952 సోమరాగం

ఎల తమకమునేసే వింతలోను
లాలించినానుఁ జెప్పవు లాఁతిదానివలెను ॥ పల్లవి ॥

ఎక్కి చూచినదానవు నీవో మరొకతో
యిక్కువతోఁ జెప్పరాదా యెరిఁగేఁగాని
వుక్కున నీవప్పుడెతే వూఁకొంటివి నేఁ జెప్పితే

మేరతోడఁ దెలుపరాదా మెచ్చేఁగాని
చేరి నేఁ బొగడితేను చెలరేఁగితి వప్పుడు
బీరాన గుట్టుసేసేవు పెరదానివలెను

చెంది కాఁగిలించేవి నీచేతులో చెల్లెలివో
మందలించరాదా సమ్మతించేఁగాని
అంది శ్రీవేంకటేశుఁడ నని కూడితి విప్పుడు
యెందుకైనా నొనగూడే వింటిదానివలెను ॥ ప

దేశి

నాకుఁ దెలుసు నితనినాటకములు
కైకొనీనా ఇంతలోనే కతకారిగాక

యెఱఁగక చేఁత చేసి యెదిటికి రాఁడనేవు
వెఱపు వాని కేడదే వేసాలుగాక
వొఱపు నీమాటలకే వొడఁబడి తనమతి
కఱకరిఁ గరఁగీనా గామిడిగాక

అగడుగాఁ దిరిగాడి యందుకు లోఁగీ ననేవు
తగ వాతఁ డెఱుఁగునా తక్కులుగాక
తగిలి తనబాసలు తలఁపించితే నేఁడు
మొగమోడీనా కడుమొక్కలీఁడుగాక

వలపు లంతటాఁ జూపి వచ్చి నన్నేలీ ననేవు
సులభుఁడా ఇవిగొన్ని సుద్దులుగాక.

చెప్పఁడుమాటలు గావు చెలువుఁడ నీచేఁతలు
  చొప్పుదప్పకుండా నేనే చూచితినయ్యా ॥ పల్లవి ॥

మెలమి నాకెయు నీవు నెదురుబడి నుండి
  సెలవుల నవ్వితివి సిగ్గులతోను
  తలుపుమాటున నుండి తారుకాణగా నేఁడు
  సొలవక నేనే ఇట్టె చూచితినయ్యా ॥ చెప్ప ॥

వోడక మీరిద్దరును వొక్కమంచముపైనుండి
  వీడేలు నేసుకొంటిరి వేడుకతోను
  నీడలోనే పొంచివుండి నెట్టన మీసరితలు
  జోడనగా నేనే చక్కఁ జూచితినయ్యా ॥ చెప్ప ॥

శ్రీవేంకటేశ కాఁగిటఁ జెంది నీవాకెయు నిట్టె
  మోవితేనె లానితిరి ముచ్చటతోను
  యీవలికిఁ దీసి నిన్ను నిదే నేనూఁ గూడితి
  సోవలుగా నేనే మిమ్ముఁ జూచితినయ్యా ॥ చెప్ప ॥ 297

దేశాక్షి

అడుగరే చెలులాల అతనినే యీమాట
  వుడివోనితమకాన నుండఁబోలు తాను ॥ పల్లవి ॥

వేడుకగలప్పుడే వెస నవ్వు వచ్చుఁగాక
  వాడి వున్నప్పుడు తలవంపులే కావా

[illegible]

పాసివున్నప్పుడు తడఁబాటులేకావా
బేసబెల్లివలపుల పిరిపీకై రాఁబోలు
నేస నేఁ బెట్టఁగాను సిగ్గువడి వుండునా ॥ అడు ॥

సరసమాడినప్పుడే చవులెల్లాఁ బుట్టఁగాక
గొరబైనయప్పుడు కొఱతలేకావా
యిరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
వరుస నిందాఁకా నిటువలెఁ జొక్కకుండునా ॥ అడు ॥ 298

పాడి

కంటిమయ్యా నీసుద్దులు కతలుగాను
ఇంటిపొరుగువారిపై నింపులు చల్లేవు ॥ పల్లవి ॥

మలసి కొంగువట్టేవు మగువ దండ నుండఁగా
మొలకచన్నులు నిన్ను మోచెనంటాను
యెలమిఁ బెండ్లాడినాపె నేమిసేతువో యిఁక
చెలిమికత్తెలమీఁద చేతులు చాఁచేవు ॥ కంటి ॥

బడినే కానుకిచ్చితే పచ్చడము గప్పేవు
పడఁతికొనగోరు నీపై నాఁటెనంటా
అడరి వుంకువవెట్టినాపె నెంత చిక్కింతువో
నడుమచుట్టాలమీఁద ననుపు చూపేవు ॥ కంటి ॥

కలసితివి సతిని గక్కన శ్రీవేంకటేశ
అలివేణిచూపులు నిన్నంటెనంటాను

కందము నీసంతలు గట్టిగా నీఁక
సందడిఁ బెండ్లాడేవేళ బాయ కెట్టు వచ్చేవో ॥ పల్ల

కుంచెవేసేయట్టియాపె కొప్పు దాఁకించెనంటాను
అంచలఁ బంతములెల్లా నాడుకొ నేవు
మించినరతివేళను మేనెల్లాఁ దాఁకేయపుడు
వంచనలేక యెటువలె నోర్చేవో ॥ కంద

జూదమాడి వోడినాపె సొలసి తిట్టెనంటాను
తీదీపుల చలము సాదించఁ జూచేవు
పాదుకొని యేకతానఁ బచ్చిమాట లాడేవేళ
సాదవై నీవెట్లాను సమ్మతించేవో ॥ కంద

నేసలు వెట్టినయాపె సిగ్గులువడె నంటాను
వాసితోఁ జన్నులమీఁద వాఁ(వ్రాఁ?)త వా(వ్రా?) నేవు
యీసరినే శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
తాసువలె నిద్దరిని దయతో మన్నించేవో ॥ కంద ॥

కు 953 మేఘరంజి

ఇదివో నీతోడిపొందు [1] ఇంతేశేయా
యెదుట నున్నది చెలి యెఱఁగుకోవయ్యా ॥ పల్ల

కొమ్మచిత్తములోనిచింత కొప్పునెరులై నిండె
ముమ్మడితరితీపల్లా మోవిపండాయ
నెమ్మది వడియాపలు నివ్వెరగుచూపులాయ

వలపులు రోమరాజివరుసలాయ
వెలఁదినితమకము వేఁకమై పిఱుఁదాయ
తలపోఁత లీడేర్చి దయసేయవయ్యా

కోమలిరతిభావాలు కొనగోరివాండ్లాయ
భూమిఁగల ఇంపులెల్లాఁ బులకలాయ
యీమేర శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
దోమటిసంతోసాలు తుదిపదములయ్యా ॥ ఇ

కురంజి

ఇటువంటిపనులైతే నిందరు నిన్నేమందురు
కటకటా ఇఁకనైనాఁ గరుణించు మిపుడు :

మొల్లమిగా నాకె నీకు మోహించు టెఱఁగవా
చెల్లఁబో నీవేల జోలిసేసేవో కాక
తొల్లె నీరాకకు నెదురుచూచే దెఱఁగవా
వొల్లనే నవ్వుకొంటా నున్నాఁడవు గాక

వద్దనుండి నీకాపె సేవసేసే దెఱఁగవా
అద్దిరా నీవేల పరాకైతివో కాక
ముద్దు ముద్దువలె నీకు మొక్కే దెఱఁగవా
సుద్దుల నీగుణా లేమి చూపేవో కాక

తాలిమితో నిన్నునాపె దక్కఁగొన్న దెఱఁగవా
మేలుమేలు ఇంతయేల మీరేవో కాక

ఏమిసేసినాఁ జెల్లును యిదివేళ
    చేముట్టి యాతనికే సేవలెల్లాఁ జేయవే

నాటుకొనె చూపులు నడుమఁ గొలువులోన
    గాఁటపురమణునికి కానికియ్యవే
వాఁటమాయ చెమటలు వలపు లినుమడాయ
    మాటలాడి యీతని మర్మము లంటించవే

తలకొనె నగవులు దండనుండి చెవిలోన
    వెలయ రమణునికే విన్నవించవే
చలివానె మనసుకు చనవులు తుదముట్టె
    తెలిపి యీతనికి నీ తేనెమో వానగవే

నెట్టుకొనె వేడుకలు నేఁడు శ్రీవేంకటేశుకు
    గట్టిగాఁ బెండ్లాడితివి కాఁగిలియ్యవే
దట్టమాయ తమతము తగులాయ నిద్దరికి
    చుట్టమవై యీతనికి సొమ్ములెల్లా నించవే ॥

రీతిగౌళ

చెప్పుమనేవు తగవు చెప్పకుండరాదు నాకు
    వొప్పుగ వినవలెఁ గాదా వువిద లిద్దరును

పాయపుదానవు గాన పతిని సొలసి నీవు
    ఆయములు సోఁక మాటలాడఁజెల్లునే

ఆసపడి బలిమివేయఁగఁ దగునే
వాసితోడ నీతోడివనితలమీఁదట
రాసికెక్క చేయిచాఁచరాదు గాని నేఁడు ॥ చెప్పు

చెలిమిగలఁడు నీకు శ్రీవేంకటేశ్వరు
కలయుట సహజమే కాఁగిట నీకు
పలుమారు నీతోడిభామినులముంగిటను
చలపట్టి మురియుచు సందడించ నేఁటికే ॥ చెప్పు ॥ 30

## రామక్రియ

నవ్వేవారి నెఱఁగదు నడుమఁ దాను
నివ్వటిల నీ వెన్నినేర్పితివో చేఁతలు ॥ పల్లవి

చెలరేఁగి చెలరేఁగి చేసీ నీకు విన్నపాలు
నలనాక్షి నీకెంతచనవోకాని
చలివాసి నీయెదుట సన్నలెల్లాఁ జేసీని
యెలమి నీవెంతసలిగిచ్చితివో యిపుడు ॥ నవ్వే

కొసరి కొసరి నీకుఁ గొలువులు సేసీని
సుసరాన నీకె యెంత చుట్టమోకాని
యెసగి నీకప్పటిని యిచ్చకములే సేసీని
వసమై యెంతవలచి వచ్చితివో యిపుడు ॥ నవ్వే

చిమ్మరేఁగి చిమ్మిరేఁగి సేసవెట్టీ నిన్నుఁ గూడి
యెమ్మెలఁ దానెంత నీకు నింపుదోకాని

కానీలే అందుకేమాయ ఘనుఁడవు నీవిన్నిటా
దానికేమి యిది నీపెద్దఱికమే కాదా

పంతమాడరాదుగాక పలుమారు నీచేఁతలు
కొంతగొంతైనా నీతోడఁ గొనాడరాదా
అంతటివాఁడవుగావా అడఁతురా నీగుణాలు
చెంతల నామోము చూచి సిగ్గులువడుదురా

జంకించఁగరాదు గాక చక్కనినీమోము చూచి
కంకణాలచేయెత్తి మొక్కఁగరాదా
అంకె లింతనేరవా సేయఁగవద్దా వినయాలు
కొంకుదేరి నాయెదుట కొల్లున నవ్వుదురా

అలుగఁగరాదుగాక అట్టె నీకాఁగిటను
సొలవక మోవి యాని చొక్కించరాదా
యెలమి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నెలకొనె నీపొందులు నివ్వెర గందుదురా ॥ కా

రేకు 954 అరిబి

తెలిపి చెప్పఁగవలె తెల్లమిగా ముందుముందే
వలపించి నన్ను నింత వలలఁబెట్టేవు

మొలకలచన్నులమొనలు దాఁకీఁజుమ్మీ
చెలరేఁగి పయ్యెదపైఁ జేయివేసేవు

మంచిగాలవుమాటలు మతిఁ దగిలించీఁజుమ్మీ
అంచెలనే నన్ను సుద్దు లడిగేవు
కొంచక నాకొనవేలిగోరు జీరవారీఁజుమ్మీ
ముంచి నీపాదాలకు మొక్కించుకొనేవు

చీఁకటికొప్పునెరులు చేరి నిన్నుఁ గప్పీఁజుమ్మీ
తాఁకించినచేతుల ముందలవట్టేవు
యేఁకటతో శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
తూఁకువసుమ్మీ పిఱుఁదు తొడ లెక్కమనేవు ॥ తె

పూరిబి

కానీవయ్య ఇఁకనేల కడు నిన్ను సొలయఁగ
మోనముతో నుండఁగాను మొక్కఁజెల్లునా ॥

తలఁపు నిలుపలేక తమితో మాటాడేఁగాక
పిలిచితే రానప్పుడే ప్రియమున్నదా
కొలమునాలఁగనక కోరి సేవ సేసేఁగాక
అలపు చూపితినప్పుడే ఆయా లంటఁదగవా

చుట్టపువరుస లెంచి చూచి నీతో నవ్వేఁగాక
అట్టు నిట్టు జునిగేవు ఆసగలదా
పట్టినవ్రతముతోడ పైకొని చెనకేఁగాక
నట్టుకొట్టినపుడే విన్నపములు గలవా

ఇదె నన్నుఁ గూడఁగాను ఇచ్చకము సేసేఁగాక

ఇంకానేల దాఁచేవు ఇంతకువచ్చెఁ బనులు
సంకలే కానతీరాదా సమ్మతించేఁగాని

చక్కెరవంటిమాటలు సతి నీతో నాడికాదా
చొక్కించెను నిన్ను నిట్టె సులభానను
చక్కనిమొగము చూచి సన్నలుసేసే కాదా
నెక్కొనుతమకమెల్లా నీకు రేఁగెను

గాలాలవంటిచూపు లొక్కటఁ దగిలించికాదా
తాలిమి నీమనసెల్లాఁ దక్కఁగొనెను
మేలిమిచన్నులు నీమే నిట్టె తాఁకించికాదా
కీలుకొన్నవలపులు కెరలించెను

లతలవంటిచేతుల లలి గాఁగిలించికాదా
రతిరహస్యములఁ గరఁగఁజేసెను
యితవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
కతకారియాపెకాదా కళ లెసఁగించెను ॥ ఇం॥

మాళవిగౌళ

ఏమని విన్నవించేము యెందాఁకాను
నీమనసే యెఱుఁగును నేఁడెంతసేసేవు

వలపెల్లా నొక్కటే వారివారిలోపల

ననుపులసరసాలే నానాగతులు
తనువు లొద్దికైనవేళ తరితీపు లెంచితేను
చెనకులో సన్నలే చిత్రములుగాని

పొందులు నెప్పటివే భోగించేయప్పుడు
మందలించి కరఁగించేమర్మాలు వింత
చెందితివి నన్ను నిట్టె శ్రీవేంకటేశ్వర
విందులమోవియీవులే వేడుకలు గాని ॥ ఏ

నాదరామక్రియ

ఇంత [1]వని కోపుదుమా యిదివో నేము
మంతనానకు వచ్చితే మరిగించుకొంటివి

పొద్దువోనివాఁడవు పొలఁతులఁ గంటేను
చద్దికి వేఁడి కాదేవు జాణతనాలు
వుద్దండీఁడవట మీఁద నొడఁబరచవచ్చితే
కొద్దిమీరి చెలిమేన గోరు దాఁకించితివి

జూటరివాఁడవు నీవు సుదతు లిచ్చితేఁజాలు
చీటికిమాటి కంటేవు చేకానికలు
నీటుదొరవు గనక నీకు విందుచెప్ప వచ్చి-
నాఁటదానికొంగువట్టి యాఁడిఁబెట్టేవు

నిరతి శ్రీవేంకటేశ నెలఁత ఎదుట నుంటే
సరికి బేసి కంటేవు చనుమొనలు
సరసుఁడవని నిన్ను సంగడి నే మెచ్చితేను

కోరిక లీడేరె నికఁ గూచుండవయ్యా
సారె సారె నందుకుఁగా జలపట్టనేఁటికి

యింతలోనే విభుఁడ నీవింటికి విచ్చేసితివి
పంతపుమాఁటల కిఁకఁ బనిలేదు
వంతుకు వచ్చినయాపె వద్దనే నిలుచున్నది
సంతోసించవలెఁగాని సాదించనేఁటికి

దప్పిదేర చెక్కునొక్కి తమ్ముల మిడితివి
తప్పులు నీపయి నెంచఁదగవుగాదు
చెప్పరానిగుట్టుతోడ చేసన్నచేసీ నాపె
వొప్పనాయ నీవలపు వుప్పతించనేఁటికి

కన్నులనే నవ్వి నన్నుఁ గాఁగిట నించితివి
విన్నపాలు సేయ నిది వేళ గాదు
వున్నతి శ్రీవేంకటేశ వూరకే మొక్కీ నాకె
మన్ననలు దయివారె మతకములేఁటికి

రేకు 955. శంకరాభరణం

నా మొగము చూచి నగరాదా
దోమటి గలనే నిందుకు నగరాదా

చెనకు లాకెచేఁ జేయించకుండితే
నను నీ వప్పుడు నగరాదా

నలువంకల మరి నగరాదా
చెలరేఁగి ప్రియము చెప్పించకుండితే
కొలఁదిమీరి గక్కన నగరాదా

వొట్టి పంతానఁ జెయ్యొగ్గించకుండితే
నట్టనడుమనే నగరాదా
యిట్టె శ్రీవేంకటేశ కూడితివి
చుట్టమవై మెచ్చుగ నగరాదా ॥నా

కన్నడగౌళ

ఏల తలవంచీనే యెగ్గులేల పెంచీనే
తాలిమి నెంచి చూచితే తానే నేననవే

వొడివట్టి పెనఁగవే వొట్టువెట్టుకున్నవాఁడు
నుడిగి దోసము లేదనుచుఁ బల్కవే
అడియాలమైనట్టియాన నా పైఁ బెట్టవే
వొదయఁడు తాను నాకు వోరుచుకొమ్మనవే

పలుమారు మొక్కవే పంతముతో నున్నవాఁడు
వెలయ సిగ్గు లొల్లనే విడిపించమనవే
నెలవుల నవ్వింపించి చేరి యాసపుట్టించవే
అలుగరానిచుట్టరిక మన్నిటాఁ దెలుపవే

గక్కనఁ దెరవేయవే కరుణతో నున్నవాఁడు
అక్కడిక్కడివా రేమీ ననకనవే

తమ్ముఁదామే యెఱిఁగేరు తగవులెల్లా
రమ్మంటె వత్తముగానీ రావే వాకిటికి ॥ పల్లవి

సతికినిఁ బతికిని సాకిరి చెప్పుదుర్గా
తతిగొని పెనఁగఁగా దండనుండురా
యితవరి చెలులము యెవ్వరి నేమనవచ్చు
రతికెక్కెఁ బనులెల్లా రావే వాకిటికి ॥ తమ్ముఁ

పవ్వళించి వుండఁగాను పాదము లొత్తుదురా
పువ్వులవేట్లాడఁగాఁ బొదుగుదురా
నవ్వించేవారము నాలి యెట్టు సేయవచ్చు
రవ్వలాయఁ జేతలెల్లా రావే వాకిటికి ॥ తమ్ముఁ

బాసలు చేసుకోఁగా పైపై గురియవుదురా
ఆసల మోవులానఁగా నట్టె చూతురా
సేసవెట్టి యేలినాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
రాసులాయ వేడుకలు రావే వాకిటికి ॥ తమ్ముఁ ॥ 31

సాళంగం

ఆనతియ్యవయ్యా నీవాతరవాతిమాట
కానుకలు వట్టుకొని కాచుకున్నారింతులు ॥ పల్లవి

చట్టువంటినీమనసు సాదించరా దెవ్వరికి

కోటిచీఁకట్లగుంపు కొమ్మతురుము
సీటుతో మీరుండఁగా మీనెపము లెరుఁగరాక
తేటపడ లోలోఁ జింతించుకొనే రింతులు

కొత్తచిగురువంటిది కోరినట్టినీవలపు
చిత్తరుఁబ్రాఁతవంటివి చెలిరతులు
ఇత్తల శ్రీవేంకటేశ ఇద్దరుఁ గూడితిరి
పొత్తులసంతోసాలఁ బొదలేరు ఇంతులు ॥

నాట

ఈకెకు నప్పుడుగాని యేకచిత్తము గాదు
చేకొని మచ్చిక చూపి చెప్పవయ్య ప్రియము

కళలు దొలఁకఁగాను గక్కన నీమోము చూచి
మలసి యెందో కొడిమలుగట్టీని
తలకొని నీ వెంత తారుకాణించవచ్చినా
చెలియ నమ్మదు ఇఁకఁ జేయవయ్య బాస

పంకంపుఁజెమట మేనిపై నీకు నుండఁగాను
తెంకి నేడదోయని సందేహించీని
అంకెల నొడఁబరచి అతిప కెంతచెప్పినా
కొంకక మానదు పెట్టుకొనవయ్య ఆనలు

సతమై నిట్టూర్పులు సారె నీకు రేఁగితేను
సతులఁ బొందితివని జరసీ నిన్ను

ఇంతదొడ్డవాఁడవౌత ఇంతులెల్లా నెరఁగరా
పంతము లిప్పుడే నీవు పచారించవలెనా

తరుణి నీవూడిగాలు తఱచుగఁ జేయఁగాను
సిరులఁజెమట మేనఁ జిప్పిలీని
సురటి విసరరాదా సుద్దులేమి చెప్పేవు
యిరవైనదొరతన మిప్పుడే చూపేవా

కొమ్మ నిలుచుండి నీకుఁ గొలువులు సేయఁగాను
చిమ్ములయలపుతోడ సిగ్గువడీని
పమ్మి కూచుండఁబెట్టుక పన్నీరు చల్లఁగరాదా
యెమ్మెలునేతలు నీవు యిప్పుడే చూపేవా

పడఁతి వేగినంతాను పాదాలు నీ కొత్తఁగాను
కడఁగి కళలురేఁగి కాఁతాళించీని
అడరి శ్రీవేంకటేశ అంతలోనే కూడితివి
యెడయనినీనేరుపు లిప్పుడే చూపేవా ॥ ఇం

రేకు 956 శ్రీరాగం

కానవచ్చె నాపెమీఁది కందువైనవలపులు
నానఁబెట్టి యివి యేమి నాకుఁ జూపేవయ్యా

నీమనసు వచ్చితేను నేరములు నేరుపులే

జూటరిగుంపెనలైనా చుట్టరికమే
సీటుతోడిజంకెనలు నిండినసంతోసాలే
చాటున గర్వములైనా సమ్మతింపులే ॥ కాన ॥

కైవసములై తేను కాఁగిలే నిధానము
వేవేలుపంతములు వినయములే
శ్రీవేంకటేశ నన్నుఁ జిత్తగించి యేలితివి
చేవదేరేచెనకులు సింగారాలే ॥ కాన ॥ 319

## పాడి

చెప్పరయ్య మీరిద్దరు చేకొని బుద్దులు మాకు
యిప్పుడే చెలులమెల్లా నీఁక మెచ్చవచ్చునా ॥ పల్లవి ॥

మంతనాన మీరిద్దరు మాటలాడుకొంటిరట
చెంతల మా కవేమైనాఁ జెప్పవచ్చునా
కాంతులతో మీమొగాలు కళలురేఁగి వున్నవి
అంతరంగ మదేమైనా నడుగఁగవచ్చునా ॥ చెప్ప ॥

చిమ్మిరేఁగి మీరుమీరే సింగారించుకొంటిరట
సొమ్ములు మా కవేమైనాఁ జూడఁగవచ్చునా
చిమ్ముఁజెమటలు మీకుఁ జెక్కులు నిండుకున్నవి
సమ్మతించి మా కిఁక సంతోసించవచ్చునా ॥ చెప్ప ॥

వావులు చెప్పక మీరు వరుసఁ గూడితిరట
కావించి మీగుణాలు పొగడవచ్చునా

ఆహిరి

సంతోసించుకొనుటే చాలదా సారెసారెకు
చింతించి తలఁచుకొనేసిగ్గరికానికి ॥ పల్లవి

చూపునఁ దప్పక నీవు చూచినదే చాలదా
పూఁపుదెలిసినయట్టిపురుషునికి
కాఁపురాలు నీవు తారుకాణించవలెనా
యేపున నీగుణమెల్లా నెఱిఁగినవానికి ॥ సంతో

నలువున కెలవుల నవ్వినదే చాలదా
ఛెలరేఁగి వాసిగలచెలువునికి
మలసి యేతువులెత్తి మాటలాడవలెనా
వలచి నిన్నుఁ బాయక వసమైనవానికి ॥ సంతో

మునుకొని చేతులెత్తి మొక్కినదే చాలదా
నిను నింత సేసినట్టినేరుపరికి
పెనఁగవలెనా ప్రియానఁ గాఁగిట నీతో
యెనసిన శ్రీవేంకటేశ్వరునికి ॥ సంతో ॥ 32

గౌళ

వద్దే మామాట విన వచ్చేవో రావో
యిద్దరి మీపొందులకు నింత చెల్లునా ॥ పల్లవి

పట్టినదే వ్రతమా పడఁతి నీ వతనితో

పొత్తుకు రమ్మనఁగాను పో నవేవు
వొత్తి విన్నవించనేల వోడలు బండ్ల వచ్చు
యెత్తయినదొరలకు నింత చెల్లునా ॥వద్దే॥

అడినదే మాటా అదె శ్రీవేంకటపతి
కూడే నే ననఁగాను గొణఁగేవు
యీడుజోడై యింతలోనే యిద్దరూ నొకటైతిరి
యేడనైనా నీదేకాక యింత చెల్లునా ॥వద్దే॥ 322

శంకరాభరణం

అడకే వచ్చెఁ బోవే అంతేచాలు
యీడుజోడుఁ జెప్పకువే ఇంతే చాలు ॥పల్లవి॥

కన్నులనే చూచితివి కాఁకలు చల్లితివి
అన్నిటా నేమీ ననకు మంతే చాలు
సన్నల నవ్వితివి చాయల మొక్కితివి
యెన్నికలు నరివచ్చె నింతే చాలు ॥అడ॥

బొమ్మల జంకించితివి పొద్దూఁ గడపితివి
అమ్మకువే వావులు నేఁ డంతే చాలు
చిమ్మితివి మాఁటలు సేసితివి సీఁటులు
యెమ్మె లింకఁ గొలుపవు యింతే చాలు ॥అడ॥

దగ్గరికి వచ్చితి దవ్వుల మెచ్చితివి
అగ్గలమాయఁ జెమట అంతే చాలు

ఊరు దియ్యఁ బేను వచ్చు నేమనఁగా నెట్లవునో
వూరకుండుటే చాలు వొద్దనుమీ బాసలు

అడ్డమాడలేకపో అట్టె నేను నుస్సురంటి
వొడ్డారించఁగలేకే వొగి నవ్వితి
వెడ్డువెట్టి నన్నునేల వెడనిష్ఠూరిఁ జేసేవు
వొద్దుకున్నాఁ బోనీవు వోపఁజుమ్మీ యింతకు

కోపగించఁ జాలకేపో కోరి వద్ద నిలుచుంటి
రాపుసేయఁ జాలకేపో రమ్మంటిని
యీపనికిఁగానే నీవు యేల పచ్చిసేసేవు
దాఁపినా విచ్చివేసేవు తప్పఁజుమ్మీ నీకు

వేసరించఁజాలకేపో వేగమే కూడితి నిన్ను
ఆస చెరుచఁగలేకే అంకె నుంటిని
యీసరికి శ్రీవేంకటేశ నన్ను నేలితివి
వాసికెక్కె రతులెల్లా పలెఁజుమ్మీ యిందుకు ॥ఊ

రేకు 957 ఆహిరి

గోరఁబొయ్యేపనికిఁగా గొడ్డలేఁటికి
ఆరయ నాతఁడే చెప్పీ నతివకు బుద్ధులు

చిత్తములోపలిచింత చెక్కుచేతఁ గానవచ్చె
అతి మాటాడించకురే అంగన నంత-

సిందన మైపరిహాము నిట్టూర్పులను మించె-
నందనే నవ్వించకు నే ఆయాలు రేఁగీ
వుంథరే చుట్టాలమైతే నొక్కటినేత మిద్దరి
చండిపెట్టి పిలిచితే చఁపట్టీ నలుక ॥

కూడేటితమకములు కొనచూపులందుఁ దేరె
తోడనే యడుగకువే తొలఁగీ సిగ్గు
యీడకే శ్రీవేంకటేశుఁ డేతెంచి కలసె నేఁడు
వాడికతో సతి మీరవలపించె నతని ॥ గోర

శుద్ధవసంతం

వడి నీజవ్వనానకు వసంతకాలము వచ్చె
అడియాస లిద్దరికి నాయములు సోఁకెనే ॥

మునితచెమటలనే ముంగారు లవె ముంచె
పెదవులఁ జిగిరించెఁ బెక్కులాగుల
పొడలుఁగుచములనే పూఁపలాయఁ బిందెలాయ
యెదుటనే పతి వున్నాఁ డిఁకనేమే చెలియా

కోమలి నీచూపులనే కొడినా (సాఁ?)గెఁ గోరికలు
వాములాయఁ బులకలే. వలపు పండి
వాముదేరీ మేనిమీఁదిననవిరివాసనలు
ఆమనివిభుఁడు చేరె నలుక లింకేలే

సతి నీమోహానఁ దీగెసాగె బాహులతలు
సతమాయ నిటూర్పు చలగాలి

అన్నియుఁ జేసినఫల మదియె మాకు
విన్నపము లిందుమీఁద వేవేలు నేఁటికి

కప్పుర మంపఁగనేలే కడమా నాకిది తొల్లి
కప్పురగందినవుట కానఁడా తాను
కప్పురముపేర నుండి కాఁకసేసె వెరబొమ్మఁ
జిప్పిలి మమ్మేపకుండాఁ జేయుమనవే

చందన మేలంపెనే సహజాన నేఁ దొల్లి
చందనగందినవుట చాటువే కాదా
చందనపుఁగొండఁ బుట్టి చల్లజంపు దిప్పకాయ
అంది పచ్చిరేఁచకుండా నడ్డపెట్టు మనవే

కమలము లే లంపెఁ గానుకగా నేఁ దొల్లి
కమలగందినవుట కలదేకదే
కమలాక్షుఁడైన శ్రీవేంకటపతి దానె నేఁడు
అమరఁగఁ గూడె నన్ను నంద నుండుమనవే ॥

మేఁచబౌళి

నాకొరకు నిన్ను నింత నలఁగించవలెనా
నీకు నితవైనంతే నే నాడఁబడితిరా

వొలసినొల్లనిచోట నొరసితే విసుపౌను

కూరిమిఁ గొనరఁబోతే కోపమౌను
చేరువ నీరూపము నా చిత్తరువులో నున్నది
కోరి నీవెంటఁ దగిలి కోసి రాచనోపరా

తనిసినరతివేళ తగుమోవే మొగచాటు
అనఁగి పెనఁగఁబోతే నలపౌను
ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
మనసు లొక్కటాయ మారుమాట లోపరా ॥ న

తెలుఁగుఁగాంబోది

ఇంక నెంతగాఁగలదో ఇఁతట నీవు రాకుంటే
లంకెఁబెట్టె ప్రాణములు లలన నీతోను

మాటలు నాతో నాడు మనసు నీపై నుండు
చీటికిమాటికి నాతోఁ జెప్పినవే చెప్పును
కాటుకకన్నులు నీరాకకే యెదురుకోనుండు
కోటికిఁ బడగెత్తెఁ గొమ్మ నీపై మోహము

వెలఁది నన్నీడ కంపి వెంటనే తానూ వచ్చు
యెలమిఁ గానుక నీకు నిచ్చినవే ఇచ్చును
పొలసి నీవే నేఁగాఁజూచి భ్రమసి వెదకు
వలపు వెదలువెట్టీ వాడవాడఁ జెలియ

సెలవినే సవ్వు నవ్వు శిరసున నీకు మొక్కు
పొలయు నీ ముంగిటనే పొద్దువోకకు

సరసములాడఁగానే సరి, వయసు వోయీని
తెరమరఁ గిఁకనేల దిష్టించరాదా

చిత్తరున వ్రాసినట్టు సిగ్గువడున్నది చెలి
యెత్తి కాఁగిలించుకోవు యింతగలదా
కొత్తమెరుఁగువలెను కొంకుదేరదు వెరచి
పొత్తుకుఁ బిలుచుకొని బుజ్జగించరాదా

అంచవలెఁ బొలసీని అంగన నీయెదుటను
మంచముమీఁదికిఁ దీసి మన్నించరాదా
అంచల పూఁగొమ్మవలె నాడనుండే జడసీని
మంచితనములు సేసి మాటలాడరాదా

మూసినముత్యమువలె మోనముతో నవ్వీని
నేసవెట్టి రతివిందు సేయఁగరాదా
ఆసల శ్రీవేంకటేశ అంగన నిన్నిటుగూడె
వాసికెక్కె మీ వలపు వద్దనుండరాదా ॥

రేకు 958. ఆహిరి

ఇటమీఁద నీచిత్త మిదివో నా విన్నపము
కుటిలకుంతలీదెస గుఱుతుగాఁ జూడుమా

కలసి మెలఁగుదాఁకాఁ గన్నులనే వుండు నాస
నెలవినే వుండు నవ్వఁ చెనకుదాఁకా

నాని సిగ్గుచేత నుండు ననుపుదాఁకా
మోనాన[1] మోవేనుదాఁకా మొకాన నున్నది దప్పి
పూనినమోహ మెట్టిదో పొలఁతి నీమీఁదను

కూడి రతిసేయుదాఁకాఁ గుచాల నుండుఁ గోరిక
జోడించి మైఁగాఁక యిందు చొక్కుదాఁకాను
యీడుగాను శ్రీవేంకటేశ ఇంతిఁ గూడితివి
తోడునీడవలె నుండుఁ దొయ్యలి నీవలపు ॥ ఇ

([2]జక్కిణి) బౌళి

దేవ వాసుదేవ
భావయ తాం పాలయ ॥

నరహరే అహో నారాయణ ం
మురహర నగధర ముకుంద
తరుణీయం తు తవ విరహేణ
భరితవిచిత్రప్రతిమా జాతా

దివిజవందిత దేవోత్తమ అహో
నవనీతప్రియ నందసుత
తవ సంగమసంతతకామనయా
యువతి ర్జాతా యోగినీవ

జితదానవ అహో శ్రీవేంకటపతే
సతత మాధవ కృష్ణ సర్వేశ
రతిసంగమేన రమణీ[3]యం తు
జిత తే విహితాశరగణా జాతా ॥ దే

నీకుఁ దెలియదు గాని నిండిననాలోనికాఁక
  కాకుసేయకుండరాదా కమ్మరాఁ గొంతవడి ॥పల్లవి॥

నాకంటె మునుప నీవు నన్ను మాఁటాడించఁగాను
  పైకొన్న మొగమోట నేఁ బలికేఁగాని
  చేకొని నీ వాడానీడాఁ జేసినచేఁతలు విని
  కూఁకలు వత్తులునాయ కొలఁపదు మనసు ॥నీకుఁ॥

మొగమిచ్చి సారెసారె మోహము చల్లుచు నాతో
  నగఁగా నేనూ నట్టె నవ్వేఁగాని
  యెగసక్కేలకు నీమై [1]నెవ్వతోచేఁతలు చూచి
  సగమై లోలో నిట్టె జడిసీ నాదేహము ॥నీకుఁ॥

దగ్గరఁగ వచ్చి నీవు తగఁ గాఁగిలించఁగాను
  వొగ్గి నేనూఁ గూడి వూరకుండితిఁ గాని
  యెగ్గులేక శ్రీవేంకటేశ నన్నుఁ గూడఁగాను
  సిగ్గుచేత నాచెక్కు చేతిమీఁద మోఁచేను ॥నీకుఁ॥ 33

శంకరాభరణం

అదరానిమా టది గుఱుతు
  వేడుకతోనే విచ్చేయుమనవే ॥పల్లవి॥

కాయజకేలికిఁ గడుఁ దమకించఁగ
  ఆయము లంటిన దది గుఱుతు
  పాయపుఁబతికిని బరిణామము చెప్పి

యిప్పుడు దనరూ పిటు దలఁచి బయలు
చిప్పలఁ గాఁగిటఁ జేర్చితిననవే ॥ అ

పరిపరివిధములఁ బలుకులు గులుకఁగ
అరమరచి చొక్కిన(ద)ది గుఱుతు
పరగ శ్రీవేంకటపతి కడపలోన
సరవిఁగూడె నిఁక సమ్మతియనవే ॥ ఆడ ॥ 3

రామక్రియ

[1] పదియుఁ బదియుఁగాను పరమాత్ముఁ డితనికి
వెదకి చవులు దెచ్చి విందు లిట్టె సేయరే ॥ పల్లవి

పొలసు పైఁబారెనట బురద మేనంటెనట
యిల మన్ను మోఁచెనట యీదేవుఁడు
నెలవై నరాకాసినెత్తుటఁ దోఁగినాఁడట
కలపన్నీ రెల్లఁ బోసి కడుగరే దేహము ॥ పది

బాఁపనజిడ్డంటెనట పట్టెనట ముమ్మరము
కైపగునల్లనికోక గట్టినాఁడట
చాపలానఁ జెంచుదానిసంగడిఁ దిరిగెనట
కోపులఁ గప్పురధూళి గుప్పరే యీతనికి ॥ పది ॥

కాంతలనే కూడెనట కడగడ దొక్కెనట
పొంతలఁ దట్టుపుణుఁగు పూయరేనేఁడు
యింతట శ్రీవేంకటేశుఁడెద నలమేలుమంగఁ
గాంతునికి మెడఁగుచ్చి కట్టరే మొక్కుదము ॥ పది ॥ 335

1 ఇది అధ్యాత్మకీర్తనలచాయలోనిది...

పట్టరాదు ప్రాయమిది పైపై నున్నదిరా

వినుకలివిరహమే వేడుకలై తోఁచేఁగాని
కనుఁగొంటేఁ దమకము కడుబెట్టురా
మనసునఁ దలఁచుటే మంచిదయి వుండీఁగాని
తనువు గాఁగిలించితే తతిగొనీ మఱపు

తెమ్మలై తొంటికూటమి దిష్టమై వుండీఁగాని
కమ్మి మీఁదటికోరిక గాసిఁబెట్టీరా
చిమ్ముచు నీకెదురుచూచినదే యింపాయఁగాని
కమ్మర నంటితే గోరు కడువాఁడిరా

మంచిదూతికలయెడ మాటలే చవాయఁగాని
కంచముపొత్తిచ్చితేనే కళదాఁకెరా
అంచల శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
యెంచి కూడితివి యిన్ని నియ్యకోలే యిఁకను ॥

రేకు 159 ముఖారి

అందుకేమి పదరాదా అనలేల సతివద్ద
కందువ మగవానికిఁ గలదేకాదా

చెప్పకుండునా బుద్ది చేరకుండా నెవ్వరిని
యెప్పుడూ నాకెవద్దికి నేఁగసవేళ
అప్పుడే యందుకు నిచ్చలాడక నీవుండువా

చెయార( గా(గిటిలోన( జిక్కినవేళ
యీాయకుందువా బాస యిందరి విడుతునని
పోయినట్టెల్లా నిన్ను( బోనీ(గాక ॥

అనకుండునా తానె ఆకె దొడ్డదాననని
వినకుందువా సవు వేళావేళ
అను(గు శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
తనియ నే నిన్ను( గూడి దక్కి(గొంటి(గాక ॥ అం

ముఖారి

వెల(ది నింక లేపవెఅతుము నేమైతే
చెలువు(డవు నీవే విచ్చేయవయ్య లోనికి ॥

కాంత, నీవు రా(గానే కన్నులుమూసుక యిట్టె
పంతమున నిద్దిరించీ( బానుపుమీ(ద
చెంతల నేము దగ్గరి చేముట్టి లేపితేను
వింతలుగా విదిలించివేసీ( గోపానను

అంద నీరాక చెప్పితే సప్పటి నీపచ్చడము
నిండా ముసు(గువెట్టి నిద్దిరించీని
వుండలేక పాదముపట్టూ(చి పేర(బిలిచితే
దిండుకట్టు( జెప్పరానితిట్లు తిట్టీని

సతి యలమేల్మంగ సారెకు గురకవెట్టీ
తతి నీవు పై(బడ(గా( దా నీలిగీని

పాడి

కొత్తసింగారాలు సేసెఁ గొమ్మ దనమేనిలోనె
చిత్తగించి రారాదా చెలిఁ జూతుగానీ ॥పల్లవి॥

కుప్పలుసేసె వలపు కుచములనె యిట్టె
చిప్పిలఁ గరఁగె మతి చెమటలను
కప్పుకొనెఁ జీకట్లు కడుజారినవెరుల
యిప్పుడే విచ్చేయరాదా యింతిఁ జూతుగానీ ॥కొత్త॥

నిండఁజేసెఁ దమకము నిట్టూర్పుగములను
పండఁజేసె పులకలపైరులు మేన
యెండించెఁ గాఁకలచేత యింపుమోవి, తీపువట్ట
అండకు విచ్చేయరాదా ఆకెఁ జూతుగానీ ॥కొత్త॥

వెదచల్లెఁ జూపులనె వేవేలు ఆసలెల్లా
నిదురవోయీ నీపై నివ్వెరగుల
అదె శ్రీవేంకటేశ నీ వలమేలుమంగఁ గూడి–
తిదె దినము రారాదా యిఁకనైనాఁగానీ ॥కొత్త॥ 339

ఆహిరి

తనువిందుఁ దలఁపందు తమకము నడుమను
పెనగొనీఁ దాను పిలిపించఁడొకో అతఁడు ॥పల్లవి॥

ఇంతక పతికడకు నేఁగునొకొ చెలియ
వంతుల విందు మరలి వచ్చునొకో

నెమ్మది మనవాకిట నిలుచునొకో
తమ్మిరేకులేకతైనాఁ దలఁపించకుండునొకో
సమ్మతిఁ గరుణ నాపైఁ జల్లఁడొకో యతఁడు

వీఁడె విచ్చేసెననఁగా విందునొకో నేను
పోఁడిమిఁగాఁగిట వానిఁ బొందుదునొకో
నేఁడె శ్రీవేంకటపతి నే నలమేల్మంగనని
వాఁడె వచ్చి నన్నుఁగూడె వద్దనున్నాఁ డతఁడు ॥త

వరాళి

ఇంతలోనె నీతో నే నేమందురా
పొంతనుండి నీవే నాకు బుద్ధిచెప్పఁగదరా

చెక్కుమీఁదటఁ జేయి చిత్తములోపల నూయి
ఇక్కవమాటలు నీతో నే మందురా
చక్కనే నీనేరుపులు చల్లి నావూరుపులు
అక్కడినుద్దు లేమైనా నానతియ్యరా

వంచినది నాశిరసు వలపూఁ గడుబిరుసు
ఇంచుకా మొగమోడక యేమందురా
మంచిదే నీలోనిగుట్టు మాకే ఇన్నిటా అట్టు
కంచపుఁబొత్తుకు నీవే కైకొలుపఁగదరా

ముందుఁ దొక్కితి ముంగిలి మోవిమీఁదనె యెంగిలి
యించరిలోపల నిన్ను నేమందురా

ఎచ్చేయుమనఁగదే విభునిఁ జెలికడకు
పచ్చిసిగ్గు నెన్నడుమ బట్టబయలాయను

కోరికలు కొనసాగి కోమలికిఁ గొప్పుగూడె
మేరతోఁ గళలె ముంచె మించుఁబాయము
పేరడై నవలపెల్లాఁ బెదవులఁ జిగిరించె
ఆరయ నంగన నేఁటి కాఁడిఁబెట్టీనె

సతితమకములెల్లాఁ జనుఁగొండలై పెరిగె
రతికాంక్ష పిఱుఁదున రాసికెక్కెను
మతిలోనివిరహము మంచినిట్టూర్పుల రేఁగె
మతకమేఁటికిఁ జేసీ మానినితోఁ దాను

కూడేటిసంతసములు కొనగోళ్ళ వాండ్లెక్కె
పాడితోఁ గోమలికము పాదాల నిండె
యీడ నలమేలుమంగ నెనసె శ్రీవేంకటేశుఁ–
డాడినట్టే సేసె నింతి నట్టె దినదినము ॥ వి

రేకు 960 బౌళిరామక్రియ

వాఁడే వాఁడే అల్లరివాఁ డదివో
నాఁడునాఁడు యమునానదిలోన

కాంతలు వలయపుకంకణరవముల–
నంతంతఁ గోలాటమాడఁగను

మగువలు ముఖపద్మములు దిరిగిరా—
నగపడి కోలాటమాడఁగను
నిగిడీ నడుమ నడె నీలవర్ణుఁడు
పగటుతోఁ గమలబంధునివలెను

గోపిక లీరీతిఁ గోలాటమాడఁగ
యేపున శ్రీవేంకటేశ్వరుఁడు
వోపెలమేల్మంగ నురమున నిడుకొని
దీపించె మణులలో తేజమువలెను ॥వా

శంకరాభరణం

మొగమూ నోడితిమి మొన్ననే కూడితిమి
నగముజాణతనాలు చల్ల నింతవలెనా

కానుక లిచ్చితిమి కన్నుల మెచ్చితిమి
పోనీరాదా యిఁకనైనాఁ బోయినపొద్దు
నానె నాకు వలపూ నవ్వులాయఁ దలఁపూ
మానరాదా యిఁకనైనా మామీఁదిఆనలు

చేతుల మొక్కితిమీ చేఁతకుఁ జిక్కితిమీ
తోతో ఇంకానేల తొల్లిటివావి
రాతి రస్నిఁ గంటిమీ రచ్చలనే వింటిమీ
కాతర మింతేసేల కమ్మటి మాతోను

దగ్గరి కూచుంటిమీ తప్పులు లేవంటిమీ

పాడి

అల్లవాఁడె భావించరె అంగన లిందరుఁ గూడి
వుల్లములో తనమాయ లుబ్బెనో శ్రీహరికి

నేలా మిన్నుఁ గొలవఁగ నిక్కి మిన్నేటినురుగు
అలరి యీహరిమేన నంటుకొనెనో
పాలవెల్లి తచ్చఁబోఁగాఁ బైఁబడెనో తుంపురులు
మేలిమి కప్పురకాపు మెత్తిరో యీహరికి

చిత్తగించి రేపల్లెఁ జీఁకటితప్పు సేయఁగా
అత్తల చీఁకటినలు పంటుకొనెనేమో
వొత్తి కరిఁ గావఁబోఁగా నొలికెనో పైమదము
మొత్తమిఁ బుణుగుకాపు ముంచిరో శ్రీహరికి

అలమేలుమంగఁ దెచ్చి అురతఁ గట్టుకొనఁగా
పొలసి నవరసాలుఁ బొడచూపెనో
నెలవైనసొమ్ములెల్లా నిండుకొనె మేననెల్లా
అలరి శ్రీవేంకటాద్రి నందమైనహరికి ॥ అ

లలిత

[1] అంగన లీరే యారతులు
అంగజగురునకు నారతులూ

శ్రీదేవితోడుతఁ జెలఁగుచు నవ్వే-
ఆదిమపురుషుని కారతులూ

హరి కిదివో పసిఁడారతులూ
తరమిది దుష్టుల దనుజుల నడఁచిన-
అరిభయంకరున కారతులూ

నిచ్చలుఁ గల్యాణనిధియై యేఁగేటి-
అచ్చుతునకు నివె యారతులూ
చొచ్చి శ్రీవేంకటేశుఁడు నలమేల్మంగ
యచ్చుగ నిలిచిరి యారతులూ ॥

సామంతం

ఎవ్వరు వద్ద నున్నారో యేమి సేసీనే
దవ్వుల నెదురురాక తా నేమి సేసీనే

పచ్చనిచిగురువంటిపాదాల నడచివచ్చె-
నిచ్చకపుఁబతి లోన నేమి సేసీనే
నెచ్చెలిమే నింతలోన నిండాఁ గడుఁజెమరించె
యెచ్చుటఁ బరాకై నాఁ డేమి సేసీనే

మంచిమాణికాలురాలేమాట లాడీఁ జెలి యీడ
ఇంచుకంతా నెఱఁగదు యేమి సేసీనే
మంచముపైఁ బవ్వళించె మగుళ యలసి వచ్చి
యెంచినయెన్నికలాయ నేమి సేసీనే

కలువరేకులవంటి కన్నులఁ జూచె చెలి-
నెలమిఁ దాఁ దేరిచూచీ నేమి సేసీనే

కామించి తనుఁజూడఁగఁ గలిగితేఁజాలు

తలఁపులో నున్నవాఁడు తలఁచే నే నెప్పుడైనా
యెలమిఁ దా నేడ నున్నా నేమాయనే
వలపు నాకే కద్దు వడి నేఁ దన్ను విడువ
చెలఁగి యేపనులైనాఁ జేయనీవే తాను

పెదవిపై నున్నవాఁడు పిలిచే నే నెప్పుడైనా
పొదలి యాకెయింటికిఁ బోయిరానీవే
పదరక నాకుఁబోదు పయికొనేఁగాని నేను
అదనాయ తనతోడిఅలుకేల నాకు

చేతికి లోనయినాఁడు చెనకే నే నెప్పుడైనా
రాతిరేమి పగలేమి రానియ్యరే
యీతల శ్రీవేంకటేశుఁ డింతలో విచ్చేసి కూడె
కాతరాన వెనకటికడమేల యిఁకను ॥

రేకు 961 వసంతం

వేడుక వసంతము వేళ నిదే
వాడలవాడలవెంట వనిత లాడేరు

కేలుఁగేలుఁ జట్టిపట్టి కెందామర మోములెత్తి
కోలఁగోలఁ దాఁకఁజేసి గుంపువాయక
చాలుకొని యిద్దరేసి జంటలై సతులు గూడి

మెలిమిపిఱుఁదులతో మెరయుచు మురియుచు
కోలలఁ బెడమరలి కోలాటమాడేరు ॥ వేడ

కది శౌండురుమోములు కన్నులఁ దేలించి చూచి
పదతాళగతులకు పడఁతులెల్లా
అదివో శ్రీవేంకటేశుఁ డలమేలుమంగతోడ
ముదమంది చూడఁగాను ముందట నాడేరు ॥ వేడు ॥ 3

పాడి

అప్పటి మానవు వెంగే లదేమే నీవు
కుప్పలై నవలపుల గురిగాఁ జూచేవు ॥ పల్లవి

వద్దే నాతో నింకా వట్టిసటజంకెనలు
గద్దించి తీసిన లోనుగాక మానేవా
కద్దే నావంకఁ దప్పు కప్రపిడె మిచ్చినది
వొద్దిక మదనమెత్తి వొకటొక టాడేవు ॥ అప్ప

పోపో నాతోనేల పొద్దువోనియానలు
చూపుల నాయమంటితే చొక్కకుండేవా
కాపాడి గుబ్బలఁ గొంగుగప్పినది నేరమీ(మా?)
తీపులపెదవి వంచి తిట్టేవు లోలోనే ॥ అప్ప

రావే నాయెడనేలే రతిలో నీగుట్లు
మోవి నిన్నుఁ జెనకితే మొక్కకుండేవా
యీవేళనే శ్రీవేంకటేశుఁడ నేఁ గలసితి

గొల్లెతల నింత నేసీ గోవిందుఁడు
కొల్లకాఁడు రేపల్లె గోవిందుఁడు ॥ పల్లవి ॥

పలుకుల భ్రమయించె భావములఁ గరఁగించె
కొలనికరత నవ్వె గోవిందుఁడు
యెలయించి యప్పటి మాయింటిలోనే పవ్వళించె
కొలఁదిమీరినవాఁడు గోవిందుఁడు ॥ గొల్లె ॥

గారక పువ్వుల వేసె నొకటొక టేసేసె
కూరిమిఁ దప్పకచూచె గోవిందుఁడు
చేరి మావారుండ వారు చెప్పరాదు తనదూరు
కోరి యశోద నీబిడ్డ గోవిందుఁడు ॥ గొల్లె ॥

సమ్మతించఁ జేయివేసె చన్నులతోనే రాసె
కుమ్మరించె వలపులు గోవిందుఁడు
దొమ్మిసేసి మమ్ముఁగూడె దొరవలె నదె వాఁడె
కొమ్మరో శ్రీవేంకటాద్రి గోవిందుఁడు ॥ గొల్లె ॥ 351

లలిత

నిజము చెప్పఁబోతే నెలఁతలు నవ్వేరు
భజన నెందరికని బాస లిచ్చేవయ్యా ॥ పల్లవి ॥

చెప్పరాదు చెలులు పదారువేలు
నెప్పున నీవాడుకొంటే నిజమందురా

కమ్మరాఁ జేయఁగఁబోతేఁ గైకొందురా
చిమ్మి చెక్కునొక్కనేల చేతులు నొచ్చీఁ జాలు
పుమ్మడిఁ గుచాల నొత్తే నొద్దికి రావయ్యా

కంటిమి నీనేరుపులు కాఁగిటిలోనే నేఁడు
అంటి కూడితే భ్రమయక వుందురా
వొంటినే శ్రీవేంకటేశ వొడఁబరచి పొందితి-
వింటిలోఁ బానుపు మీఁది కిఁక రావయ్యా ॥ ని

సామంతం

అతఁడు నాకుఁగలఁడనేదే చాలు
చతురుని దూరకురే సారెసారె నిఁకను

మలసి వేరొకతెకు మనసిచ్చినా అతఁడు
అలరి మాఁటలాడితే నాడుఁగాక
తలఁపు నామీఁద నుండు తను వెక్కడ నుండినా
వలసినప్పుడు తానే వచ్చీ నాకడకు

అటువలెఁ బరసతి కాసపడునా అతఁడు
నటనల నవ్వితేను నవ్వీఁగాక
యెట్టైనా జేసే యతఁడు యెవ్వ రేమిచెప్పినాను
చటుకనఁ దనమాఁట తప్పనివాఁ డతఁడు

పక్కన నెవ్వరికైనా భ్రమసునా నేఁ డతఁడు
చొక్కఁగన్నులఁ జూచితేఁ జూచుఁగాక

సిగ్గున మునిఁగెను చింతలఁ బొరలెను
యెగ్గులెంతురా యిఁకనేలే ॥ పల్లవి

శిరసును వంచెను సెలవుల నవ్వెను
మరిగెనుఁ బతి నీమాఁటలకే
నిరతితో నలసెను నిట్టూర్పులు నించెను
యెరపరికములఁ జల మిఁకనేలే ॥ సిగ్గు

నిన్నిటు చూచెను నేలలు వ్రాసెను
సన్నల నీలో సణఁగులకే
యిన్నిటి కొడఁబడె నిటు చేయివేసెను
యెన్నిక కొసరులు యిఁకనేలే ॥ సిగ్గు

పంతము నించెను పానుపు చేరెను
కొంత గొంత నీకూటమికే
యింతట శ్రీవేంకటేశ్వరుఁ గలసితి-
వెంతని మెచ్చే విఁకనేలే ॥ సిగ్గు ॥ 35

ు 962 సాళంగం

మెఱుఁగువంటిది యలమేలుమంగ
అఱిమఱి నవ్వీని అలమేలుమంగ ॥ పల్లవి

పలచనియెఱఁగునఁ బాకీ నీమీఁదిపాట
మెఱుగుఁ...

మేడమీఁద నుండి యలమేలుమంగ
వాడుమోముతో నీపై వలపు చల్లిచల్లి
ఆడీ నాట్యము సారె నలమేలుమంగ

పేరుకొని పిలిచీని ప్రియములు చెప్పిచెప్పి
మేరమీర నిన్ను నలమేలుమంగ
యీరీతి శ్రీవేంకటేశ నిన్నుఁ గూడె నేఁడు
ఆరితేరె నన్నిటాను అలమేలుమంగ ॥ వె

సామంతం

మూసి మంతనాలతోడి మోహమేలే
వేసరించనేలే మరి వేఁడుకొననేలే

పిలిచినప్పుడు రాక బిగిసి వెనక నాతో
అలరి యెంతనన్వినా నదియేలే
వలపుకాఁకలచేత వాడఁజేయనేలే మరి
చలువగాఁ బన్నీరు చల్లనేలే

యింటికి వచ్చినపని యియ్యకోక మరి నా—
వెంటవెంటఁ దిరిగేటివేసాలేలే
తుంటతనమున నన్ను దూరనాడనేలే మరి
గెంటి యంతలోనే తాను కిందుపడనేలే

చెక్కునొక్కి యప్పుడే చిడుముడిపడి మరి
అక్కరతోఁ గాఁగిలించే దదియేలే

తలపోసి తలపోసి తనువెల్లాఁ గాఁకరేఁగె
వలపు దరించరాదు వాములాయ నిపుడు ॥పల్లవి॥

యిట్టె విచ్చేయఁడొకో యింతలో మరచెనొకో
అట్టె పతి నఁన్నె(నన్నెన్నె?)నా రమ్మనఁడొకో
గుట్టున నుందురనొకో కొమ్మల నంపుదునొకో
యెట్టు వేగించవచ్చు నింతవొద్దువోయను ॥తల॥

యింటిలో నున్నాఁడొకో యెఱఁగలేనైతినొకో
నంటునఁ దా నింతసేసె నవ్వులకొకో
అంటి చెలిచేతఁ గానుకైనా నంపుదునొకో
వొంటి నెట్టు దరియించే నోయమ్మ నేను ॥తల॥

మోము చూచి నవ్వఁడొకో మొగి సన్న సేయఁడొకో
కామించి తానే కాఁగిటఁ గలయఁడొకో
యేమరించి శ్రీవేంకటేశుఁడు నన్నుఁ గలసె
నామన సొకటే యాయ నమ్మితిఁబో ఇపుడు ॥తల॥ 35

సామంతం

కంటిఁ గంటి నీగుట్టు కాసిలేరా
కంటగించీ నీగుణాలు కాసీలేరా ॥పల్లవి॥

అదరి నావద్ద నుండి యట్టె పుస్సరనేవు
కడ నేమిదలఁచితో కాసీలేరా

కమ్మర నాతో నవ్వేవు కానీలేరా
కమ్మని యాకెయింటికి రతి నానవెట్టితేను
కమ్మి నానోరు మూసేవు కానీలేరా

వక్కాణించి నీమోవి వాడుదేరీ నేలంటే
గక్కనఁ గాఁగిలించేవు కానీలేరా
యెక్కువ శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
కక్కసించనోప నిఁకఁ గానీలేరా ॥కం

## వసంతం

వచ్చేవో రావో నీవు వాదు లేఁటికే
పచ్చిదేరె వలపులు పగటేలే ఇఁకను

నగవు వెన్నెలగానె నంటునఁ జన్నులు రానె
యెగసక్కెములు నాతో నిఁకనేఁటికే
గుగురుగాఁ బులకించె కొప్పువిరు లటు చిందె
సొగిసి బిగియ నీకుఁ జోటేదే యిఁకను

మాటలఁ దేనెలు చిందె మనసులో నిండె
యీటువెట్టి గుట్టుసేయ నిఁకనేఁటికే
పూటురేఁగెఁ జెమటలు పుసురసురులు రేఁగె
బూటకపుఁజల మింతే బొంకనేలే యిఁకను

ఆయములు సరివచ్చె నాసలెల్లా గడుహెచ్చె
యేమెడఁ జూచినఁ బంతా లిఁకనేఁటికే

మఱి తనుఁబాసినమముబోఁటికిఁగా—
కెఱఁగెఱఁ గివి తను నెలయించీనా

విత్తజుగురుఁడట జిగిఁ బూబాణపు—
కత్తులు తను మరి కాఁడీనా
పొత్తులచంద్రుఁడు భువిఁ దనమఱఁదెట
వత్తిగఁ దనపై వడ చల్లీనా

వంచినకోవిల వాకట్టువాఁడట
ముంచి కోవిలలు మొఱసీనా
పెంచి గాలిదినుపెనుఁబాము పరపట
పంచలఁ దను నవి భ్రమయించీనా

మతిఁ దా వసంతమాధవుఁడట మరి
తతి నామని తనుఁ దడవీనా
యితవుగ శ్రీ వేంకటేశుఁడు తాఁ గూడె
రతి నిద్దరికిని రారాఁపయ్యీనా ॥

రేకు 963 వరాళి

ఇదివో నీ మహిమ నేనేమని పొగడుదును
కదిసి నీవుండఁగాను కపటాలూఁ బాసె

వేడుకతో నీనవ్వు వెన్నెలలుగాయఁగాను
యీడనే చిత్తముచీఁకటంతాఁ బాసె

కలిసి సవతులకు కప్పురాలు చల్లఁగాను
తలపోఁత విరహపుదప్పులు వాసె
చలువై నీకరుణారసపువాన గురియఁగా
కలిగిననామనసుకఅవెల్లాఁ బాసె ॥ ఇది

కరకమలము నీవు కమ్మరఁ బై వేయఁగాను
మరునిబాణాలపగ మాలోఁ బాసె
ఇరవై శ్రీవేంకటేశ ఇద్దరముఁ గూడఁగాను
శిరసులువంచినట్టిసిగ్గులెల్లాఁ బాసె ॥ ఇది ॥ 36

## బౌళి

ఏల నన్ను రమ్మనీనే ఇంతే చాలు
యేలినాఁడు తొల్లె నన్ను నింతే చాలు ॥ పల్లవి

కూడి తనచేఁతలకుఁ గోపగింతునో యేమో
యీడనుండి మొక్కితి నాకింతేచాలు
వోడక సారెకు రాఁగా నాగరానో తీపానో
యేడకేడ [1]తననా కింతేచాలు ॥ ఏల

కామిను లెందరు లేరు కాఁకలు చల్లఁ దనకు
యేమిగారణము నే మింతేచాలు
నేమము దప్పకుమంటే నేరుపౌనో నేరమౌనో
యీమాటు వోయిరావే యింతేచాలు ॥ ఏల

బెట్టి నవ్వ నీరుదియ్యఁ బేనువచ్చు నిఁకనేల
యెట్టైనా వచ్చెఁ దా నీడ కింతే చాలు
వొట్టుక శ్రీవేంకటేశుఁ డొనగూడె నిప్పు డిదె

కాంబోది

ఇందరముఁ గంటిమి నీ విధిగానవా
వొందిలి పానుపుమీఁద నున్నది గానవా ॥పల్లవి॥

బంగారుపావాలు మెట్టి పడఁతి యెవ్వతోకాని
ముంగిటఁ బొలసె నీ విమ్మలఁ గానవా
పొంగేటిజవ్వనముతో పొదరిల్లు దూరి నీతో-
నంగవించి సన్న నేసె నదిగానవా ॥ఇంద॥

వల్లెవాటుఁబయ్యదతో వనితలపై నొరగి
యిల్లిదె యేకతమాడీ నిది గానవా
కొల్లలుగా నాడనాడ కొప్పుపూవు లటు జార
చెల్లఁబో కులికినవ్వేచేఁతఁ గానవా ॥ఇంద॥

జవ్వాదివాసనలతో సతి నీవెనక నదె
యెవ్వరంటా నున్నవాఁడ విది గానవా
రవ్వగా శ్రీవేంకటేశ రమణిఁ గూడితి విదె
యివ్వలనే బొంకేవు యిప్పుడైనాఁ గానవా ॥ఇంద॥ 36

రామక్రియ

నిచ్చనిచ్చ వాదులేల నీచిత్తము
యెచ్చుకుందు లాడనేల యింకా నీచిత్తము ॥పల్లవి॥

మిక్కిలిదొరవు నీతో మేలమాడ వెఱతుము

నిమ్మపండు గానుకద నీచిత్తము
సమ్మతిగా నీవలపు చల్లఁబోతే చవిగాదు
వుమ్మడి నుండే మింక నున్నది నీచిత్తము

చేవదేర నీయెడకు సిగ్గువడ నిఁకనేల
నీవే నేనైతి నిఁక నీచిత్తము
శ్రీవేంకటేశ నన్నుఁ జేకొని కూడితి విట్టె
కైవశమైతి మిఁకఁ గలది నీచిత్తము ॥నిచ

సాళంగం

ఆతనిపై నలిగేనా ఆతఁడు నాకలిగీనా
కాతరాన మీరేల కక్కసపెట్టేరే ।

మాటలలోనా నతఁడే మనసులోనా నతఁడే
యేఁటికి విభుని దూరే రింకా మీరు
కూటమికిఁ దాఁ జిత్తముకొలఁదినే వచ్చీఁగాక
పాటించి యింతేసి యేల బలిమిసేసేరే

కలలో విచ్చేసినాఁడు కరఁగించి కూడినాఁడు
యెలయించేల పిలిచే రింకా మీరు
తలఁపుఁదలఁపు నొక్కటారుకాణ లిద్దరికి
చెలఁ గెప్పుడు వచ్చినాఁ జింతించనేఁటికే

మెట్టిననే లొక్కటే మీఁదఁ బారేగా లొక్కటే
యెట్టివారు గలిగితిరే యింకా మీరు
యిటె శ్రీవేంకటేశుఁ డిచ్చగించి నన్నుఁ గూడె

ఇటువంటిదాన నా కేఁటియలుకే
కటకట తా రాఁగాఁ గాదనేనా నేను ॥ పల్లవి ॥

మాటలాడకుండుఁగాని, మనసులోపలనైతే
నాటినది తనమీఁద నాచిత్తము
కాటుకకన్నులఁ జూచి కసరుదుఁగాని నేను
వాఁటపువలపు మీఁద వంతుఁబో లోలోనే ॥ ఇటు ॥

దగ్గరి రాకుండుఁగాని, తా నన్ను నంటినప్పుడే
వెగ్గళించి సిగ్గులెల్లా వీడఁగలవే
యొగ్గువట్టివుండుఁగాని, యేపాటి నవ్వించినాను
అగ్గలపుసరసము లాఁగుదుఁబో నేను ॥ ఇటు ॥

నివ్వెర గందితిఁ గాని, నేఁడు నన్నుఁ గూడఁగాను
పవ్వళించినప్పుడేపో పరవశము
యివ్వల శ్రీవేంకటేశుఁ డేకతమాయ నాతోను
జవ్వనభారముచేత జడిసీఁబో తనువు ॥ ఇటు ॥ 36

964 ఆహిరి

విరహంబు వేఁడాయ విరులమొన వాఁడాయ
తరవాతిపనుల కిటు తడవేల ఇఁకను ॥ పల్లవి ॥

పిలువరే నాయకునిఁ బ్రేమంపుచెలిమీఁద —
నలఁదరే శ్రీగంధ మందాఁకాను

చెరుగర తురుములఁ జదరంజాలనసలు
కరఁగనే చెలినుదుటికస్తూరిబొట్టు
మరుపరే కప్పురము మగువదప్పులు దీర
నెరపుదము నేరుపులు నిమిషంబుమీఁద ॥విర॥

అంపరే యెదురుగా నతనికిఁ గానుకలు
చెంపలనుఁ బన్నీరు చిలుకఁగదరే
యింపులను శ్రీవేంకటేశుఁ డిదె వచ్చి సతి
సొంపులనుఁ గూడె నిఁక సొలయ నేమిటికే ॥విర॥ 367

నాట

ఈఁతకు మిక్కిలిలోఁతా ఇంకా నేలే
చేఁతలెల్లాఁ జెల్లె నీకు చిరునవ్వుగాదా ॥పల్లవి॥

కాయ మతనిపై వేసి ఘనకుచముల రాసి
మాయలు సేతువుగాక మాతో నేలే
చాయలనే యెకపోసి సన్నల నింత సేసి
యేయెడకుఁ బోసీవు ఇంతకంటె నేమే ॥ఈఁత॥

మాటలనే కరఁగించి మంతనాలు మరిగించి
నాటక మక్కడఁ జేసి నాతో నీకేలే
కాటుకకన్నులఁ జూచి కాఁకలఁ జేతులు చాఁచి
వాఁటమై వుండుదుగాక వాదు లీడనేలే ॥ఈఁత॥

కాఁగిట నాతనిఁ గుచ్చి కమ్మి మాయింటికిఁ దెచ్చి
ఆఁగితి నాకాఁగిటిలో నాయనాయనే

చాలు నింతకోపాలు చలమని
పాలించఁ దనకేమి పంతమని ॥ పల్లవి ॥

అంటిరా మీరు ఆమాఁట పతితో
యింటికి విచ్చేయుఁ డిప్పుడని
నంటునా(న?) తాను నాఁటఁగఁ జూచిన(ఁ)
గంటివేదనలు ఘనమని ॥ చాలు ॥

అంపెనా మిమ్ము నాతఁడు నావద్ది–
కింపుల నామోహ మెక్కెనని
ముంపునఁ జేసినమొన్నటిచేఁతలు
మంపున నెన్నఁడు మఱవనని ॥ చాలు ॥

వచ్చెనా తాను వాకిటి కిప్పుడె
యిచ్చల నేఁపఁగ నేఁటికని
యిచ్చట శ్రీవేంకటేశుఁడు గూడెను
నిచ్చలుఁ దానే నేనని ॥ చాలు ॥ 369

వరాళి

చిత్తజునిమోహపుశృంగారవనమో యీకె
పొత్తుల వసంతమాడే పురుషునితోడను ॥ పల్లవి ॥

పాయము మోసులువారెఁ బడఁతికుచములను
చాయవలపు కన్నుల జాజుకొనెను

కప్పురపుమాటలను గర్వము వూచె
పుప్పొడి రాలె నెలవిఁ బొలఁతికి సిగ్గులనె
చెప్పరాదు పానుపుపై చెలియభావములు

భావరతి పంటవండె భామినిబింబపుమోవి
కై వశమై రాసికెక్కెఁ గళలెల్లాను
యీవేళ శ్రీవేంకటేశుఁ డింతియుఁ గూడఁగాను
దేవిదేవరవలె దిష్టమాయ నిదివో ॥

శంకరాభరణం

పోవలె మాయింటికి పొద్దున మాకు
ఆవటించివొక్కసారె అడుగరే మాట

పిలిపించెనేఁటికి ప్రియము చెప్పఁగనేర
చెలువుఁడు నన్నునేమి సేయుమనీనే
చలమొక్కటేకాని సాదించ నేనేర
అలరి యింకా నేమి అడుగరే మాట

తానె వచ్చెనేఁటికి తలఁపోఁత నే నెఱుఁగ
పూనిపట్టి నాకు నేమి బుద్ధిచెప్పీనే
మోన మొక్కటేకాని మొఱఁగులు నేనేర
ఆనవెట్టి మీరైనా అడుగరే మాఁట

కాఁగిలించీనేఁటికే కాఁకసేయ నేనేర
యేఁగివచ్చి నామన సేమిచూచీనే

నిలువెల్లా మెఱుఁగులే నీకు మొక్కఁజాలదు

మగువ మాటాడఁబోతే మాణికేలు రాలీని
జగడాలు నీతోను సారె నోపదు
మొగమెత్తి చూడఁబోతే మొల్లలే మిక్కుటమయ్యీ
నగవు లంతేసి నీతో నవ్వఁగనోపదు

అంగన నడవఁగానే అందెలెల్లా మొరసీని
వెంగలిసీవినయాలు వినఁగూడదు
కుంగక కాఁగిటిలోన కుచములే పెరిగీని
చెంగటఁ జేయివట్టినాఁ జెలియ మొగియదు

పొలఁతి నిన్నొరసితే పులకలు రాసివడీ
వాలిసీయు నిందుకేపో వూరకున్నది
అలరి శ్రీవేంకటేశ అంగన నీవు గూడఁగా
నిలిచినపరవశాన నివ్వెరగుఁ బొందెను ॥

రేకు 965 సాళంగం

చెప్పితే నిష్ఠూరము చెలియ నీవారము
[1] రెప్పలసీలోనిచూపే రేసుదెచ్చుఁ జుమ్మీ

కామించి యతఁడు గారవించి పిలువఁగ
యేమన్నాఁ బలుకవు యేలే ఇంత
దీమస మెంత నీకుఁ దీర దెంతైనాఁ బరాకు
వాములై నవలపులు వడ్డివారుఁజుమ్మీ

పెదవు లెత్తవు నీఁ బ్రేమైనాఁ గైకోవు
కదలుఁగుచాలు నీకే కడువాండౌఁ జుమ్మీ

చెంత నిట్టె కూడెను శ్రీవేంకటేశుఁడు
యింతలో మేమఱచేవు యేలే యింత
చింతలెల్లాఁ దీరెను నేసకొప్పు జారెను
పంతములాడఁగఁ బోతే పైవచ్చుఁ జుమ్మీ ॥చె

ఆహిరి

నీకే తెలుసు నిఁక నే మేమీ నెఱఁగము
ఆకెకు నీకే తగును అదివో విన్నపము

యెక్కడి పరాకో యెంత నేము విలిచిన
చెక్కుమీఁదిచేయికాని చిత్తగించదు
నిక్కి నీవు చూచితివి నిన్న మాపటంతనే
అక్కట నేఁ డిట్లాయ నదివో విన్నపము

మందో మంత్రమోకాని మరి బుద్ధిచెప్పినాను
చందము తనదేకాని చాయకు రాదు
అంది విడె మిచ్చితివి అల్లపు డింతికి నీవే
అందువంక నిట్లాయ నదివో విన్నపము

యెంతసంతోసమోకాని యెదిరిఁ చన్నెరఁగదు
కాంతలు కాను కిచ్చినాఁ గైకొనదు
వింతగా శ్రీవేంకటేశ వెలఁదిఁ గూడితి విట్టె

అల్లదె జవ్వని హరియురమున నదె
మెల్లనె యిటు వుపమించరే మీరు ॥ పల్లవి ॥

ముత్తెపుజిప్పలో ముంచినకలువలో
వొత్తిలి కనుఁగవ లొకమాటాడరే
గుత్తపుఁగుండలో కొండలో కుచములో
హత్తి యేర్పడఁగ ననరే మీరు ॥ అల్ల ॥

తామెరతూండ్లో తతియగు తీగెలో
భామచేతు లేర్పరచరే యిపుడు
దోమటిసింహమో తొడఁగినబయలో
ఆమాటాడరే అందులో నొకటి ॥ అల్ల ॥

నీలపుమణులో నిండినమేఘమో
బాలకితురు మొకపలుకునఁ జెప్పరే
యీలీల శ్రీవేంకటేశ్వరుఁ గూడెను
మేలిమిమెఱుఁగో మెలుఁతో యనరే ॥ అల్ల ॥ 375

సామంతం

ఎడసితే నొకగుణ మెదుట నొకగుణము
అడియాలాలెల్లఁ గంటి మౌలేరా మాఁటలు ॥ పల్లవి ॥

నిచ్చలు వద్దనుండేటినెలఁతలపొందుకంటే
వచ్చీరానివనితలవలపు చవి

ఆవలిచేఁదే తరితీపై యుందును
కావించి యరచేతిమాణికమైనా సరకు గాదు
యీవేళఁ గొసరేదా యిఁకనేల మాటలు

కాఁగిటఁ గూడినయట్టికమ్మనిరతులకంటె
మూఁగినభావరతులమోహము బెట్టు
యేఁగివచ్చి శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
మాఁగినపండు చవౌను మరియేల మాఁటలు ॥

దేవగాంధారి

తెలిసినపనులకుఁ బెగ నిన్ను
సొలపుఁ జూపులనె చూచితి నిన్ను

నామతిలో నున్నవి నీవాడఁగ
యేమని కొసరే నిఁక నిన్ను
మోము చూచితే మొగి నిటు నవ్వఁగ
కామించి యలుగఁగఁ గలనా నిన్ను

పిలువకతొల్లే ప్రియమున రాఁగా
వలెనా రమ్మన వడి నిన్ను
పలికినంతనే పంతము లియ్యఁగ
చలములు సాదించఁ జాలము నిన్ను

అంటకతొల్లె అంగము గరఁగఁగ
తంటకమేల యిక్కడ నిన్ను

నిన్ను దూరఁబనిలేదు నీవు మేలే సేసితివి
కన్నెకుఁ గాఁకలు మించెఁ గర్మఫల మిట్టిది

కాంతపైఁ జల్లనిచూపు కడు నీవు చల్లఁగాను
యింతికిఁ జింతలత లిగిరించెను
కొంత నీకృపారసము కొలఁగులై ముంచఁగాను
వింతగాఁ గలువ లట్టె వికసించెను

నెలఁతకుఁ బలుకుఁదేనెలు నీవు చిందఁగాను
అలులు చిందరవందరై మూఁగెను
కలికిపై నీవూర్పుగాలి నేఁడు విసరఁగ
బలిమి జక్కవలకు పంజరము లూడెను

పైపైఁ జెమటయేరు పడఁతిపైఁ బరపఁగ
మోపులై ముత్తెపుసరులు మొలకలొత్తె
యేపున శ్రీవేంకటేశ యీసతి నీవు గూడఁగ
నీపొందుల భ్రమసి నివ్వెరగై నిలిచె ॥నిన

రేకు 966 సామంతం

చాలుఁజాలు నున్నవెల్లాఁ జాలదా యిది
జాలెలా నింకునే పానెఁ జాలదా యిది

గొరబుగా నవ్వితేను కోపగించుకొనక

సన్నలకే వచ్చితివి చాలదా ఇది
నిన్నుఁ దప్పకచూచితే నిలిచి వాదుకు రాక
జన్నెవలపు చల్లితి చాలదా ఇది

తమితో నిన్నుఁ గూడఁగా దప్పులనుఁ బొరలక
సమరతిఁ జొక్కితివి చాలదా ఇది
అమర శ్రీవేంకటేశ అనుమాన మెంచక
జమళిఁ గూచుంటి విట్టె చాలదా యిది ॥ చాల

లలిత

ఇదె వచ్చె రమణుఁడు యెంచినయెన్నికలాయ
మదనమంత్రాలతోడ మాటాడవే

చెక్కుటఁబెట్టినచేయి చిత్తములోనికి నూయి
తక్కినసిగ్గులకెల్లా దండదాయి
చక్కనినీవదనము చందురునిసదనము
మక్కువతోఁ జిన్నఁబోక మాఁటాడవే

ఆరీతి పయ్యదకొంగు యౌవ్వనపాయపురంగు
పోరచి కోరికలెల్లాఁ బొంగేటిపొంగు
సారపు నీకెమోవి చల్లగప్రపుదీవి వే-
మారు దడుపక ఇట్టె మాటాడవే

సగముపీడినకొప్పు సరసమాడేచొప్పు
పగటుభావరతులు పట్టిచ్చేచొప్పు

## కేదారగౌళ

ఎట్టై(ట్టి?)యినా మేలే ఇన్నిటికిఁ దానె గురి
ముట్టినది నాకుఁ దనమోహ మొకటే ॥ పల్లవి ॥

కోపగించి చూచేవి కూరిమి పైఁజల్లేవి
కైపుగా నీతనిరెండుకన్నులే కదే
తీపు గడుఁ బూసేవి తెగి చేఁదు నెరపేవి
మాపుదాఁకా తనతోడిమాటలే కదే ॥ ఎట్టై ॥

అంగపుఁగాఁక రేఁచేవి ఆయములు గరఁచేవి
పొంగారి తాఁ జేసేపొందులే కదే
ముంగిటఁ గడు నవ్వించేవి మోము గడువంపించేవి
చెంగటఁ దాఁజేసినట్టిచేఁతలేకదే ॥ ఎట్టై ॥

మొక్కులు దా మొక్కేవి మొనగోరు మోపేవి
చిక్కనికాఁగిటి తనచేతులేకదే
యిక్కడ శ్రీవేంకటేశుఁ డింతసేసి నన్నుఁ గూడె
ఒక్కె మాకు నిద్దరికి తలపోఁతేకదే ॥ ఎట్టై ॥ 381

## సాళంగం

కామునిబలములెల్ల కొంతమైఁ బొత్తుగలసె
కామినులాల మనసుఁ గతలాయను ॥ పల్లవి ॥

పున్నమచంద్రుఁడు యీపొలఁతినెమ్మోమైతే

మెలుపున నెరిఁదురుము మేఘమాయను
అలరి నునుఁదొడలె అరఁటికంబములైతే
చెలరేఁగి నెన్నడుము సింహమాయను

మగువకంఠము నేఁడు మదనునిశంఖమైతే
జగడించుఁజన్నులే చక్రవాకములాయ
తగు శ్రీవేంకటపతి ధరియించి కూడఁగాను
మిగుల నింతికి మేలుమీఁద మేలే ఆయను ॥కాం

పాడి

నీరు వట్టుక నేయి వోయ నేరనే నేను
సారె నావలపునీరు చల్లుటింతేకాని

ఇట్టె నాలుకలోన బెల్లాలు యెదలోనఁ గత్తులు
నెట్టుకొని నీవలె నేరనే నేను
వట్టిమాటలిగిరించ వంచితేఁ దేనెలుగార
గట్టిగా నాపెదవులఁ గలదింతేకాని

కని యింటికాడ నిడి గానుగకాడా గసి (?)
నినుఁజూచి నేరుచుకొనేరనే నేను
మనసు గరఁగించేది మర్మము భేదించేది
కనుచూపులు నాయందుఁ గల దింతేకాని

అమ్మేది వొకటి అసిమలో దొకటి
నెమ్మది నీయంతేసి నేరనే నేను

వాన గురియక తొల్లె వరదలేల
నానఁబెట్టి కొంతగొంత నంటునేయరాదా

మనసులో నేమిగల్లా మాపటంతఁ జేతుగాక
చెనకి నవ్వు నవ్వితేఁ జెల్లదనేవా
అనువై పంతముగొనేయప్పుడే కొనేవుగాక
మనికిగా నందాఁకా మాటలాడరాదా

వేడుక నేమేనికాఁక వెనకఁ జెప్పేవుగాక
వీడె మందుకొన్నంతనే వెలితయ్యీనా
కూడినరతులవేళఁ గొసరే వింతేకాక
పాడితో మంచముమీఁదఁ బవ్వళించరాదా

తారుకాణించినప్పుడు తలవంచుకొందు గాని
చేరి నీవు కాఁగిలించితే దోసమా
మేరతో శ్రీవేంకటేశ మెచ్చి నన్నుఁ గూడితివి
కారణములేని సిగ్గు కట్టిపెట్టరాదా ॥

రేకు 967 సింధురామక్రియ

ఎచ్చుకుంద లాడకురే యేమీననకురే
కచ్చుపెట్టి యాతనికిఁ గడు నే వలతును

చేసినంతఁ జేయనీరే చెప్పకురే యాసుద్ది
ఆసయి బ్బాతఁ డొకమా టాడితేఁ జాలు

కూడినట్టె కూడనిరె కోపించకురె యాతని—
సిడ కాతఁడు విచ్చేసేయెమ్మెలే చాలు
పాడిపంతా లాడఁబోతే పదను దప్పునో యేమో
మేడెపు సరసపేళ మెచ్చినంతే చాలును

వుండినట్టె వుండనీరే వొరయకురే యాతని—
నండఁ దా నిక్కిచూచిన నదియే చాలు
సందా శ్రీవేంకటాద్రి నిలయుఁడు నన్నుఁ గూడె
కొండుక మేనఁజేసినగురుతే చాలును ॥

శంకరాభరణం

కక్కస మిపుడే కావలెనా
వొక్కించుక వడి వుండఁగరాదా

నేరుపుమాటలు నీకే యమరును
కూరిమిఁ గొసరఁగ గుఱి లేదు
తేరినయప్పుడె తెలిసేఁ(పేఁ?) గానీ
పోరక లోనికిఁ బోరాదా

సెలవులనవ్వులు చెల్లును నీకే
తలపెట్టఁ జలము తఱిగాదు
వలసినయప్పుడె వచ్చేఁ గానీ
పలుమరుఁ బిలువక పదరాదా

తమకించి కలయఁ దగవవు నీకే
ఉమ్మలి వలుక లిఁకఁ జనిరాదు

## నాదరామక్రియ

డిక నీమతికిని వలపు వేఁగా
పీడెఋచ్చి యాతనితో వేసరుకోనేలే ॥ పల్లవి ॥

ికికన్నులకును కాఁకలచూపులు వేఁగా
వాలిసినొల్లక యాల వూరకుండేవే
పలువన్నెనీమోవికి పచ్చిమాటలు వేఁగా
మలసి పతితోనేల మాఁటాడవే ॥ వాడి ॥

తిమీఁదిచెక్కులకు నెలవినవ్వులు వేఁగా
యీతలఁ జింతఁ బొరలనేలే నీకు
కాతరపుమేనికిని కమ్మఁబులకలు వేఁగా
ఘాతలఁ బయ్యదనేల కప్పేవే నీవు ॥ వాడి ॥

ండలకుచములకు గోరిచందురులు వేఁగా
బెండుగాఁ జెలువునితోఁ బెనఁగనేలే
అండనె శ్రీవేంకటేశుఁ డాతఁడె నిన్నుఁగూడెను
నిండుఁగళలతో నీకు నివ్వెరగులేలే ॥ వాడి ॥ 387

## సౌరాష్ట్రం

క్కన నిద్దరుఁ గలయు టివి
మక్కువ మాయెడమాఁట లిఁకేలా ॥ పల్లవి ॥

ాదపువాఁ(ప్రాఁ?)తలు భావపుటేఁతలు

వన్నెలసతికిని వలపునఁటో
సన్నపుఁజెమరులు సరసపుతిమురులు
నిన్ననేఁటనే నీకును గలిగె

పైపైనుసురులు పయ్యదవిసరులు
నీపొందు చెలికి నిలువఁగఁటో
యేపున శ్రీవేంకటేశ్వర నీకును
యాపదఁతికూట మింతలోఁ గలిగె ॥ గలి

తెలుఁగుఁగాంబోది

చెలఁగి నావిభుఁ డింతసేయుమనెనా
చలమరికోరికలు సాదించీఁగాక

మాయదారిమరునేటు మనసులో గుఱి యింతే
కాయముమీఁదికినేల కాఁకరేఁగీనే
పాయపుమోహము లివి బయలీఁదేపను లింతే
ఆయపునిట్టూర్పులేల అలయించీనే

చందురునివెన్నెలలు జగమెఱిఁగిన వింతే
పందెమాడి నన్నునేల భ్రమయించీనే
కుందనికోవిలకూఁత కుత్తికలో పస యింతే
సందడి నాగుండె యేల జాలిరేఁచీనే

పంతపుటీచల్లగాలి పాణముతోలంకె యింతే
వింతలుగా నన్నునేల వేసరించీనే

నలు రెండూ నదపేవే
కుటిలపునవ్వులుఁ గోపముఁ గలదా ॥ పల్లవి ॥

దనకమల మిటు వంచేవేమే
చదురులమాఁటలు చల్లుచును
పెదవులు గదలఁగఁ బిలిచి గొణఁగేవే
చెదరనిపొం దిటు సేయుచును ॥ నట ॥

క్కుచేతితో చింతయిదేమే
వొక్కమంచమున నుండుచును
మొక్కులలోనే ములిగేవేమే
చొక్కులచూపులఁ జూచుచును ॥ నట ॥

తివేళనె యీరాజసమేమే
అతిబాసలు నన్నడుగుచును
యితవుగ శ్రీవేంకటేశుఁడఁ గూడితి
మతకములేలే మైమఱచుచును ॥ నట ॥ 390

168 భైరవి

ం దూరీ నేల పోరీ నితఁడే తాను
వేళతో బుద్ధిచెప్పఁగా వినవైతినా ॥ పల్లవి ॥

త్తి నే నలిగితిఁబో అప్పుడే రమణుఁడు
పొత్తుకు రమ్మనఁగా నేఁ బోనైతినా

నంటుగాఁ దా నవ్వఁగా నే నవ్వనైతినా
కంటకాన నొకతప్పు గలిగెఁబో ఇఁకనైనా
జంటన నన్నుఁ జెనకఁగా సమ్మతించకుంటినా

తతితో సిగ్గున నే తలవంచుకుండితిఁబో
రతులఁ గరఁచఁ గరఁగఁగనైతినా
ఇతవై శ్రీవేంకటేశుఁ డింతసేసి నన్నుఁ గూడె
కతగా, ఇదె తొల్లి కాదంటినా ॥

పళవంజరం

ఒకటి కొకటి గూడ దువిదకడకు నిట్టె
వెకలివిభుఁ జేర విచ్చేయుమనవే

పతియింటికేఁగేటిపడఁతివేగిరానకు
సతిపిరిఁదిభారము సంగరమాయ
మతిలో నాతనిఁ బొందేమచ్చికకోరికలకు
మితిలేనివలపులే మీఁదమీఁదఁ దొడుసు

సొలసి యాతనిఁ జూచేచూపులవాండ్లకు
చెలియానందజలాలు చిట్టంట్లాయ
మలసి యాతనితోడ మాటలాడేయందుకు
నిలువునివ్వెరగులు నేరములై నిలిచె

కమ్మర నాతని రతి కాఁగిలించేయందుకు
కొమ్మకంకణరవాలే కొండెములాయ

ం నుండసీవే తనవలసినయట్టు
నుకులేనిచిత్తడి సిగ్గులేలే ఇఁకను ॥ పల్లవి ॥

దే మాటా ఆతఁడే యెరుఁగును
ండశేనిబుద్ధులు మీరేమిచెప్పేరే
ేడలేనిచిత్తరువు కొలచీ నందే కొలపు
డులేనికట్టు వట్టితగులేలే యిఁకను ॥ తని ॥

నేమసీనే దూరులెల్లా వచ్చె
దమనవే యింకఁ బనిలేదు
ందురులేనిమాట కదురువలెనే వుండు
దవిపై తేనెలప్రియమేలే యిఁకను ॥ తని ॥

టికిఁ దా వచ్చినదే యిన్నిటికీ గురియాయ
ంటలయెడమాటలు చాలుఁజాలునే
ంటిముట్టి శ్రీవేంకటాద్రీశుఁ డిదె కూడి
ంటవెంటఁ దిరిగీని వెరపేలే యిఁకను ॥ తని ॥ 393

మంగళకౌశిక

నే వడియాస లిందాఁకాను
లకించి వున్నదాన నందాఁకాను ॥ పల్లవి ॥

వచ్చి వేగిరాలు వలవనిజాగరాలు
ుచ్చల నదపితిగా యిందాఁకాను

యేఁటవెట్టి నడపితి విందాఁకాను
వాఁటమైన కాఁకలును వట్టి కొమఘాఁకలును
ఆఁటదాన నేఁ బడితి నందాఁకాను

సెలవులనగవులు చే చాఁచి తగవులు
యెలమిఁ జేసితివిగా యిందాఁకాను
చెలఁగి శ్రీవేంకటేశ చెక్కునొక్కి కూడితి నే-
నలవోకతోడ నుంటి నందాఁకాను ॥ ప

ముఖారి

తగిలి నేఁ దడవితేఁ దడవఁగవలెఁ గాక
మిగుల వాసికానికి మేరమీరఁజెల్లునా

చూడకుండఁగానే తాను చూచీ తప్పక నన్ను
యేదాను జగడగాని కింతగలదా
ఆడకుండఁగానే మాటలాడించీ నూరకైన
జాడతో మాసటీనికి చంచలము చెల్లునా

ఇంటికిఁ బోఁకుండఁగ మాఇంటికి వచ్చీఁ దాను
అంటి చలపాదిగాని కది దగునా
అంటుకోకుండఁగ తానే అంటుకొనీ నామేన
దంటపంతగానికి దైన్యమింత చెల్లునా

కాఁగిలించకుండఁగానే కాఁగిలించీ నిదె నన్ను
యేఁగేటియెమ్మెకానికి నిది దగునా

మపున నూరకె నవ్వకురా। నీ
మనసు రానె నే మాటాడేరా ॥ పల్లవి ॥

ముదలిమాఁట నిను మోచివచ్చితే
వదనకమల మిఁక వంచకురా
కొదలు మాని నాకొంగు వట్టితే
పదివేలు దెలిపేఁ బదగదరా ॥ నను ॥

రెకు నీచేఁత సరిగాఁ జూపిన
బీరముతోఁ గోపించకురా
తారుకాణలకు దగ్గరి వచ్చిన
తేరకొనఁగ నిటు తెలిపేరా ॥ నను ॥

లమి కాఁగిటను ఆయము లంటిన
మలసి సొలసి మైమఱవకురా
యెలమిని శ్రీవేంకటేశ కూడితివి
నెలవయి యురమున నిలిచితిరా ॥ నను ॥ 396

969 సామంతం

వేమి సేసినాను నిన్ను నేర మెంచరాదు
మూవంక నానిజానికే మొక్కేఁజుమ్మీ ॥ పల్లవి ॥

వ్నల నీమర్మములు కాఁడిపారఁ జూచితి
వున్నతి నాతప్పు నీవే వోరుచుకొమ్మీ

యీడకైన నన్ను సిగ్గు లంచకుమీ
వాఁటపువినయముగా వలపు లీఁదించితి
మూఁటగా వేవేలకు మొక్కేఁజుమీ

కూడుతానే కాఁగిటిలో కొనగోరు సోఁకించితి
వేడుక నన్ను వెనకవేసుకొమీ
యీడనే శ్రీవేంకటేశ ఇన్నియు నేఁ జేసితి
మోడిసేసి ఇందుకేకా మొక్కేఁజుమీ ॥

దేవగాంధారి

నెలఁతకుఁ జీఁకటి నీకే వెన్నెల
చలువయు వేఁడియు సంగడిఁ గలిగె

వాడినమోమును వంచినశిరసును
యేడఁ గలిగెనో యీచెలికి
పీడెపుమోవియు వేడుకనవ్వులు
నీడనే రమణుఁడ నీకే కలిగె

చెక్కుమీఁదిచేయి చెదరినవెరులును
యెక్కడఁ గలిగెనో యీచెలికి
తక్కినసకళలును తనువుచెమటలును
నిక్కపుదొరపగునీకే కలిగె

తొట్టినతమకము తొడుసగువెరగులు
యెట్టు గలిగెనో యీచెలికి
ఇట్టె శ్రీవేంకటేశ కూడితివి

వుప్పు గప్పురమువలె నుండితేనే ఆయనా ॥పల్లవి॥

కన్నులే తెల్లనగానీ కాయమెల్లా నలుపే
యన్నిటా నన్ను నేరా లెంచవచ్చేవా
చన్నులే ఘనముగాక సరి సానదుము చిన్న
వన్నెల నేనూ నీవంటిదాననా ॥చెప్ప॥

చేతులే నాలుగుగానీ చెలులు పదారువేలు
పోతరించి నీవు నాకు బుద్ధిచెప్పేవా
ఆతల మాఁటలే వాఁడి యధరము మెత్తన
యీతల నీతో నన్ను నీడువెట్టేవా ॥చెప్ప॥

చూడ బాలుఁడవుగానీ సోఁకేది మేను మిన్నంత
కూడేటి నావలపులు గోరనేనేవా
యీడనే శ్రీవేంకటేశ యిట్టె నీతో నేకమైతి
మేదెపురతుల నన్ను మెచ్చకుండేవా ॥చెప్ప॥ 39

మలహరి

కందుఁగుందు నింత గావలెనా
అందరిలోపల నవుననరాదా ॥పల్లవి॥

చేరి నాపొందులు చిత్తము రాకున్న
నారుకొనఁ గొంత నవ్వరాదా
మారుమాటాడఁగ మనసు రాకున్న

చేతగాఁ బైఁ జేయి చాఁచరాదా
యేకడో నీచిత్త మెరవై యుండిన
ఆకుమడి చిచ్చే నందుకొనరాదా ॥

కాఁగిట నీమేను కడుమఱచిన
వేఁగి నాపై మేనువేయరాదా
చేఁగవలపుల శ్రీవేంకటేశ్వర
పాఁగినరతులఁ బంత మీరాదా ॥ కండ

గుజ్జరి

కడదాఁకా నీమేలే కాణాచై వున్నది
అడియాల మిఁక వేరే అరయఁ జోటేదిరా

నించినకూరిమి నాపై నిజముగ నున్నది
మంచినీగుణాలు నామనసులో నున్నవి
అంచెల నీసరసము లంగముపై నున్నవి
కొంచి కొంచి నిన్నింకఁ గొసరఁ జోటేదిరా

చెప్పిపంపిననీరాక చెవులనే వున్నది
రెప్పలెదుట నీరూపు రేపుమాపు నున్నది
చిప్పిలునీమోవితేనె సెలవుల నున్నది
వుప్పతించి నిన్నెంక నొరయఁ జోటేదిరా

కందువ నీమర్మమెల్లా కాఁగిటిలో నున్నది
అంది నీముద్దుటుంగర మదె నావేల నున్నది
ఇందుకే శ్రీవేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి

చింతవంత లికనేల చెలుల దూరఁగనేల
దొంతులరతులే నీకుఁ దోడాయఁగా ॥ పల్లవి ॥

తలఁచఁగానే వచ్చె తనుఁదానే రమణుఁడు
మలసి నీకిఁక మొక్క మనసాయఁగా
అలుక లిన్నియుఁ బాసె నతఁడె నీతో నవ్వె
పలుకుఁబంతము నొక్కపాటాయఁగా ॥ చింత ॥

అనుమానించఁగనే యతఁడు నీచేయి వట్టె
యెనయునీకోరికెల్లా నీడేరెఁగా
చనవెల్లా నీకుఁ జెల్లె సరసుఁడు నిను మెచ్చె
కొనకెక్కినవలపు గురుతాయఁగా ॥ చింత ॥

మొక్కఁగా నాతఁడు నీకు ముందర వరము లిచ్చె
చక్కనై నసకినాలు సరిదాఁకెఁగా
చెక్కులెల్లాఁ జెమరించె శ్రీవేంకటేశుఁడు గూడె
యెక్కువ నీ సంతసము లిరవాయఁగా ॥ చింత ॥ 402

970. సామంతం

మానరా నవ్వు మానరా వద్దు మానరా
మాతో మానరా యేల మానరా। నీవు

వట్టిదోసమేల కట్టేవురా
తేరకొన నన్నుఁ జూచి పట్టి యాస-
దేర నుస్సుర నేఁటికి రా
పోరి పోరి నీవే నిజమరి నంటా
బొంకుచు నన్నేల ముట్టేవురా
కోరి వూరకున్నవారి కింతేసి-
కొడిమె లేఁటికి వచ్చేరా

చక్కనివారికి నీయెదుట నేఁడు
సారె నిలువరాదటరా
వొక్కమాఁటలోనే నీవింత గరఁగి
వొళ్లు చెమరించనేఁటికిరా
చిక్కనిచన్నులు నాకుఁ గలిగితే
చింతఁ బొరలఁగ నీ కేలరా
మొక్కలాన నీవు నేసేరోఁతలకు
మొదలనే నాకు సిగ్గవురా

కారణములేక వూరివారితోడ
కాలుదొక్క నేలవచ్చేవురా
నీరువంక తుంగవంటివాఁడ వింతే
నీతోడిపొందుకు నేనోపరా
కూరిమితోడుత శ్రీవేంకటేశ్వర
కూడితివి నిన్ను నేమందురా

నాదరామక్రియ

ఇటువంటివేడుక లెవ్వరికిఁ గలవమ్మ
తటుకన మఱచేరు తమలోనే మేనులు ॥

కలికి రమణునికిఁ గస్తూరినామము వెట్టి
చెలరేఁగి తాఁ జూపెఁ జెక్కుటద్దాలు
ములువాఁడికొనగోళ్ళ ముంచి కొప్పు దువ్విదువ్వి
తొలసితో మొల్లలట్టే తురిమీఁ జూపులను

పడఁతి విభునిమీఁదఁ బన్నీరు చిలికించి
తడియొత్తీఁ గుచముల తగుపొట్లాల
చిడుముడి సొమ్ములతో సింగారములు సేసి
అడరి నివాళించీ నంగపుఁగాంతులను

సోవగాఁ బీతాంబరము చుంగులువారఁ గట్టి
మోవి యాని తమ్ముల మిమ్ములఁ బెట్టెను
ఆవేళ శ్రీవేంకటేశు నట్టె మోహించి చూచి
తావిమంచానకుఁ దీసి తమకించి కూడెను ॥ ఇటు

ఆహిరి

ఏమి నెఱఁగను నేను ఇఁక నీచిత్తమురా
దోమటివయసు నాపైఁ దోసినట్టె తోయరా ॥

తలఁపెల్లా నీది తమకమే నాది

కేల నాచన్నులు పిసికినట్టే పిసుకరా
ఆలకింపు నీకొరకు అలయిక నాకొరకు
నాలి సేసి నీవు నాతో నవ్వినట్టే నవ్వరా

కాఁగిలిదె నీకు కళదాఁకేది నాకు
మేఁగక నీమోవి నాకు నిచ్చినంతా నియ్యరా
పాఁగిన శ్రీవేంకటేశ పైకొని కూడితినదె
అఁగె నిద్దరిమనసు లంటినట్టె యంటరా ॥

సాళంగం

కానవచ్చె నందులోనె కాదా మఱి
ఆనవెట్టి అడిగీని అట్టె కాదా మఱి

వున్నతి నేమీఁజేయక వుండఁగానేఁ దన్నుఁజూచి
కన్నుల నవ్వితినట కాదా మఱి
చిన్నిచెక్కులమీఁదటిచిఱుఁజెమటలు చూచి
మిన్నక మొక్కితినట మేలుగాదా మఱి

వుమ్మడి నీతనివేలివుంగర మెక్కడిదంటా
కమ్మఱఁ జూచితినట కాదా మఱి
కమ్మినట్టితనమేనికస్తూరివాసనలకు
సమ్మతించనైతినట సటగాదా మఱి

తీపులైనతనమోవి తెగువ చూపితినట
కాఁపురము లెస్సాయ కాదా మఱి

కేదారగౌళ

ఓయమ్మ యేడకేదే వోయమ్మా
యీయెడ మీసాలతేనె యీవలపు

రమ్మని పిలువరాదు రాకుండితేఁ దిట్టరాదు
యెమ్మెలఁ గొండంతదొరే యీవిభుఁడు
నిమ్మటి మెడవట్టదు పెట్టరాదు ముక్కునాకు
గుమ్మడికాయంతము త్తెమే యీకూటమి

పూస వేఁగిరించరాదు బొంకితే నలుగరాదు
యీనెలఁత లెందరైనా నీతనికి
తానూఁ జేతికి నీఁడు దగ్గరి తీసుకోరాదు
యేనుగచేతిచెఱకే యీమోహము

ముంచి చేయి చాఁచరాదు మొనగోరు మోపరాదు
మించిన శ్రీవేంకటాద్రిమేఁటి యీతఁడు
కంచపుమో విచ్చి కూడె కమ్మఁదమకాలు రేఁచె
యెంచఁగఁ జుక్కలలెక్కే యీమరులు ॥ 

దేసాళం

ఇద్దరిచలముఁ జెల్లె నిదే మేలు
వద్దువద్దు నాతోడి పట్టినవ్వ లేఁటికి

వేడుకలేనిపనికి వేసరివుండుటే మేలు

చనవులనిచ్చేటికె చేయిపట్టే మేలు
పెనఁగినా రాకుంటే బిగువే మేలు
మనసురానియందుకు మఱి మఱచుటే మేలు
వెనకఁ జెప్పేఁగాని విడవయ్య కొంగు

వొలసీనొల్లనిపొందు పూరకైనపాటే మేలు
కలసినరతులకుఁ గలంతే మేలు
అలయించి శ్రీవేంకటాధిప కూడితి నన్ను
వులివచ్చికాఁగిలేల వుండవయ్య యీడనే

రామక్రియ

చేతికిఁ గొంత చేరనీవే
ఘాతలఁ దనమేను కరఁగించేఁగాని

రానీవే వాని రవ్వసేయక
ఆనిపట్టి నేనే అడిగేను
పూని తొలుతనంటే బొంకీని
నానినకాఁగిట నవ్వించేఁగాని

తిరుగనీవే వానిఁ దెగనాడక
మరిగించే నేనే మాఁటలను
తరవాత నేమనినాఁ దలవంచీని
మరుతంత్రములన్ని మరి నేనేఁగాని

వుండనీవే వానినొకటాడక
అండనే రతికేలి నలయించేను

ముఖారి

ారె సారె మీరేల సందడిఁ బెట్టేరే
మారునిమాయలు నేఁడు మందులఁ బొయ్యీనా ॥పల్లవి॥

లపు వెంచఁగఁబోతే వంతులకుఁ జవులవునా
అలవానిపొందు మానుమని యేల చెప్పేరే
తలఁ పాతనిమీఁదటఁ దనువు యీడనే యింతే
యెలమి మీరేమన్నా నిఁక మానఁబొయ్యేనా ॥సారె॥

నసునఁ బాలు దాగ మఱి కడుపు నిండునా
పొనిగేల యెడమాటఁ బొడ్డవుచ్చేరే
కనుచూ పాతనిమీఁద కాఁక లివె నామీఁద
వెనక మీరేమన్నా వినఁబొయ్యేనా ॥సారె॥

ాటలు వినుకఁబోతే మాపుదాఁకా మెత్తనౌనా
పూఁట పూఁట నాకేల బుద్ధిచెప్పేరే
యీటులేని శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
మేటుల నేఁ డిఁకనేల మీరే నేఁగానా ॥సారె॥ 410

పాడి

మ్మనవే చెలువుని రవ్వ మమ్ముఁ జేయనేల
తమ్మిపువ్వులవాట్లు దాఁకుదాఁకౌనా ॥పల్లవి॥

క్కనఁ జూచినంతనే కన్నులనే పెండ్లాయ

వలిపెపుతెరమాటు వడి నింకానా
బొలపులమూటలనే పోటాన పాటలాయ
చలివాసె పేరటాండ్ల సంద డింకానా

పైనొరగినప్పుడే పరవనిపరపాయ
నానఁబెట్టి నాగవల్లినాఁటిదాఁకానా
అనుక శ్రీవేంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె
మేనిలోనిసంతసాలు మెచ్చుదాఁకానా ॥ ర

వరాళి

నేరుపరి వొద్దువే నీడకు రావే। నాకుఁ
దారుకాణలాయ నిఁక తప్పులేలే

కిన్నెరమీట్లలోని గిలిగింతలూ నీ—
సన్నలచాయలలోని చలివేండ్లు
వన్నెలకాఁకలమేనివసివాడులూ నే—
మిన్నిటికి లోనైతి మిఁకనేలే పనులు

జంకెనచూపులలోని సరిబేసులూ నీ—
తెంకులమాటలలోని తెల్లనల్లలు
కంకిసగవులలోనికాయపండ్లు
మంకు లిన్నిటాఁ బడితి మరియేలే కతలు

అచ్చుపుసిగ్గులలోని అంగభంగాలూ నీ—
అచ్చుపడ్డకాఁగిటిలో నరమఱుఁగూ

పంతము పాడియు నీభావములోనే కంటి
యెంత(ప్రియముచెప్పినా నిది మెచ్చుగాదురా

చిత్తములో తమకము చెమటలఁ గంటి
కొత్తకొత్తనీపొందులు కొప్పుపువ్వులనే కంటి
తత్తరపునీగుణాలు తనుపులకలఁ గంటి
రుత్తమాట లేమన్నా రుచిగావు మానరా

కాఁకల నీవసివాడు కనుచూపులనే కంటి
వేఁకపునీయలపెల్లా వెడనిట్టూర్పులఁ గంటి
సోఁకుల నీవేడుకలు సొంపుఁగళలనే కంటి
వూఁకొనేఁగాని నీసుద్దు లొడఁబాటు గావురా

నాటకపునీవిద్దె నగవులలోఁ గంటి
గాఁటపునీవలపెల్లా కాఁగిటిలోనే కంటి
పాటించి శ్రీవేంకటేశ పైకొని నన్నుఁ గూడితి-
విటు రాఁ దొల్లిటివలె నిందులోఁ జెల్లదురా ॥ప

రేకు 972 బౌళి

నేనే యందుకు రానటా
పోసిపోసీ యింతసేసి పట్టిపొందులనే నిందవేసితి
అట్టేకానీకానీ శ్రీవేంకటరాయా

చెలులతో నిన్నమాపే చెప్పిపంపనా నీకు

యిప్పుడే చన్నువట్టేవు యేమిరా నీవే
నేమురా బలిమేలరా శ్రీవేంకటరాయా ॥ నేనే

నిచ్చలు మాచన వొలినిలయా నేఁ గోరఁగానే
మెచ్చుగా నన్నుఁగూడి మేలమాడితి। మేలుమేలురా
శ్రీవేంకటరాయా ॥ నేనే ॥ 4

ఆహిరి

కోపగించుకొన నోప గొరబూ నోప
తీపులమీఁదటియెత్తు తెలిసేఁగాని ॥ పల్లవి

చెలుల దూరగనోప చిల్లరవాదుల కోప
చలపట్టి పతితోడ జంకించనోప
అలిగి పానుపుమీఁద నవ్వలిమోమై యుండఁగఁ
గలిగినపాటే మేలు కనుకొనేఁగాని ॥ కోప

దైవము దూరఁగ నోప తమకించి పడనోప
మోవనాడేపెంగెములు మొదల నోప
చేవదేరేచింతతోడ చెక్కుచేత నుండఁగాను
కావలసినపనులు కనుకొనేఁగాని ॥ కోప

పంతములియ్యఁగ నోప బచ్చెనమాటల కోప
వంతువాసులకు నోప వరుస లోప

వద్దువద్దు చేసేమీ వేవేగ మేము నేము
అద్దో తొలఁగుబావ వంటుకోకువయ్యా ॥పల్లవి

యేమి నేసేవోయంటా నిటు నన్నుఁ జూడనంపె
దీమసపునీతలఁపు తెలియ నంపె
వాములైన నీలోనివలపులు రేఁచఁగ నంపె
కామించి నీవేల నన్నుఁ గాఁగిలించేవయ్యా ॥వద్దు

ఇందుకే విచ్చేనేవంటా నెదురుగా నన్నంపె
కందువ నీనేరుపెల్లాఁ గనుకో నంపె
చందమామగుటుకలు చవులుచూడఁగ నంపె
యిందులోనే నీవు నాతో నేల నవ్వేవయ్యా ॥వద్దు

చేరువకు వచ్చి నిన్నుఁ జెలి యచ్చరించ నంపె
టీరాన నాచేత నిన్నుఁ బిలువ నంపె
యీరీతి శ్రీవేంకటేశ యీడ నన్నుఁ గూడి యాకెఁ
గూరిమిఁ గూడితి విట్టె కొత్త యేఁటిదయ్యా ॥వద్దు॥ 4

భైరవి

ఎంత నమ్మనిదానవు యేమే నీవు
చింతతోఁ బగచాటేవు చెల్లఁబో నీవు ॥పల్లవి

జమళిమోహాలు మనసరుసనే వుండఁగాను
తమకించి మాటలాడఁ దగవా నీవు
చెమటకౌఁగిలి మనచేతులలో వుండఁగాను

యేఁటికిఁ గొసరఁజొచ్చే వేమే నీవు
కూటములు చెక్కులపై గుఱుతులై వుండఁగాను
పాటించి యేడవోయంటా భ్రమసేవే నీవు

బచ్చనరతులు మనసానుపుపై నుండఁగాను
ఇచ్చగించి మఱచేవు యేమే నీవు
పచ్చిగా శ్రీవేంకటాద్రిపతి నేఁ గూడితి నిన్ను
మెచ్చితి మొకరొకరి మేలే నీవు ॥ ఎ

పాడి

ఊరకుండేవో లేదో వోసి చెంచెతా। వోరి
కోరి నిన్ను నెంచుకొంటి గొల్లఁడవుగదరా

జమళిపికిలిదండ సరి నీకేలే
నెమలిచుంగులపాగా నీకేలరా
అమరెనే సంకుఁగడె మందుకుఁ దోడు
భ్రమసి నీవేల గుల్ల పట్టుకున్నాఁడవురా

పలుమేకాలవెంటను పారేవేలే। నీవు
యెలమిఁ బులుగునేల యెక్కితివిరా
పలచనిపారెటాకుపయ్యే దేఁటికే
అల మట్టేకుపానుపు అది నీకు నేలరా

కాకిపైఁడిబొట్టు నీకుఁ గడుప్రియమా
ఆకుఁదొలసివంత నీకది బాఁతా

అదె నదె నదెవొ విభుఁడు
వేడుకలు రేఁచీ వింటి నేననవే

కానీకానీ కసుగాటుమాఁటలు
నానఁబెట్టీని నాతోను
రానీపోనీ రాజస మేఁ(మెం?)తైనా
మానఁ దెంతయినా మఱవకుమనవే

మేలుమేలు మేనరికమే నాకుఁ
జాలాఁ గట్టెను సరసానను
మూలమూలా ముసిముసినవ్వులు
చాలుకొనెనట సరిదాఁకెననవే

నవ్వీ నవ్వీ నను శ్రీవేంకటపతి
జవ్వనము రేఁచి సరిఁగూడెను
దవ్వులటు మాని దగ్గరి నావద్దఁ
బవ్వళించెను పదరకుమనవే

రేకు 973 లలిత

పిడెపుఁబెడవితోడి విట్లలేశుఁడు
వేడుకలే పచరించీ విట్లలేశుఁడు

నిలుచున్నాఁ దలవాఁడు నిక్కి నామోము చూచి
వెలుపల సన్న సేసె విట్లలేశుఁడు
వెలుపల నవ్వీ వెలితోఁ మాట్లాడి

విన్నపము లడిగీని విట్ఠలేశుఁడు
తన్నుఁదానె విఱ్ఱవీఁగి తనమీఁద నానవెట్టీ
వెన్నదిన్ననోరితోడి విట్ఠలేశుఁడు ॥పీడె॥

బడిబడినే వచ్చి పైకొని నన్నుఁగూడి
విడువఁడు నాచెఱఁగు విట్ఠలేశుఁడు
కడుఁగడుఁ దమకించీ కప్పురమే చేతికిచ్చి
వెడఁగు శ్రీవేంకటాద్రివిటలేశుఁడు ॥పీడె॥ 420

## వసంతవరాళి

చెప్పితే[1] నారచికత చెప్పకుండితే వెత
దప్పికి నీరే మందు తలపోయఁగదరే ॥పల్లవి॥

చిగురులోపలిచేఁగ చెప్పరే మీరు
నిగురులోపలి నిప్పు నిలుపరాదె
పగలు చీఁకటి గమ్మి పాయ దెంతైనా
తెగరానిచోట తరితీపులమందేదే ॥చెప్పి॥

ఆకాశపంచాంగము అందుకఁ బేరేదే (?)
రాకపోకజగడము రాఁజీనదే
వాకునిష్ఠూరాలు వచ్చి వసముగా దెంతయినా
యేకచిత్తమైనమందు యెన్నఁ డిచ్చేరే ॥చెప్పి॥

వానలేనిచిత్తడికి వైపు లిఁకఁ జూచుకోరే
కానరానిగుఱుతులు కాఁడిపారెనే
అనుక శ్రీవేంకటేశుఁ డంతలో విచ్చేసి కూడె

చేసేనావినయములు చేకొంట గాక
ఆసలే కాఁకరేఁచితే అందుకేమి సేతమే

చెక్కు నొక్కఁబోఁగాను చేతిగోరు దాఁకె నింతే
వెక్కసాన విదిలించివేసేవేమే
పక్కన విందువెట్టి పలురుచులు సేయఁగా-
నక్కడాఁ గరఁగదు అందుకేమి సేతమే

సరసమాడఁబోఁగా చన్నులు బయటఁబడె
యిరవై యిందుకేల యీసడించేవే
గరిమ సొమ్ములు నీకుఁ గడుఁగడుఁ బెట్టఁగాను
అరగొరవెతయైతే నందుకేమి సేతమే

పొంది కొంగువట్టఁ బోఁగా పోఁకముడి వీడె నింతే
చిందువందై ఇందుకేల సిగ్గువడేవే
కందువ శ్రీవేంకటాద్రిఘనుఁడ నేఁ గలసితి
అందపుటాయాలు సోఁకె నందుకేమి సేతమే ॥ చే

దేసాళం

ఊరకే గడించుకొనీ నొకటొకటే తాను
రారమ్మని పిలువఁగ రానైతినా

పట్టినచలముతోడఁ బదరవద్దంటిఁ గాక
యిట్టె మోవి యడిగితే నియ్యనంటినా

చెల్లఁబోఁ తాఁ జెప్పినట్టు వేయనైతినా
వొల్లకొల్లకుండఁగానే వొడఁబడనైతిఁ గాక
తొల్లింటివలెనే అఱతే తుదకెక్కనా

పయ్యెదకొంగు దియ్యఁగా బలిమిచూపితిఁ గాక
వొయ్యనే రతులకు నోపనంటినా
యియ్యెడ శ్రీవేంకటేశుఁ డింత సేసి కూడెఁ గాక
నెయ్యమున నపుడే ఖేఁ దసుఁ బిలువనా ॥ ఊ

సౌరాష్ట్రం

తనజాడ లేలమాను తానే తాను
ననిచియున్నాఁడే నాకు నాటకీఁడే తాను ॥

రాతిరెల్లా వద్దనుండె రవ్వగా నవ్వుచునుండె
ఆతల నప్పుడే మాటలాడీనే తాను
చేతికిలోనాయనంటా సేస నాపైఁ బెట్టెనంటా
కాఁతరించి వుండఁగాను కాఁకచల్లీఁ దాను

కొప్పు కొనగోర దువ్వె కూరిమితో బుజ్జగించె–
అప్పుడే పరాకయ్యీ నదేమే తాను
కప్పుర మిచ్చినందుకు కాంతలు చెప్పినందుకు
నెప్పున నేఁ జెనకఁగ నిద్దిరించీఁ దాను

కాఁగిట నిట్టే కూడె కడునలయుచు వాడె
మూఁగినమోహాన నాకు మొక్కీనే తాను

గుండక్రియ

సిగ్గులు సింగారాలు చెల్లునే నీకు
నిగ్గులు నీతలు మాతో నెరపఁగఁజెల్లునే ॥ పల్లవి

వుక్కున నీరమణుఁడువొత్తినరేకలు దాఁచ
చెక్కుమీఁదిచేయి నీకు చెల్లునే నేఁడు
పెక్కుటధరపానపుపెదవిచొప్పులు మాప
ముక్కుమీఁదివేలు నేఁడు మోప నీకుఁ జెల్లునే ॥ సిగ్గు

పొంది నీమేనిమీఁది పులకలన్నియు దాఁచ
చెందినపయ్యదకప్పు చెల్లునే నీకు
కందువ నీసమరతి కళలు మొరఁగుటకు
చిందేముసిముసినవ్వు చెల్లునే నీకు ॥ సిగ్గు

అంగపుకాఁగిటిలోనిఅలపు లన్నియు దాఁచ
సింగారపుతోఁట కేఁగఁజెల్లునే నీకు
రంగగు శ్రీవేంకటాద్రిరాయఁడు నిన్నుఁ గూడె
ముంగురులు జారినవి ముడువఁగఁజెల్లునే ॥ సిగ్గు ॥ 4

ు 974 ముఖారి

కానీకానీ ఇప్పుడేల కడుఁబంతాలు
తాను నేనుఁ గూడితేఁగా తలపోఁతలు ॥ పల్లవి

చెక్కుచెక్కుఁ గదియించి చేయిఁజేయి బిగియించి

పాదుకొన్నప్పుడుగా నాబలిమెల్లాను
పోదిగాఁ జన్నులు మోపి పులకలు మేన రేఁచి
ఆదెస నింతేకా నెయ్యపునవ్వులు

కాయముఁ గాయము మోపి కమ్మరనే మోవి ఇచ్చి
యీయెడ నింతేకా నాఇంపుసొంపులు
పాయపు శ్రీవేంకటాద్రిపతి నన్ను నిదె కూడె
చాయల నీమీఁదఁగా నాసరసములు ॥ కా

సామంతం

చెయ్యి ముంచినవానికి చెప్పితే రోఁత
తియ్యనినోరఁ జేఁదు తెగి నంజేనా ॥

కూర వండి కస వేరఁగూడదు నాకు నయితే
యేరా నిన్నుఁగూడి యింకా నెగ్గుపట్టేనా
నీరువంకతుంగవంటినిమన నెందుండినాను
ఆరయఁగ నేనింక నడ్డపెట్టేనా ॥

గోడఁబూసినసున్నము కూడపెట్ట నేరనోప
ఆడుకోలు మాటదప్పెనని యెంచేనా
జీడిపంటిగింజ[1]వంటి చెంగియుండె నీగుణము
కోడెమాఁనికత్తికి గురిసేసేనా ॥

వెన్నచేతఁబట్టి నేయి వెదక నేఁ జాలఁగాక
నన్ను నీవు గూడుండఁగ నవ్వకుండేనా
ఇన్నిటాను శ్రీవేంకటేశ నీకు నాకు నొక్క

రెప్పలెత్తి చూడఁగానే రేసు లింకా నేలరా ॥ పల్లవి

వచ్చి వచ్చి మామీఁద వలపే చల్లేవుగాని
చొచ్చి నారతిఁ జెనకి చూడవేలరా
మచ్చికల నాలోనిమనసే చూచేవుగాని
ముచ్చట నీతేనెగారేమోవి ఇయ్యవేలరా ॥ అప్పు ॥

మాటకు మునుపనే మందులు నూరేవుగాని
గాఁటపుగుబ్బలకు దగ్గరవేలరా
చీటికిమాటికి నాతో సిగ్గులే పడేవుగాని
నాటనిసెలవులను నవ్వ వింక నేలరా ॥ అప్పు ॥

చల్లనికాఁగిటిలోన చవులే చెప్పేవుగాని
అల్లిబిల్లి తగుఁదగదన వేలరా
మెల్లగా శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
బల్లిదుఁడు నిమిషముఁ బాయ వింక నేలరా అప్పు 42

సామంతం

ఇంత నీకు వెఱపేల ఇద్దరిఁ గన్నులఁ గంటి
యెంతైనా నీహితవే ఇటు నాహితవురా ॥ పల్లవి

యెవ్వతెకు నీవు మోహించి వుండినాను
నివ్వటిల్ల నాకె నాకు నీమానే
జవ్వనియెవ్వతెతోడ సారె నీవు నవ్వినాను

[illegible]
ముద్దుల నవి నాతోడి ముచ్చటలురా
గద్దించి యెవ్వతె నిన్నుఁ గాగిలించుకొన్నాను
కొద్దిమీరినట్టివే నాకూటములురా ॥

చెక్కునొక్కి యెవ్వతైనాఁ జేఁత నిన్నుఁ జేసినాను
అక్కరతో నాచేఁత లవియెల్లారా
ఇక్కువతో శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
నిక్కముగ వారెల్లా నే నొకతెనేరా ॥ఇంత

శంకరాభరణం

సరిమోహా లిద్దరికి సాటికిఁ బెనఁగఁ జొచ్చె
వరుసతో జవ్వనము వావెరుఁగునా ॥

పొంచి నీతో నవ్వఁబోతే బోఁకముడి నాకు జారి
నించి యంతలోఁ జెమట నీకుఁ గారీని
పంచలఁ జెలులివి చూచి పకపక నవ్వేరు
చించుకొని వలపులు నెగ్గెరుఁగునా

మాట నీతో నాడఁబోతే మర్మములు గరఁగె నాకు
గాఁటమై నీ కంతలోనే గరుపారెను
తేటతెల్లమాయనంటా తెఱవ లాడుకొనేరు
వాఁటమైన మనసిది వావెఱుఁగునా

కాఁగిట నిన్నుఁ గూడఁగా కళదాఁకె నాకు నేఁడు
మూఁగినపరవశాలు ముంచె నీకును

కై కొనఁగవచ్చుఁగాని కడమపెట్టఁగరాదు
　　దీకొని యిన్నియుఁ దానే తెలుసుకొమ్మనవే　　॥ పల్ల॥

పొందుసేయఁగవచ్చుఁగాని పురివిచ్చి పాయరాదు
　　అందునుండే యెడమాట లాడుటే చాలు
　　అంది నవ్వవచ్చుఁగాని ఆఁపరాదు తమకము
　　చందమామగుటుకలే చాలుఁజాలుననవే　　॥ కై కొ॥

కన్నులఁ జూడఁగవచ్చు కాఁకలఁ బొరలరాదు
　　విన్న వినుకులలోనివేడుకే చాలు
　　మన్ననఁ బొందఁగవచ్చు మరితీలుపడరాదు
　　సన్నలచాయలనుంటే జాణతనమనవే　　॥ కై కొ॥

చిత్త మియ్యఁగవచ్చుఁగాని సిగ్గునఁ బడఁగరాదు
　　పొత్తులవలపుతోడిభోగమే చాలు
　　యిత్తల శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
　　కొత్తలాయ నిన్నియును గుఱుతాయననవే　　॥ కై కొ॥ 4

కు 975　　　　భైరవి

నీవుఁ బోయి వెదకరా నిలుచుండనేల యీడ
　　తేవల నామాట గల్లైతే మఱిరారా　　॥ పల్ల॥

చెప్పేరా నీకొకసుద్ది చెవులపండుగఁగాను

గచ్చుల నీపేరఁ గమ్మ గట్టిపోయను
మెచ్చులనీమాణికాలమేడపై నెక్కున్నదో
ముచ్చటసింగారవనములోన నున్నదో

అంటెరా పాదములు ఆకె నీవురముమీఁద
పొంటులు సోదించ వచ్చి చొచ్చేనంటాను
నంటుసేసి యప్పటిని నన్నుఁ గూడితివి నేఁడు
దంటవు శ్రీవేంకటేశ తా నిన్ను నేమన్నదో ॥నీ

పాడి

[1] ఒకటొకటికి మాట వానగూడెనే
వొకటి కినుమడౌరా వుప్పొలికితేను

మఱచితినే నేను మంచినీమాటలకే
మఱవక దోయపగా మముబోఁటికి
కరఁగెనే నామనసు కాయము నిన్నుసోఁకితే
కరఁగఁ గరఁగ వన్నె కనకమౌఁ గదరా

విడువఁజుమ్మీ నీవేడుకపొందు
విడువ ముడువ నేమి విసమా ఇది
కడిగినట్టు చెమట గారె నామేను
కడుగఁ గడుగ రొంపి కడచోట నీకు

చిగిరించెఁ బులకలు చెక్కుల నాకు
చిగురుఁగొమ్మ చేఁగె చెప్పితే నిన్ను
తగిలితి శ్రీవేంకటోత్తముఁడ నిన్ను

మించి యెప్పుడును నేము మీవారమే
కంచపుపొత్తు గలసి కసిగాటులేఁటికే

చిక్కనివెన్నెలతేట చిందీ నెలవులను
చెక్కుమీఁది చేయేల చెలియ నీకు
మొక్కళపుఁదుమ్మిదలు మూఁగీఁ గన్నులతుద
ముక్కునఁ గోపములేలే ముట్టినంతలోననే

పూఁపలుఁ బిందెలు నట్టెపొదమెఁ బయ్యదలోన
కైపునేసీ నీనడుమఁ గరవేఁటికే
పైపైఁ బదారువన్నెపసిఁడిపొడి రాలీని
కోపపుగుంపెనలేలే కొంగు వట్టితేను

నిలువు నూరఁ బండీని నిచ్చలు నీసింగారాలు
తలకొన సిగ్గులలో దాఁగేవేలే
యెలమితో శ్రీవేంకటేశుఁడ కూడితి నిన్ను-
నలివేణి మఱపేలే ఆయ మంటితేను ॥ మి

లలిత

పెళ్ళిచెట్టు మందుగాదు పెద్దకొండ లెక్కి తెచ్చే-
నెల్లిచెట్టు చవిగాక నేమేల నీకు

చెచ్చెరఁ బోరువెట్టినసితకమ్మ వుండఁగాను
నిచ్చలుఁ బ్రియముచెప్పేవేమేల నీకు

పట్టితెచ్చినచెలియ [illegible] యుండఁగాను
[1]నిట్టిపిడిమేనదాన నేనేల నీకు
గుట్టున వెలవెట్టనిగోపసతు లుండఁగాను
నెట్టన వుంకువగొన్న నేమేల నీకు ॥ పెళ్ళి ॥

బూతుమాటలకుఁ జిక్కి పురసతు లుండఁగాను
నీతితో బుద్ధులుచెప్పేనేమేల నీకు
యీతల శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
నీతోఁ గాదనఁబోతే నేమేల నీకు ॥ పెళ్ళి ॥ 435

పళవంజరం

ఏలే నిష్ఠూరము లింత యేమిగట్టుకొంటి విందు
గాలిఁబోయేవాసనలు గంటుగట్టె నందురా ॥ పల్లవి ॥

అన్నువ నీమోము చూపి అంతలోనే దాఁచేవేమే
పున్నమచందురుఁడైనా పోదొకరాత్రి
తిన్ననిగుబ్బలకు నాదిష్టి దాఁకెనంటాఁ గప్పి
యెన్నఁగ దిక్కులఁ గొండ కెండదాఁకీ నందురా ॥ ఏలే ॥

నవ్వునవ్వి కొంతగొంత నాతో దాఁచే విదియేమే
పువ్వువంటివెన్నెలైనాఁ బోదొకవేళ
జవ్వనముపైరు విత్తి చాఁచి చేయిదీసేవేమే
మవ్వానఁ బారిననీరు మగుడించే నందురా ॥ ఏలే ॥

కోరి నాతో వచ్చేనని కొంకి ఇట్టే బొంకితివి
ఆరునెల్లుఁ గోయిలకూఁతైన నిజము
వేరులేక శ్రీవేంకటవిభుఁడ నేఁ గూడితిని

చేతికిలోనైనపతిఁ జేకొందుఁగాక
ఆతలివారిమాటల కానవెట్టనేలే

అంది మాటాడకతొల్లె అవుఁగాములు చెల్లుఁగాక
అందముగాఁ గూడి విడనాడఁగనేలే
పందెములాడకతొల్లే బలుములు చెల్లుఁగాక
నిందమోపి యాతనినే నేరమెంచనేలే

చేయిమోపకతొలుతే సిగ్గువడఁ జెల్లుఁగాక
కాయము లంటినమీఁదఁ గడమలేలే
రాయడి దవ్వులనుండే రాజసాలు చెల్లుఁగాక
యీయెడ మోమోము చూచి యెడమాఁటలేలే

కొత్తవలపులకెల్ల గురుతులు చెల్లుఁగాక
హత్తి ననుపైనమీఁద నాసుద్దులేలే
యెత్తుక శ్రీవేంకటేశుఁ డింతచేసి నిన్నుఁ గూడె
బొత్తుగూడినమీఁదట బొరపొచ్చమేలే

రేకు 976 కన్నడగౌళ

ఇంకనేల మారుమాట లింతితోను
లంకె చేసుకొనె చెలి లావులకే పెనఁగి

మాటలతేనెలతీపు మరిగి । నిన్నుఁ
గాటుక కన్నులఁ జూచీ కలికి

హత్తి చేతులెత్తి మొక్కి నతివ
వొత్తినసీకొనగోరి కులికి
గుత్తపు నీకొంగువట్టి కొంత గొంత కరఁగి

తెల్లమి నీరతులెల్లాఁ దెలిసి
వుల్లము నీకొప్పగించె నువిద
కొల్లగా శ్రీవేంకటేశ కూడితివి యీకె
పల్లదాన నిన్నుఁ గూడె బాసగొనెఁ గొసరి ॥౩

సామంతం

తనకే సంతోసమైతే దప్పితో నేనుండరాదా
పొనిఁగి యెట్టుంటిమేమి పొమ్మనరాదా

రాకుండేఁ దా మానెఁగాక రతిరాజుయేట్లకు
చేకొని మలుగరాదా సిగ్గుతో నేము
ఆకెకే మోహించుఁగాక ఆపసోపపుఁదాపాన
చీకాకుపడి నాలోఁ జిన్నఁబోరాదా

పవ్వళించుఁగాక తాను పంచపనే కాచుకుండి
అవ్వల నాలో నుస్సురనఁగరాదా
దవ్వులైతే నాయఁగాక తలఁపులో తన్నుఁ జూచి
పువ్వువంటికోరికతో పొద్దుగడపరాదా

పరాకైతే నాయఁగాక పట్టి తనకాఁగిటిలో
సరాగానఁ గూరిములు చల్లఁగరాదా

మిక్కిలిపంతాలు నేఁడు మీతోనేలే
పక్కనఁ బైఁడమ్మలిడఁ బారవేయవలెనా ॥

ఆయతేరే యెడమాట లఁ(లం?)దరికిఁ జెప్పనోప
చేయిముం చాతనిఁ గంటేఁ జెప్పేలేరే
పేయకురే వాల నాపై వెన్నెలగలప్పుడే
ఆయెడ నల్లునేరేళ్ళనుట యెఱఁగరా ॥

ఏంటిలేరే మీమాట వీనులు చొరవు నాకు
అంటిముట్టి పతిఁ గంటే నడిగేఁ బోరే
కంటకము లాడకురే గాలిగలయప్పుడే
తొంటిబాస వెళ్ళనాడి తూరుపెత్తే నిఁకను ॥

వచ్చిఁ బిలువకురే వడి నిట్టె విచ్చేసితేఁ
గొచ్చి శ్రీవేంకటపతిఁ గూడే నేను
విచ్చనవిడినే యేళ్ళవెనకవే చాళ్ళవుత
తచ్చితచ్చి కాఁగిటిలోఁ దారుకాణ లాయను ॥ మిక్కి

ఆహిరి

శిరసుండ మోకాల శేస యేఁటికి
సరసము లాకెపైనే చల్లరాదా నీవు ॥

ఆకెతో మారుత్తరము లాడరాదా విచ్చేసి
పైకొని పుమ్మె వాడఁబరచే వీడ

సంగతిగానిమాతోడి[1] జాణతనా లేమిటికి
కంగువాయఁ జెలితోనే కడునవ్వరాదా

నొక్కమారే ఆకెమీఁద నొరగుకొనఁగరాదా
వెక్కసాన మాపైఁ జేయివేయ నేఁటికి
ఇక్కువ శ్రీవేంకటేశ ఇంతి నేఁడు గూడితివి
పక్కన నెన్నఁడు నింకఁ బాయకుండరాదా ॥ శ

శ్రీరాగం

నాకుఁ జేసినదియెల్లా నడుమ నీదేకాదా
దాకొని యిన్నియును నేఁడు తారుకాణలాయఁగా

కందువ నీవిరహాగ్నిఁ గాఁగినట్టినామేను
యిందు నీకాఁగిటికి నెక్కెఁగా నేఁడు
అంది కడువేఁడిగాఁగా నలిగి చూచినచూపు
సందడినీకూటములో చల్లువెదలాయఁగా

తెగి నీతో వాదడచి తిట్టుకొన్నయీనోరే
నగి నీతో మాటలాడ ననుపాయఁగా
చిగురుచింతలచేఁ జెక్కుచేరిచినచేయి
పగటున నేఁడు చెట్టపట్టఁగఁ బాలాయఁగా

వడి నీవు పిలువఁగ వంచినట్టియీశిరసు
అదరుమోవితేనియ లంది ఇచ్చెఁగా
మొదలేక శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
విడువనిసిగ్గులెల్లా విడిపించితివిగా ॥ నా

ఏల రేఁచీ నన్ను నింత యేమనినా వెగటౌను
గాలి మూటగట్టఁబోతే కడునవ్వుఁబాట్లు

మారుమాట లాడఁబోతే మనసునొచ్చీఁ దనకు
కేరికేరి నవ్వఁబోతే కేరడమౌను
తారుకాణించఁగఁబోతే తనకుఁ గొరఁతవచ్చు
నేరనైతి నాఁడే నాఁడే నిజము నిష్ఠూరము

కనుఁగవ నవ్వఁబోతే కడువెంగెమౌఁ దనకు
కొనగోర నంటఁబోతే కోపమునౌను
చనవునఁ దిట్టఁబోతే జగడాలు ముమురును
వినకున్నాఁ జెప్పఁబోతే విందువెట్టీఁ బగలు

కదిసి మోవడిగితే గంట్లు తనకు రాఁగు
పదరి కాఁగిలించితే పచ్చిదేరును
అదన శ్రీవేంకటేశుఁ డంగవించి నన్నుఁ గూడె
అద నెరిఁగినయడుగఁడుగే నిక్షేపము ॥ ఏ

రేకు 977 రామక్రియ

చాయలసన్నలఁ దన్ను సాదించనేలే
పోయినదే పొల్లుగాక పురివిచ్చ నేఁటికే

కాయమిది తనసొమ్ము కాఁకలే నాసొమ్ము
ఆయాలు మోవఁ దన్ను నాడనేఁటికే

మనసెల్లాఁ దనసొమ్ము మచ్చికలే నాసొమ్ము
చెనకి తన్నంత రట్టుసేయ నేఁటికే
తనకే నిదుర యెచ్చె తగె నాకు జాగరాలు
ఘనుఁడు తన్నింక నే గద్దించఁగలనా

కాఁగిలిదె తనసొమ్ము కళదాఁకేది నాసొమ్ము
తోఁగి చూచి తనతోడి దొమ్ము లేఁటికే
వీఁగక శ్రీవేంకటాద్రివిభుఁ డిట్టె నన్నుఁ గూడె
పాఁగితి నే నన్నిటాను పంతమాడ నేఁటికే ॥ చాం

తెలుఁగుకాం(ఁగాం?)బోది

ఏల వట్టిజోలిసేసే వేమిగట్టుకొంటి విందు
కాలమందె యీమేలు గట్టుకొనరాదా

వండవండనట్లాయ వలచినతరితీపు
యెండమావులాయ నీపై నెచ్చినయాస
వుండ దీయాసలఁ జెలి వొంగి నే వచ్చినదాఁకా
అండనే ఇంకొకమాట ఆనతియ్యరాదా

పుచ్చఁబుచ్చ పున్నమాయ పూఁచినసీసరసాలు
వచ్చీరానిపాటలాయ వట్టిప్రియాలు
ఇచ్చల నే వచ్చేనంటా నిందుకే కాచుకున్నది
అచ్చముగ నన్ను నాడ కంపివిడరాదా

వూరవూర నూటలాయ వొప్పగు నీమోవితేనె

టు చేసినదేవర నేమని మెత్తు నే నిఁక
కటకటా నే నిందుకే కరఁగుదురా ॥ పల్లవి ॥

నువులే వేరులై తలఁ బొక్కపైనమీఁద
ననిచి నిన్నేమనినా నన్ను [1]నంటేవో
వెనుకొని నీవు రానివేళ గోపించఁబోతే
జునిగి నాగుండె నాకే చుఱుకనురా ॥ ఇటు ॥

యసులు సమములై వావులు గూడినమీఁద
నయమై నీమేలెల్లా నామేలే వో
ప్రియము చెప్పేవేళ పెనఁగఁగఁబోయి నేనే
దయదలఁచి నీమీఁదఁ దమకింతురా ॥ ఇటు ॥

ఁకల నిందాఁకాఁ బొంది కాఁగిటఁ గూడినమీఁద
యేఁకట నీ కెంతగల్లా నిది నాదేవో
సోఁకుల శ్రీవేంకటేశ వొక్కించితివి నన్ను
వేఁకపుగుబ్బలముద్ర వేసితి నీపైరా ॥ ఇటు ॥ 446

## మాళవశ్రీ

వేమిసేతువయ్యా నేరమి నాదే కాక
కావిరి నాయాసలకుఁ గడమ లేదు ॥ పల్లవి ॥

ంతవడి నీరాక గోరుదు నీవు వచ్చితే
అంతమీఁద నీతో మాటలాడఁగోరుదు

ముచ్చట నొకవేళ నీమోము చూడవలె నంచు
వచ్చి యామీఁద నీమోవి వలె నందును
కచ్చుపెట్టి రాఁగా రాఁగాఁ గాఁగిలించవలెనందు
అచ్చపునాయాసలకు నరకువే లేదు

మేనులంటినట్టిచోట మేలములే కొసరుదు
కోనల నప్పటి రతి గొసరుదును
కానీలే శ్రీవేంకటేశ కైకొని కూడితి నన్ను
మేనిలోనియాసలకు మితి మేర లేదు ॥ నీ

లలిత

ఇచ్చకమాడితే మీకు నేమిదోసమాయ నేఁడు
అచ్చమైనమీకు మాతో నంతచలమేలే ॥

చెప్పకురే చెలులార చెలువుని మానుమని
అప్పుడే వీనులకు వెట్టయి తోఁచీని
తిప్పకురే నామనసు తెమ్మలుగా వలచితి
నెప్పున నేఁ బాయ వట్టినిష్ఠూరమేలే

తీయకురే చేయివట్టి తెగి వానింటికిఁ బోఁగా
కాయమెల్ల నిందువంకఁ గాఁకరేఁగీని
పాయ మాతని కిచ్చితి పంతానకు దక్కితిని
యీయెడ వట్టికయ్యానకేల పెనఁగేరే ॥

వుప్పతించకురే వానివద్ద నేఁ గూచుండఁగాను
రెప్పలఁ గోపము మీపై రేసుతెచ్చీని

రామక్రియ

పొన్నలలో వేగఁ బొద్దు పోసీవే యిఁక
కన్నదే కంటి గురుమ కానీవే యింక ॥ పల్లవి

వంచించి యెందు వోయినా వచ్చేఁగానీ తా నీడకు
పొంచి యానలువెట్టక పోనీవే యింక
యెంచరాధు పంచరాదు యివే మింటిపై చుక్కలు
కంతు పెంచుమాటలాడీ కానీవే ఇంక ॥ పొన్న

యీరీతి మాయింటిగుఱు తెఱఁగఁడా తానేమి
పోరి సారెఁ బిలువక పోనీవే యింక
నీరులేదు మేరలేదు నిండినయెండమావులు
కారపుప్పలపు చల్లిఁ గానీవే యింక ॥ పొన్న

యెందుండి వచ్చినాదానీ యేమనినా నియ్యకొనే
పొందులెల్ల నొనగుడె పోనీవే యిఁ(యిం?)క
విందువలె శ్రీవేంకటవిభుఁడు నన్నుఁ గలసె
కందుకుందులెల్లాఁ బాసె కానీవే ఇంక ॥ పొన్న ॥ 44

రే 978 కాంబోది

పట్టకురా ముట్టకురా పనలేనిపనులకు
యెట్టువలసినా వచ్చు నిదివో చేసన్నలు ॥ పల్లవి

అంతనవ్వు నవ్వకురా అలవాటయ్యీ నీకు

నన్ను నంత మెచ్చకురా నాటకమే నిజము ను
నిన్ను నన్ను నెంచుకొంటే నిక్కము లౌను
మిన్నక దగ్గరకురా మితిమీరఁ దమకము
కన్నసుద్ది చెప్పకున్న కడుఁగడుదోసము ॥ పట్టి

వోరగండ్లఁ జూడకురా వుపమే నెపమౌను
సారెకు రతులమీఁద చలమెక్కును
యేరా శ్రీవేంకటేశ యింతలో నన్నుఁ గూడితి
కోరినకోరికలెల్లాఁ గొఱఁత లేదిఁకను ॥ పట్టి ॥ 46

ఆహిరి

ఇదివో నావంకఁ దప్పు ఇంతే మరేమీ లేదు
యెదురుగాఁ బైకొన్న దిది నేరమాయను ॥ పల్లవి

వొంటిఁ దనతో వెంగె మొకమాటు నాడక
కంటగించి తా ముట్టితేఁ గసురుకొనక
దంటతనానఁ జెలులఁ దూరుకొణ నేయక
ఇంటిలో నే నూరకున్న దిది నేరమాయనే ॥ ఇది

యెందువోయినా వెంట నింతుల నే నంపక
కందువ మైకాఁకలకుఁ గాఁతాళించి పడక
సందడించి వేసుదాఁకా జాగుల నే పెట్టక
ఇందు రమ్మని పిలుచు టిది నేరమాయనే ॥ ఇది

అట్టే కాఁగిలించరాఁగా నవ్వవిమోము గాక
వెట్టగా రతులఁ దన్నుఁ వెస నలయించక

అడుగరే చెలులాల ఆతనినే యీమాట
యెడసినవిరహము యెవ్వరిదో కాని ॥ పల్లవి ॥

చూపులలోపలియాస చూచుదాఁకా వేగిరము
యేపునఁ దనకు నాపై నెట్లోకాని
ఆపైఁ జన్నులయాస అంటుదాఁకా వేగిరము
వోపిక దనకుండునో వుండదోకాని ॥ అడు ॥

మనసులోపలియాస మాటాడుదాఁకా వేగిర-
మెనలేనితనకిఁక నెట్లోకాని
తనువుమీఁదటియాస దగ్గుదాఁకా వేగిర-
మనుగు తనకు సమ్మతౌనో కాదో ॥ అడు ॥

కాఁగిటియాస రెంటెము గప్పుదాఁకా వేగిరము
యేఁగివచ్చెఁ దనకైతే నెట్లోకాని
వీఁగక శ్రీవేంకటాద్రివిభుఁడు నన్ను మన్నించె
చేఁగవేరె వలపులు సిగ్గులేవో కాని ॥ అడు ॥ 452

శంకరాభరణం

సరికిబేసికి మీరు చలము లింకానేలే
సరసములు విరసములు చౌకగదే ఇపుడు ॥ పల్లవి ॥

మనసులోపలిగుట్టు మాటలలోపలిరట్టు
చనవుగలపతితోడ జరపఁదగునా
కొనచూపులో కొసరు గొణఁగులో నసుదుసుదు

పిలువఁగాఁ బతితోడ పెంచఁదగునా
నిలువులో నివ్వెరగు నిండుఁజెమటలకరఁగు
చలివాయ నీమీఁదఁ జల్లెఁగదె అతఁడు

పచ్చిదేరేటియాస పదరి అడిగెడిబాస
ముచ్చట శ్రీవేంకటేశు ముంచఁదగునా
పెచ్చువెరిగేటి ప్రియము బిగువుఁ గాఁగిటినయము
నిచ్చలును నీమీఁద నెరపుఁగదె అతఁడు ॥ప

## మాళవిగౌళ

అంపవయ్యా నేఁ బోయే నట్టని వావాత
తెంపున నాయంతనైతే తెగరాదు పనులు ॥

కోపము గాదుగదా గొబ్బున నే వచ్చినది
ఆపెతో నీ వేకతము లాడేవేళ
చేపట్టి నేఁ దొలఁగితే సిగ్గువచ్చినట్టయ్యా
యీపొద్దు నీవద్దనుంటే నేమానో నీయాస

యెగ్గు లెంచవుగదా ఇట్టె ముసుఁగు దీసితే
వొగ్గి ఆకెతోడిరతి నున్నవేళను
కగ్గి కమ్మరఁ గప్పితే కల్ల మోపినట్టయ్యా
నిగ్గుల నే నూరకున్న నీ కెంతవెఱపో

నేరమి గాదుగదా నే నిన్నుఁ గాఁగిలించితి
నేరపున నాకెఁ గూడి నిద్రించేవేళ

దూతికలకు నీతోఁ బొద్దులు వుచ్చఁదగునా
నీతిగాదు యీడనుంటే నింద వచ్చుఁజుమ్మీ

యేమని చెప్పుదు నేను యింతితో మారుమాటలు
నేమాన నన్ను నంపవు నీవును రావు
కోమలినే రమ్మందునో కొంత వోరుచుమందునో
జాముహోయె నంపరాదా చాలుఁజాలు తడవు

నేను వచ్చినపనికి నెలఁత కుత్తర మేది
పూని నాచేయి విడువవు పొందు గానము
నీనవ్వులు నెరపేవో నిజమును నిట్లనో
కానీలే మమ్మంపరాదా కడుబలి మేఁటికి

అంతేకదా ఆపెతోడి ఆడుకోలుమాట నీకు
ఇంతివాకిట నిలిచే వేమో నవ్వేవు
పంతాన శ్రీవేంకటేశ పడఁతిఁ గూడితి విట్టె
పొంతనే మమ్మంపరాదా పొసఁగె మాపనులు ॥ దూ

రేకు 979 సాళంగనాట

నీ పెఱఁగవా యింత నిండుదొరవు
చేవలే చిగురుతొను సిగ్గునను ంటేను

అంటి పిడె మిచ్చేవు అందుకొనకుండరాదు
వెంటనే పెండికో పీడుకోలుకో

పక్కనఁ గూరిమికో పగసేసేవో
చిక్కితి నీపాల నేను చెప్పిచూప నెడలేదు
వొక్కట గురుతుపడి వూరకుండితేను ॥ నీవె

కాఁగిలించవచ్చేవు కాదని తొలఁగరాదు
ఆఁగినజెట్టిసామో అంగరతియో
మూఁగుచు శ్రీవేంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
కాఁగి ఇఁకనేమన్నా కైతప్పులౌను ॥ నీవె ॥ 45

సాళంగం

[1] అళగరి చక్కనళగరి వోయళగరి
తలఁచుకోర నామాట తారుకాణసుమ్మీ ॥ పల్లవి

అలిగితేఁ బోనీదు ఆకెకు లోనైనమీఁద
వలపు రేఁపుచు నిన్ను వంచుఁగాని
పలుకక పోనీదు పక్కననవ్వినమీఁద
సళుపుఁజూపులు నీపైఁ జాఁచుఁగాని ॥ అళ

చవులుచూపకపోదు సరసమాడినమీఁద
చివురుఁగెమ్మోవి గంటిచేసుఁగాని
అవల మాటాడనీదు అతివఁ జేకొన్నమీఁద
తివిరి నీవెంటవెంటఁ దిరుగాడుఁగాని ॥ అళ

నిన్ను మెచ్చించకపోదు నెలఁతఁ గూడినమీఁద
కన్నులు దేలగిలంగఁ గరఁచుఁగాని
అన్నిటా శ్రీవేంకటాద్రి నళగుఁదిరుమలను
కన్నె నీవురముమీఁదఁ గాఁపురమౌఁగాని ॥ అళ ॥ 45

1. [illegible]

ముక్కు(బో(గానెపో ముంచినపయ్యెద జార
గక్కున నీతో నవ్వ(గా( గారె( జెమట
వెక్కసాన మాటాడ(గా వే(డినిట్టూర్పులు రే(గె
యెక్కుడిగొడవ మాయింట నుండేనయ్యా ॥ నేనా ॥

గ్గరి రా(గా(బో తనువెల్లా( బులకించె
సిగ్గువడ(గానెపో చింత రే(గెను
వొగ్గి విడె మియ్య(గా(బో వొడలెల్లా( గా(క వుట్టె
యెగ్గుతప్పులకు నోప ఇంటనుండేనయ్యా ॥ నేనా ॥

(గిలించ(గానెపో కళదా(కె మేనెల్లా
రా(గు(దమకాననెపో రచ్చకెక్కెను
పొ(గిన శ్రీవేంకటేశ పై పై( గూడితి నిన్ను
[1]యే(గు(బెండ్లితో మాయింట నుండేనయ్యా ॥ నేనా ॥ 458

లలిత

డకే నె వచ్చినప్పు డయ్యో(గాని
బూడిద వసంతమాడ( బొమ్మనవే వానిని ॥ పల్లవి ॥

లపు జాతెఱ(గదు వాసి నీతి యెఱ(గడు
కలిమి ముందువెనక గాననియ్యడు
తెలిసితే( బసలేదు దిష్టమాయ మాకిన్ని
పొలసి కొసరనేల పొమ్మనవే వానిని ॥ ఆడ ॥

1. పెండ్లి మెరవణి.

తీపులమోవి దప్పితీరనియ్యదు
రాఁపుసేయఁ బనిలేదు రచ్చకెక్కెఁ బనులెల్లా
పోపో అదేడసుద్ది పొమ్మనవే వానిని

పాయము భీతెఱఁగదు పంతము తన్నెఱఁగదు
చాయలసన్నలముద్దు చవెఱఁగదు
యీయెడ శ్రీవేంకటేశుఁ డిపు డిట్టె నన్నుఁ గూడె
పోయి ఇట్టె వచ్చెఁగాని పొమ్మనవే వానిని ॥అ

రామక్రియ

పాపమంటాఁ బాలిచ్చితేఁ బైపై నోకిలింతలాయ
కోపము శాంతముతోడఁ గూడెఁగా నీచనవు

నిండినది నామనసు నీమేఁద నేపొద్దు
పండెను నాకెమ్మోవి పంటలుగాను
వండ వండనట్లాయ వలపులు నీకై తే
యెండలు నీడలు నాయ నిదివో నీకరుణ

ననిచెను నాచూపు నంటిననీమేనిమీఁద
మొనసెను నానవ్వు ముంచి నీతోను
పొనిఁగి పుచ్చఁగఁ బుచ్చ పున్నమాయఁ బొద్దు నీకు
ఇనుము బంగారమాయ నిదివో నీమాటలు

తతివచ్చె నాకు నీకు దగ్గరి కాఁగిటిలోన
ప్రతివచ్చె నిద్దరికిఁ బాయములివి

నీవెఱఁగనిబుద్ధులు నేము చెప్పేమా
భావమే యెరుఁగుఁగాన పచ్చిసేయఁగలమా

పూవువంటిది వయసు భోగించవలెఁగాక
చేవదేరే యీసిగ్గు చెల్లఁబోయెలే
మీవంటివారికా మీరరానివొట్లివి
దైవము దూరుతగాక తగదనఁగలమా

కప్పురమువంటి దిట్టె కలిగె నీమోహము
నిప్పువంటి విరహము నీకేలే
యిప్పుడిది వేళా ఇద్దరి యెగ్గులకును
చెప్పరానిచేఁత మీచేఁ జేయించఁగలమా

పండువంటిది మోవి పదరి చేకొంటగాక
కొండవంటికోపము చేకొన నీకేలే
అండనే శ్రీవేంకటేశు నలమి కూడితి విట్టె
మెండుననుండేటిమిమ్ము మెచ్చనైనఁగలమా

రేకు 980 బౌళి

ఏమని తా భావించునో యెరఁగ నేను
చీమక(ల?)దొంతరమేలు చిమ్మిరేఁగెననవే

అప్పుడే వచ్చేనంటి నటు నావిభునితోడ
అప్పన మెవ్వతుండునో యని మానితి

ఆడ వేళదెలియక అంపనైతిని
వేడుక విరులబంతి వేసేనంటా నుంటి
ఆడ నవి మరునమ్ము లవునని మానితి

కాఁగిటఁ గూడినవేళఁ గళలు రేఁచేనంటి
మాఁగినరతుల నేనే మఱచితిని
చేఁగదేర నన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడు వచ్చి
దాఁగనినవ్వులు నేనే తనమీఁదఁ జల్లితి ॥ ఏ

శంకరాభరణం

ఒక్కటే విన్నపమిది వున్నవెల్లా నేమిటికి
పక్కన విచ్చేయు మా కాపని గాదుసుమ్మీ

తమకించినది చెలి తడవాయ నే వచ్చి
నిమిషము రాకున్న నీకే తెలుసు
చెమటలవెల్లి వారె చింతాజలధి నిండె
భ్రమసితి మిఁక మాకుఁ బనిగాదుసుమ్మీ

చూపుల నున్నది యాస సుదతిమనసు లేఁత
యేపాటి గలఁగినా నిఁక నేమౌనో
మోపులాయఁ గోరికలు ముక్కున నూర్పులు రేఁగె
పాపము పుణ్యము మా కాపని గాదుసుమ్మీ

దోమతెర మీకు మాటు తొయ్యలికి వినవచ్చు
యేమాటయిన నాడు ఇఁక మమ్మంపు

నిండెను కళలు సతినిలువెల్లను
పండినజవ్వన మేరుపరచేటిదెట్లో

చిత్తము చీఁకటిపడె చెలి నిన్నుఁ బాయఁగాను
పొత్తులఁ జుక్కలుగానెఁ బులకలను
చిత్తరపుమోనానఁ బికములు గూండ్లెక్కె
వుత్తలాన కాంత కిఁక నుదయమౌ టెపుడో

మెలుఁతకు కొప్పు వీడి మేఘములు ముంచుకొనె
జలజలఁ జెమటలజడి వట్టెను
కలువకన్నులు మంచికారుమెఱుఁగులు మించె
కలికికి వెలుతురు గనియేది యెపుడో

పడఁతికి నీరాక పచ్చిగాలియై వీచె
చిడుముడిఁ గోరికలె చిగురించెను
యెడయక శ్రీవేంకటేశ ఇంతిఁ గూడితివి
కడఁగె వసంతవేళ కందువ యిఁకేదో ॥ ని

పాడి

నిచ్చా జగడమేల నీ వెఱఁగవా
యిచ్చట నీమేన నవే యియ్యకోరాదా

తప్పనిటొంకనిమాఁట తలఁపులోపలితీఁట
నెప్పున నే నాడనేల నీ వెఱఁగవా

నిక్కమౌత కల్లవుత నీవెఱఁగవా
ముక్కున నీబుసకొట్టు ముసిముసినవ్వులగుట్టు
దిక్కులవారి నడిగి తెలుసుకోరాదా

పుబ్బునఁజేసినచేఁత వొడలిపై గోరివాఁ(వ్రాఁ?)త
నిబ్బరపురతివేళ నీవెఱఁగవా
గొబ్బున శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టె
తబ్బిబ్బు తడఁబాట్లు దాఁచుకోరాదా ॥ నిచ

గౌళ

అసురుసురుల నీకు నలపేఁటికే
వసమై యతఁడు నీవద్ద నుండీఁగాక

యెలజవ్వనివి నీవు యేల చిన్నఁబోతివే
వలచినపతి నేఁడే వచ్చీఁగాక
నిలువునఁ దలవంచి నేలవాఁ(వాఁ?)త లేఁటికే
చెలువపునీచనవే చెల్లించీఁగాక

చెక్కుచేతితోడ వట్టి చింతఁ బొరల నేఁటికే
వొక్కటై పతిఁగూడి నీ వుండేవు గాక
ముక్కున వేలుమోపి మోనపువెర గేఁటికే
మిక్కిలి విభుఁడు నిన్నే మెప్పించీఁగాక

పచ్చికస్తూరి నుదుటఁ బట్టుపెట్ట నేఁటికే
మచ్చిక నీరమణుఁడే మన్నించీఁ గాక

వద్దు వద్దు అంతలసవట్టచనవులు మాకు
పెద్దరికముతో నుండేబిగువే చాలు
తిద్దనేల నీగుణాలు తిట్టించుకొననేల
అద్దో యీడ నుండఁగా నైనపాటే చాలును

ఆయ నాయ జాణతనా లంతేసి కోపఁ నేను
చేయి చెక్కిటితో నుండేసిగ్గే చాలు
ఆయము లంటఁగనేల అద్దలింపించుకోనేల
చాయల సన్నలలోని సంతసమే చాలును

పట్టకు పట్టకు నీతో పంతము నెరపఁగనేర
గుట్టుతో నీసముకపుఁగొలువే చాలు
యిట్టె శ్రీవేంకటేశ యిదె నన్నుఁ గూడితివి
ఁట్టిగొన్న నీ మోవిచవులే చాలును ॥

రేకు 981 రామక్రియ

ఆతనిఁ గూడినప్పుడే అన్నియు సాదించవమ్మా
రాతిరాయ నీఁకనైనా రమ్మనవమ్మా

అంపినమాట కుత్తర మానతియ్యవమ్మా
వంపుమోముతో నలుక వలదమ్మా
పంపుడుచెలుల మింతే పలుక విదేమమ్మ
చెంప జారినతురుము చెరుగుకోవమ్మా

...చూపులలోన కోపమేలమ్మా
జపుళి నివరి కూడిగములవారమమ్మ
చెమరింతో మేనెల్లాఁ జిన్నఁబోకువమ్మా ॥ ఆత ॥
యెదురుగా నెచ్చె నాతఁ డిట్టె మమ్మంపవమ్మ
కదిసితి వింత నీకుఁ గడుమేలమ్మా
యెదుట శ్రీవేంకటేశుఁ దేఁగివచ్చి నిన్నుఁ గూడె
వదలఁడు దిన మిట్టె వచ్చీ నోయమ్మా ॥ ఆత ॥ 468

పాడి

గక్కన నింట లేఁదిది గానుగకాడ నున్నదా
నక్కవడ నిందుకేపో నవ్వితి నే ననరే ॥ పల్లవి ॥
తా నేడనుండిన నేమి తలఁ పొక్కటైనఁ జాలు
ఆనలు సత్యాలుఁ జెప్పి యంపవలెనా
దానికే మెదురుమాట తనతో నే నాడేనా
మోనాన నిట్టె తనకు మొక్కితి నే ననరే ॥ గక్క ॥
యేదిక్కు చూచిననేమి యీడకు విచ్చేసెఁ జాలు
యీదెస నొడఁబరచ నింతవలెనా
కాదని తనచేఁతలు ఖండించఁజెల్లునా
వాదు లడువక తలవంచితి నే ననరే ॥ గక్క ॥
అసురుసు రై తేనేమి అట్టె నన్నుఁ గూడెఁ జాలు
వసమై నాకిఁక వెరవఁగవలెనా

దగ్గర కూడుటకంటె దవ్వులపాటదె మేలు
సిగ్గుతో నున్నది చెలి చిత్తమిఁక ననవే ॥

చిత్తమును నీరుచేసె చిగిరింపించెఁ గోరిక
వుత్తలపువిరహాగ్ని వొప్పదా యేమి
హత్తి తనపొఁ(పొం?)దైతే నంగనమర్మము గాఁడి
వత్తివలె వాడించె(చి?) వడచల్లీ నిదివో

తలఁపించెఁ దనరూపు తమకము పెడరేఁచె
వొలసి చెక్కిటిచేయి వొప్పదా యేమి
బలిమిఁ దనకాఁగిలి పడఁతిని భ్రమయించి
నిలువెల్లా మఱపించె నేర మిందుఁ గలిగె

తఱవు రతికి రేఁచె తనువెల్లా నెచ్చరించె
వొఱపైనకొనగోరు వొప్పదా యేమి
గుఱి శ్రీవేంకటేశుఁడు కూడినకూటములయితే
మఱవనీక సతికి మరులాయ ననవే ॥ ద

దేసాళం

కానమే నే మింత తాను కదిరికాఁడౌత
మోనాన నే నూరకున్న మోముచూచీఁ దాను ॥

నగుతా నేనొకమాఁట నాలో గొణఁగుకొంటే
తగిలి సూదుకుఁ బాడు తానిదేమే
మొఱగి నాపుకి లీతము ముందర నే మున్నిపితే

ఆదిగొని కోపగించీ నదేమే తాను
సేదదేరి బొమ్మలను చెలుల నే జంకించితే
పోదితో వహించుకొని పోరీనే తాను

కివిసి మాగోడండఁ గేకరించుకొంటేను
చెనకి నాకొంగువట్టీ చెల్లఁబో తాను
యెనసి శ్రీవేంకటేశుఁ డేమీ ననకుండితేను
తనివితో ననుఁగూడె తలఁగఁడే తాను ॥ కి

వరాళి

ఎంతచెప్పినా మాన విందాఁకా నేము
అంతలోఁ బెద్దరికములాయనా నేఁడు

చెక్కునొక్కె నేసవెట్టె చెలియ నీకాలు దొక్కె
తెక్కుల నీజగడాలు దీరెనా నేఁడు
చుక్కలు మోవిపై నాఁటె చొక్కపుగుబ్బలు మోపె
వక్కణించి నీపంతము వచ్చెనా నేఁడు

కన్నువేసె మాటలాడె కమ్మనినవ్వులు నవ్వె
చిన్ననాఁడే, నీచలము చెల్లెనా నేఁడు
మున్ను నీకుఁ జేత మొక్కె ముచ్చటలన్నియుఁ జె
పన్ననసీలోనిచింత పాసెనా నేఁడు

చేయివేసె చెట్టవట్టె సిగ్గు నీ కొప్పగించె
చాయల నీ కిదియైనా సమ్మతా నేఁడు

రామక్రియ

ఆతనికి నీకే తగు నందుకే పోవే
యీతల నే మిందుకెల్లా నిట్టే తలవంతు మే

సటలివి మాకైతే సగియించ వింకాను
నటన నాతనితోనే నవ్వవే పోయి
యిటువలెఁ జేసి మాయింటికి వచ్చే వప్పటి
కటకటా నేమైతే కడుసిగ్గు విడమే

చెంగట నీమాట వింటే చిమ్మిరేఁగీ మేనెల్లా
అంగడి నాతనితోడ నాడవే పోయి
వెంగలితనాన నాకే విడెమియ్య వచ్చేవు
యింగితాన నేమైతే నింతరొచ్చు కోపమే

నిలువెల్లాఁ గాఁకరేఁగీ నిన్నుఁ జూచితే నాకు
వొలిసి నీపతివద్ద నుండవే పోయి
యెలమి శ్రీవేంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁ గూడె
వలచి నే మిందుకెల్లా వాసిదెచ్చుకొందుమే ॥ఆ

రేకు 982 భైరవి

నీకేల ఇంతవెరపు నేనుండఁగా
చేకొని నీకిచ్చకాలు సేయవద్దా నాకును

పూని మాయింటికి రాను పొంచి సిగ్గువడేవు

వేమారు నిన్ను వెనకవేసుకోక పోవునా ॥ నీకే

మాఁటలాడఁ గొంకేవు మచ్చిక నిన్నిటు గూడి
తూఁటమోవి గంటైతే దోసమా యేమి
నేఁటనే శ్రీవేంకటేశ నీవే నన్నుఁ గూడితివి
నాఁటకీఁడవైన నిన్ను నమ్మవద్దా ఇపుడు ॥ నీకే ॥ 47

సౌరాష్ట్రం

మమ్ము నింకఁ దడవక మానేవయ్యా
నెమ్మి వేవేలు దండాలు నీకుఁ బెట్టేమయ్యా ॥ పల్లవి

చెప్పరానినాచింత చేతిమీఁదికి వచ్చె
తప్పక నన్నేమి చూచి తడవేవయ్యా
నెప్పున వలచినట్టినేరమి నావొళ్ళఁ గద్దు
వొప్పులుఁ దప్పులు నీవే వోరుచుకోవయ్యా ॥ మమ్మ

కన్నులలోపలికాంక్ష కదుఁ బయ్యెద దడిసె
నన్నుఁ జూచి ఇఁకనేమి నవ్వేవయ్యా
పన్ని నీతో నలిగినఫలమెల్లా నేఁ గంటి
ఇన్నిటికి నీకుఁ బంత మిచ్చేము కోవయ్యా ॥ మమ్మ

తలకెక్కె వలపులు తనుఁదానె దిగజారె
మలసి మాతో నేఁటిమాటలయ్యా
మెలమి శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁ గూడితివి
చెలఁగి మాచనవులు చెల్లించవయ్యా ॥ మమ్ము ॥ 47

1. ఒతమునకు రూపాంతరమా? వ్యావహారికమా?

కటకటా మీఁదపెత్తు కానదాయ నెవ్వతెరా
  కుటిలపుఁబులకలు కుప్పవడీ మేనను

కడు నీమోవిచిగురు గంటిసేసె నెవ్వతెరా
  వడిసీఁ దేనెలు అందువంక నింతాను
  పొడమించె చెమటలు పొలిఁతి యెవ్వతెరా
  కడలేనినీమనసు కరఁగు నందునను

రేసులనిట్టూరుపులు రేఁచిన దెవ్వతెరా
  గాపిగా నీవలపులు గాలిఁబోయీని
  తోసి నీకన్నుల నిద్ర తొట్టించిన దెవ్వతెరా
  వోసరిలి తమకము లుమ్మగిలీ నందు(న)ను

గందపు గుబ్బలముద్ర కడునొత్తె నెవ్వతెరా
  అందువల్ల సిగ్గు నీకు నచ్చుపడెను
  కందువ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
  విందవానె నిందువంక నేఁ దెందున్నదిరా ॥

పళవంజరం

సారె నాటిసుద్ది నేఁడు చవులనవే
  కోరి నేఁడు రాజైతే కూరిమివోదనవే

మంచముపై నన్నుమాట మఱవకుమనవే

...న చూచుకొమ్మనవే
తేకలు ముంజూరు నిండె లెక్కించుకొమ్మనవే
ఆకు మడి చిచ్చినది ఆనవాలాయననవే
యీకదఁ బెద్దరికాన కేమిదప్పె ననవే ॥ సా

నాలత్తుకరేక చిన్నినామమాయ ననవే
చాలుఁజాలు నీకనేల సటలనవే
యేలెను శ్రీవేంకటేశుఁ డిదె నన్నుఁ గాఁగిటను
పోలించి తా దేవుఁడైతే పొందు మానదనవే ॥ సారె ॥

బౌళి

ఎంత వలపించితివో యేమిమాయ సేసితివో
పంతములాడుదుఁగాని పాయలేనురా ॥ పల్ల

కోపగించేనంటా వచ్చి గొబ్బున నీమోము చూచి
దాపుగా నే మొగమోడి తలవంతురా
పోపొమ్మని యలిగి నేఁ బోయేనంటాఁ బోయి
తీపునీమోవి దలఁచి తిరుగుదురా ॥ ఎంత

వెంగెమాడేనంటాఁ జూచి వినయాల నినుఁ గని
కుంగుచు నానిట్టూర్పు గుక్కుకొందురా
వుంగిటినీమాట నీకే వొప్పగించేనంటా వచ్చి
నింగి మోవఁ జేతులెత్తి నేనే మొక్కుదురా ॥ ఎంత ॥

మిక్కిలి వింతరేకలు మేననెల్లా సోదించి
గక్కున నే నుండలేక కాఁగిలింతురా

వరాళి

అలిగినయలుకెల్లా నరచేత నున్న దిదె
తలపోసి చూచుకొంటే తనకేమి బాఁతే

ఉప్పవడ్డయలకలు ఉమ్మరింపుఁజెమటలు
చిప్పిలుమోవితేనెలు సేనాసేన
రెప్పలతుద కెంపు రేసువడ్డచల్లజంపు
దప్పిదేరీ నివియెల్లా తనకేమి బాఁతే

మూసినట్టిపై చెఱఁగు మంతనములో కరఁగు
పోసపుబాస పోఁకకుఁ బుట్టిదేసి
వేసర నీకుంటెనలు వేవేలు వెంటెనలు
తాసున వేసి చూచితే తనకేమి బాఁతే

కాఁగిటికలయికలు కందువ అలయికలు
చేఁ(గ)గలవావి చెట్టునఁ జేటఁదేసి
ఆఁగి కూడెను శ్రీవేంకటాధిపుఁడు నను నిట్టె
దాఁగరానిసరసాలు తనకేమి బాఁతే

రేకు 983 సామంతం

ఓపనోప నింతేసికి వోయయ్యనేను
కోపగించకున్నాను కొడిమె లెంచేవు

నగితిఁబో అందుకేమి నాలోనే వొకవేళ

చేవన్నె మోవిగొరిటె తాన చూచుకొమ్మనవే
లేకలు ముంజూరు నిండె లెక్కించుకొమ్మనవే
ఆకు మడి చిచ్చినది ఆనవాలాయననవే
యీకడ( బెద్దరికాన కేమిదప్పె ననవే

నాలత్తుకరేక చిన్నినామమాయ ననవే
చాలు(జాలు నీ(కనేల సటలనవే
యేలెను శ్రీవేంకటేశు( డిదె నన్ను( గా(గిటను
పోలించి తా దేవు(డై తే పొందు మానదనవే ॥స

బౌళి

ఎంత వలపించితివో యేమిమాయ నేసితివో
పంతములాడుదు(గాని పాయలేనురా

కోపగించేనంటా వచ్చి గొబ్బున నీమోవు చూచి
దాపుగా నే మొగమోడి తలవంతురా
పోపొమ్మని యలిగి నే( బోయేనంటా( బోయి
తీపునీమోవి దల(చి తిరుగుదురా

వెంగెమాడేనంటా( జూచి వినయాల నిను( గని
కుంగుచు నానిట్టూర్పు గుక్కుకొందురా
వుంగిటనీమాట నీకే వొప్పగించేనంటా వచ్చి
నింగి మోవ( జేతులెత్తి నేనే మొక్కుదురా

మిక్కిలి వింతరేకలు మేననెల్లా సోదించి
గక్కన నే నుండలేక కా(గిలింతురా

అలిగినయలుకెల్లా నరచేత నున్న దిదె
తలపోసి చూచుకొంటే తనకేమి బాఁతే

కుప్పవద్దయలకలు కుమ్మరింపుఁజెమటలు
చిప్పిలుమోవితేనెలు నేనానేన
రెప్పలతుద కెంపు రేసువద్దచల్లజంపు
దప్పిదేరీ నివియెల్లా తనకేమి బాఁతే

మాసినట్టిపైచెఱఁగు మంతనములో కరఁగు
పోసపుబాస పోఁకకుఁ బుట్టదేసి
వేసర సీకుంటెనలు వేవేలు వెంటెనలు
తాసున వేసి చూచితే తనకేమి బాఁతే

కాఁగిటికలయికలు కందువ అలయికలు
చేఁ(గ)గలవావి చెట్టునఁ జేటఁదేసి
ఆఁగి కూడెను శ్రీవేంకటాధిపుఁడు నను నిట్ట
దాఁగరానిసరసాలు తనకేమి బాఁతే

రేకు 983 సామంతం

ఓపనోప నింతేసికి వోయయ్యనేను
కోపగించకున్నాను కొడిమె లెంచేవు

నగితిఁబో అందుకేమి నాలోనే వొకవేళ
నీమీఁద నెపెనా వొచ్చె మంటినా

అసుదై వూరకుంటిఁబో అంతలోనే నీవు నన్ను
వెస నిట్టే జరసేవు వేగిరపడితినా

కాఁగిలించితిబో నిన్ను కాఁకలు మేన నిండఁగా
రాఁగిననీమేనికాఁక రవ్వపెట్టేనా
వీఁగక శ్రీవేంకటేశ వేడుక నన్నుఁ గూడితి
దాఁగనేల నీమాట దాఁటఁగలనా ॥ ఓప

కాంబోది

ఏమమ్మ యశోద మీయింటికి నేము వచ్చితే
గాముఁవంటిబిడ్డ నిచ్చి కలుపడఁజేసితి ॥

పాలు గారీ నెలవులఁ బక్కనఁ జెక్కుమీఁటితే
వేలువెట్టితే లోకాలు వెల్లివిరిసీ
వీలి నేము వుగ్గువెట్ట వెరతుము మీవాఁడు
బాలుఁడా దయ్యముగాక పట్టవమ్మా ॥

నెమ్మిఁ దొడమీఁద నుండి నిలువు నూరు వండీని
పమ్మి నాల్గుమోములపాపఁడు లోన నున్నాఁడు
నెమ్మదిఁ బాలు వోయఁగ నే వెరతు మీవాఁడు
ఇమ్మల వీఁడు మానిశా యెవ్వఁడో కాక ॥

పక్కన నీరార్చితిఁ బయ్యదలో నిడుకొంటి
మక్కువ నాకే తాను మగఁడైనాఁడు
చిక్కినపను లింకేమిఁ జెప్పఁగ నే వెరతును

ఎట్టు నమ్మవచ్చు నిన్ను నిటువంటివానిని
నెట్టన నేఁడిదె నిన్ను నీవే మఱచితివి ॥ పల్లవి ॥

కాటుకకన్నుల నాకె గక్కన నిన్నుఁ జూచితే
మాటలు నాతో నాడేది మఱచితిగా
చీటికిమాటికి నట్టే చిరునవ్వు నవ్వెనంటా
నాటిన మనసుతోడ నన్ను మఱచితివి ॥ ఎట్టు ॥

పెద్దబెట్టుమాట లాడి పిలిచెనంటానే
వొద్దనున్న నన్ను మఱ చుస్సురంటివి
ముద్దు చూపి దవ్వులనే మొఱఁగులు చల్లితేనే
పొద్దుగూఁకుపొదవు లిప్పుడే మఱచితివి ॥ ఎట్టు ॥

చిగురుఁజేతుల నాకె చేసన్న సేసితేనే
తగవు మఱచితిగా దగ్గర నుండే
మిగులా శ్రీవేంకటేశ మించునాకాఁగిటఁ గూడి
అగపడి రతిఁ జిక్కి అన్నీ మఱచితివి ॥ ఎట్టు ॥ 482

రామక్రియ

ఇరవై మన్నించవయ్య ఇంతిగుణ మిదివో
తరుణివారముగాన తగులఁ జెప్పితిమి ॥ పల్లవి ॥

కొమ్మ నీతో పొందుచేసి కోరి పిన్ననాఁ డాడే-
బొమ్మలఁ దేనియ్యదు నీపొందు దగిలీనంటా

సోవగాఁ బతిరూపులు చూడనోపరు
తావులఁ దనసీడకు తా నలిగీని చెలి
ఆవలి ఇంతిఁ దెచ్చితే నప్పు దేమేమౌనో

తనరూపు వ్రాసి వేరేతరుణి యయ్యీనంటా
యెనలేనితనసంది నిడుకొనెను
ఘనుఁడ శ్రీవేంకటేశ కైకొంటివి ఇంతిని
ననుపుచెలులపొందు నవ్వఁబాటు సుమ్మీ ॥

ముఖారి

ఇద్దరు నేకముతైన యెదురు మీ కిఁకలేదు
చద్దివేఁడివలపులకు సటలు మరి లేవు

తనువు లేకముతైన తప్పులునొప్పులు లేవు
మనసు లేకముతైన మరఁగులే లేవు
చనవు లేకముతైన సాదింపు మరి లేదు
వనిత విచ్చేయఁగదే వరుసఁ బతికడకు

పలుకు లేకముతైనఁ బైకొసరు మరి లేదు
తెలువు లేకముతైన తెగువలే లేవు
చెలిమి సరిదాఁకితే చింతలే మరి లేవు
వెలఁది విచ్చేయఁగదే వెనకకతలేల

వయసు లేకముతైన వంతులువాసులు లేవు
ప్రియము లేకముతైన బిగువులే లేవు

మంకు విడిచిన నిదె మంచి బుద్ది
సుంకుల మీలోనే మీరు చూచుకొనరాదా ॥పల్లవి

నీడలెల్ల నెండలాయ నెలఁత నీవు రాకున్న
వేడుకెల్లా వేసటాయ వెచ్చఁదనాన
వాడిక నడుమ వేరే, వయసు రిత్తవోయిని
కూడినకూటాలమేలు కొల్లలాడరాదా ॥మంకు॥

కప్పురమే కారమాయ కదిసేమాటలు లేక
దప్పులెల్లాఁ దనివాయ దగ్గరి రాఁగా
రెప్పవేసేయంతలోనే రేసులెక్కె నీ మనసు
తెప్పలఁ దేలఁగరాదా దిష్టపుమీరతుల ॥మంకు॥

దవ్వులెల్లఁ జేరువాయఁ దరుణి నీవియ్యకోఁగా
పువ్వులెల్లఁ బిందెలాయఁ బూఁటపూఁటకు
యివ్వల శ్రీవేంకటేశ యింతి నీవు గూడఁగాను
నవ్వులాయ మాకెల్ల నమ్మికియ్యరాదా ॥మంకు॥ 48

984 సామంతం

అడియాలాలెల్ల నిండె నంపరాదా। నీ—
వడిగినట్టెల్లా నాయ నంపరాదా ॥పల్లవి॥

కన్నుల నిద్దుర దేరెఁ గందువలు చెమరించె
[1]అన్నివనులును నాయ నంపరాదా
వన్నెమోవి కడురాఁగె వసివాడె మైఁదీగె

ఆయములు సరిదాఁకె నంపరాదా
పాయములు ఫలమండె పంతము లొక్కట్లాయ
ఆయెడకే వత్తుఁగాని అంపరాదా ॥ అది ॥

మచ్చికలే తనివొందె మంతనాలే చవులాయ
అచ్చుపడెఁ గూటములు అంపరాదా
ఇచ్చకుఁడ శ్రీవేంకటేశ నన్నుఁ గూడితి–
వచ్చికములెల్లఁ బాసె నంపరాదా ॥ అది ॥ 486

## సావేరి

వెఱతుమయ్యా నీకు వింత లింకానేమైనా
మఱి నిన్ను నెప్పుడుఁ గమ్మరా విడువరా ॥ పల్లవి ॥

పిలువవచ్చినసతిపెదవులెల్లాఁ బొక్కె
వెలయ నీపే రెంతవేఁడోకాని
చలువకు మందులేక సాదించ నే వచ్చితిరా
పలుకకుండితే మోవి [1]పతిపొక్కించింతురా ॥ వెఱ ॥

చూడవచ్చినట్టిఇంతిచూపులెల్లాఁ గెంపువారె
జాడ నీరూ పెంతటిబాసటమోకాని
వేడుక నిది మానుప వేఁడుకో నే వచ్చితిరా
తోడనే నీ పూరకున్న తుదమీరఁ జేతురా ॥ వెఱ ॥

అకుమడిచిచ్చేసతియంగమెల్లాఁ జెమరించె
చేకొని నీవేమిచేఁత నేసితోకాని
దాకొని శ్రీవేంకటేశ దగ్గరి నేఁ గూడుండఁగా

నీకునీకే యాడుకోకు [1] నియ్యాన
   కైకొని నేనే నీపై గడియించేఁగాని ॥ పల్లవి ॥

అంతవాఁడ వవుదువు అంగనల వలపించి
   వంతులకు నీవే నవ్వనోపుదువు
   పంతమాడఁ బనిలేదు పలుమారు మాకెల్లా
   కాంతుఁడ విన్నెప్పుడుఁ బొగడవలెఁగాని ॥ నీకు ॥

మంచివాఁడ వవుదువు మచ్చికలే పచరించి
   వంచి సవతులఁ జూపి వాసిరేఁచను
   కొంచ నిఁకఁబనిలేదు కోడెతనానకు నీవే
   చంచులకు రాజవంటాఁ జాటవలెఁగాని ॥ నీకు ॥

రసికుఁడ వౌదువు రతులఁ గాఁగిటఁ గూడి
   మిసిమిమమ్మెల్లా నీవు మెప్పించను
   యెసగి శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
   పసగానిమన నిఁకఁ బట్టవలెఁగాని ॥ నీకు ॥ 488

వరాళి

ఏమిటాఁతి నిజములు యీకాలము
   జాముజాము కొకటైనసటలే చాలు ॥ పల్లవి ॥

గక్కన మాఁటాడఁబోతేఁ గలది గలట్టె
   మొక్కలాన నూరకుండుమోనమే చాలు
   చక్కఁ జూడఁబోతేను సందేహాలే యప్పటిని

కొచ్చి మమ్ముఁ దడవకు కోపమే చాలు
అచ్చపుటేకతమైతే ఆయములు రేఁగిని
యిచ్చటఁ జెలులసందడిదియే చాలు ॥ఏమి॥

పానుపుమీఁదికిఁ బోతేఁ బంతమెల్లా బయలయ్యీఁ
నానఁబెట్టి యీయెదుటినటనే చాలు
మానక శ్రీవేంకటేశ మరి నన్నుఁ గూడితివి
కానఁబడ్డ ఇందుకంటే కతలే చాలు ॥ఏమి॥ 489

సాళంగం

మఱచినపని రేఁచ మాకేలే
తఱవాతిపను లిట్టే తమకించనేలే ॥పల్లవి॥

పెనఁగి మాయింటికిఁ బిలువఁగ నిలువఁగ
మనసు వచ్చునో రాదో మాకేలే
తనయంతలేనిది తడవ నేమిటి కెంత-
పనిగలిగున్నాఁడో పలికించనేలే ॥మఱ॥

తెరయెత్తి నేఁ జూచి తిరిగితే జరిగితే
మరుతంత్ర మేమౌను మాకేలే
సరసాలే విరసాలు చవిగానిపనులకు
పరిణామ మడిగి నేఁ బచరించనేలే ॥మఱ॥

అరసి యప్పటిసుద్దు లడుగఁగ నొడుగఁగ
మారాక కూరకుండఁగా మాకేలే

తెలుఁగుకాంబోది

చెప్పరాదు చూపరాదు చెలియభావము నేఁడు
వుప్పతిల్లుఁజెమటతో నుస్సురనీనమ్మా

చక్కఁదన మొకవంక జవ్వన మిదొకవంక
మొక్కలపుపతిమీఁదిమోహ మొకవంక
వొక్కటొక్కటికిఁగా కువిద నివ్వెరగుతో
ముక్కుమీఁదివేలితోడ మోము వంచెనమ్మా

చిత్తపుకోరికలతో సిగ్గరిభావముతోడ
హొత్తులచెలులుచెప్పేబుద్ధులతోడ
యెత్తినతమకమున నెదురుమాఁటాడలేక
తత్తరానఁ దనలోన తానే నవ్వీనమ్మా

కన్నులఁ గావులుదేరె కళలు మోమునఁ దేరె
తిన్ననికెమ్మోవినెల్లా తేనెలు గారె
వెన్నెలవంటివలపు వేడుకఁ దలకెక్కఁగా
యిన్నిటా నిట్టె శ్రీవేంకటేశుఁడు గూడెనమ్మా ॥ చె

రేకు 985 శంకరాభరణం

[1] బొలేరా జాణతనాలాడేవు నీవు
లేలే నే నీవలె లెక్కలువెట్టేనా

కప్పకురా నీగుణాలు కందువ వొద్దాయ; నేఁ—
గప్పినట్టే నీకుచాలు గప్పేవు గాక

చిక్కి [illegible]ంచి దేనె నీవే చిందేవే యిపుడు ॥ జొ

జాఅనీకుబా [illegible] సంగడిరతుల; నీకే
జాణెఁగ [illegible] మునిగొంగు సంతసాలతో
మీఱి శ్రీవేంకటేశ్వర మేలుతోఁ గూడితివి;
ఆఱడికూటమువెల్లా నప్పెఁగదే నీకు ॥ జొతే ॥ 4

పాడి

నిక్కి యెండదాఁకనేల నీడకుఁబోనేల నాకు
చక్కనినీకెమ్మోవి చవిగొంటే చాలును ॥ పల్లవి

కందువ నీమాటలకుఁ గల్లపరచఁగనేల
అందుకొని అవి నిజమననేల
నిందలాడేవారు నీవు నెఱిఁ దగవాడుకోఁగా
విందువలెఁ జెవులార వింటే నాకుఁ జాలును ॥ నిక్కి

గుట్టున నీచేఁతలకుఁ గోపగించుకొననేల
వెట్టఁబడి కమ్మటిని వేఁడుకోనేల
తిట్టులాడి నీవు వారుఁ దిదీపులాడఁగాను
నట్టనడుమ నేవచ్చి నవ్వితే చాలును ॥ నిక్కి ॥

చేసన్నచేసి నిన్నుఁ జేరఁ బిలువఁగ నేల
దోసాలు నీపై నించి తోయనేల
సేసవెట్టి కడపలో శ్రీవేంకటేశ నన్ను
వాసిమీరఁ గూడితివి వద్దనుంటేఁ జాలును ॥ నిక్కి ॥ 493

చిగురో చేఁగ చూపఁజెల్లదే నీకు
  అగపడె నీరమణుఁ డదిగో నీకు

వలపులే కడుఁబెంచి వాలుకరెప్పలు వంచి
  సెలవినవ్వులనేల చిందేవే సిగ్గు
  నిలువునఁ దమిరేఁచి నెయ్యపుటాసలు పూఁచి
  మలసి యంతలోనే మానవేలే నీకు

మాటలతేనెలు చూపి మదనముద్రలు మోపి
  యీటునఁ దలఁపుమాటు కేల పొయ్యేవే
  గీఁటుచుఁ గన్నుల నవ్వి కిందటిమోహాలు దవ్వి
  మాటికిమాటికి మేనిమఱపేలే నీకు

కాఁగిటిరతికిఁ జొచ్చి కమ్మటి నీకెమ్మోవి ఇచ్చి
  కాఁగినగుబ్బలనేల ఘాతసేసేవే
  వీఁగుచుఁ గూడితివి శ్రీవేంకటేశుని వి(ని?)ట్టె
  మూఁగినపులకల యీమోపేలే నీకు ॥ చి

సాళంగనాట

[1] అరుదు రామునిచేఁత లదిగో పుష్పకమును
  సొరిది మనబాలుతే సోద్యము గదమ్మా

హరునివిల్లు విరిచె అట్టె సీతఁ బెండ్లాడె
  పరశురాముని బాహుబలము గొనె
  సురలకు మునులకు సొరిది నభయమిచ్చె

వాలిఁ గొటి సుగ్రీవువరరాజ్య మిచ్చెనట
చాలుగాఁ గొండలనే జలధిగట్టి
తీలుగా రావణుఁ జంపి తెగి లంక సాధించి
వాలినసేనలఁ గూడి వచ్చెనటవమ్మా

కాంతయైనసీతఁ గూడి కలుషములెల్లఁ బాపి
పంతమ తో విభీషణుఁ బట్టముగట్టి
ఇంతటా శ్రీవేంకటాద్రి నిరవున వేఁటలాడి
వంతులకు రాజ్య మేలవచ్చెనటవమ్మా ॥

వేళావళి

అన్నియు నందె యున్నవి అదిగో మాట
యెన్నుకొనె దినములు ఇదిగో మాట

సీత నీకుఁ జెప్పి పంపి శిరోమణి నీకిచ్చె-
నాతల నే మెఱఁగము అదేమాట
[1]చేతినీవుంగరమును శిరసున నెత్తుకొనె
యేతలఁపు లెట్లానో ఇదిగో మాట

తాడుపడ్డమేనితోడ తలఁపు నీకొప్పగించి
యేదవుశా నెఱఁగదు ఇదివో మాట
పాడిదప్ప దించుకంతా పదిల మాకెగుణము
ఆడ నేమిఁ జోటులేదు అదిగో మాట

తెలివ నీకు బాసిచ్చె దేవతలమాట విను
యెఱిఁగినదే ఇందరు ఇదిగో మాట

అంటితెనె లోనైతి వయ్యో నాయకుఁడా ॥పల్లవి॥

కన్నులనే మాటలాడి కప్పురపుసిగ్గు చల్లి
కిన్నెరమీంట్ల నాకె గిలిగించెను
నిన్నుఁ జూడవలె నింక నిలువెల్లాఁ జెమరించి
అన్నిటా మెయిమఱచితి వయ్యో నాయకుఁడా ॥కంటి॥

వయ్యెద బయలుచేసి పగడవాతెర చూపి
తియ్యనివలపులనే తేలించెను
[1]నియ్యిచ్చ దెలి*సిదెపో నివ్వెరగు నీకు నిందె
అయ్యెడ నుండి పాయవు అయ్యో నాయకుఁడా ॥కంటి॥

కాఁగిటనే వలవేసి కందువ రతికిఁదీసి
తీఁగెసరసాల నాకె తెరవేసెను
పీఁగక శ్రీవేంకటేశ వేగిరమే ఆకెఁ గూడి
ఆఁగి నన్నుఁ గూడితివి అయ్యో నాయకుఁడా ॥కంటి॥ 497

రేకు 986 హిజ్జిజి

ఎదురుచూచీఁ జెలి యేమయ్యా
నిదుర కన్నులఁ దేరీ నీ కేలయ్యా ॥పల్లవి॥

చెక్కుటఁబెట్టినచెయ్యి చిత్తములోపలినుయ్యి
యెక్కడికిఁ గాదు చెలి యేమయ్యా
పక్కననవ్వేవు కొప్పు పైపైగోర దువ్వేవు
నెక్కొని వట్టిదోసాలు నీకేలయ్యా ॥ఎదు॥

1. నీ+ఇచ్చ. ఇవి యీ వాఙ్మయములో కొన్నిచోట్ల వింతలు.

పాదపునెలల వ్రాఁత బలిసె నూరుపుమోఁత
యీదెస చెలియకేల యేమయ్యా
మోదమున నొరగేవు మొక్కులానఁ దిరిగేవు
నీదయ నేఁడు దాఁచఁగ నీకేలయ్యా ॥ ఎదు

మూపుపై జారినకొప్పు ముంచినచెమటచొప్పు
యేపొద్దుఁ జెలికిఁ బాయ దేమయ్యా
దాపై శ్రీవేంకటేశ తరుణిఁ గూడితి విట్టె
నీపరవశాలు చూప నీకేలయ్యా ॥ ఎదు ॥ 4

వరాళి

ఎవ్వరి నడుగనేల యేడలేనియానలేల
దివ్వె చేతఁబట్టుకొని తెరువు దప్పకురా ॥ పల్లవి

పంతమాడ నోపఁగాని భావము నీ దిట్టిదని
పొంతనే నేఁ డక్కునను బోసి చూపేరా
యెంతదాఁచినను బోదు యేల నాతో బొంక నీవు
అంతా నీకే కానవచ్చీ నద్దము చూచుకోరా ॥ ఎవ్వ

నిన్నుఁ గల్ల సేయఁ గాని నీకుఁ గలమోహమెల్లా
వన్నెగాఁ బూవులచేరువలె నెత్తేరా
కన్ను గిరిపితేఁ గాదు కాంతలెల్లా నెరిఁగిరి
మొన్నటినిన్నటివి నీమోముపై నున్నవిరా ॥ ఎవ్వ

వాదడువఁ జాలఁగాని వక్కణించి నీ గుట్టెల్లా

నీకుఁ దెలయదుగాక నీమంచిగుణాలే కావా
పైకొని మమ్మింతచేసి భ్రమయించేవి ॥పల్లవి॥

వంచి నీరెప్పలలోనివాలుకచూపులు గావా
మంచితనమున నామెయి మఱపించేవి
ఇంచుకంత నెలవుల యీనవ్వులే కావా
తుంచి తుంచి ఆయములు తూరిపారేవి ॥నీకుఁ॥

కొంత కొంత గొణఁగుల కొనమాటలే కావా
చింతతో నాచెక్కిటికిఁ జేయి దెచ్చేవి
పంతపుటలుకలతో పచ్చివొట్లే కావా
అంతలోనే నన్నుసురనిపించేవి ॥నీకుఁ॥

కూరిమి నీ వేకతానఁ గూడినరతులే కావా
తారుకాణలై సారెఁ దలఁపించేవి
యీరీతి శ్రీవేంకటేశ యిద్దరము నున్నారము
సారె నీపొందులేకావా చవులయినవి ॥నీకుఁ॥ 500

శంకరాభరణం

మొదల నేమి నెఱఁగదాయ ముంచిన దెంతపరవశంబో
కదిసినప్పటిచేఁతలు; విభునిఁ గనుచు విభుని దూరెను ॥పల్లవి॥

ఇంతి మోము గడుగఁబోయి యెలమి దోసిట నీరు నించి
అంతట మోవికెంపులనీడ యందుఁ జూచి నవ్వెను

కళలు చెదరఁగనియలు చూచి గక్కన నగ్గిన మొనఁ
చెలులమీఁదఁ జేయివేసి చేతనున్నవిభునివేలి—
అలరుముద్దుటుంగరంబు అపుడు చూచి భ్రమసెను ॥

పానుపుమీఁదఁ బవ్వళించ పడఁతి యేఁగి యందుమీఁద
తానకమైనవిభునిఁ జూచి దగ్గరి కాఁగిలించెను
ఆనిన శ్రీవేంకటేశుఁ డంతటిజాణ గనక కలసి
మోనముతోడఁ జొక్కిచొక్కి మున్నిటివెల్ల నడిగెన
॥ మొ

పాడి

ఇంచుకంత చాలదా యీడవారికి
పెంచిపెంచి నీవె రచ్చఁబెట్టుకోవయ్యా ॥

చిటుకంటేఁ జాలదా సిగ్గుగలదానికి
తటుకన నీవద్దఁ దలవంచను
కటకట నవ్వఁబోయి కన్నవారిచేతనెల్ల
దిటముగా నీవలెఁ దిట్టించుకోవలెనా ॥

గొణఁగితేఁ జాలదా గుటుతోడిదానికి
వొణఁకె(కు?)తోఁ గన్నుల నీ రొలికించను
అణఁగక కన్నవారి ఆయాలకుఁ జేచాఁచి
సణఁగుల నీవలె [illegible]ంకేఁబడవలెనా ॥

డగరితేఁ జాలదా తమకించేదానికి
వొగ్గినరతులలో నోలలాడను
నిగ్గుల(శ్రీ)వేంకటేశ నీవు నన్నుఁ గూడితివి

యివ్వల దగ్గరికినజా కిది వెద్దలా ॥ పల్లవి ॥

మానరా నీవు నాతోడిమందెమేళాలు
నానఁబెట్టి యేడనైనా నవ్వవచ్చేవు
నేనూ నీపొరుగైతే నేరమాయనా
పూని మావారిదిగంటే పోరులు రావా ॥ ఎవ్వ ॥

గుట్టుతోడ నుండరా కొంతైనా నీవు
చిట్టకానకు నామీఁదఁ జేయివేసేవు
ఇట్టె నీమోము చూచితే నియ్యకొంటినా
గట్టిగా మగనాలనుఁ గానా నేను ॥ ఎవ్వ ॥

ఆయరా నేఁ డింతలోనే అన్నిపన్నులు
ఆయములు సోఁక నన్ను నానవెట్టేవు
యీయెడ శ్రీవేంకటేశ యెనసితివి । నన్ను
చాయల సన్నల నిద్దె సతమాయఁగా ॥ ఎవ్వ ॥ 503

987 పాడి

ఈవల కాంతలగుణా లేకమే కావా
పూవులవాటు కోపవు పూఁపవాటు కోపేవా ॥ పల్లవి ॥

కప్పురపువీడెముతో కలికి మాటలాడఁగ
దప్పిదేరే వేఁటికోయి దగ్గరివుండి
చెప్పరానికారాలే చిందీ మాకన్నులను

యెగువ నన్నుఁ బిలిచే విందు కోపేవా ॥ ఈ

అద్దపుమెఱుఁగుఁజెక్కులాకె నిన్ను వలపించి
ముద్దుచూపితే భ్రమసి మోమువంచేవు
పొద్దుపొడపుగోళ్ళపొలఁతి నన్నుఁ గూడితి—
విద్దరికి శ్రీవేంకటేశ వోపేవా ॥ ఈవ ॥

తోండి

కానీవే గొల్లెతా కమ్మటి నవ్వకువే
నాననీవే రేపటికి నయమవును దాఁచవే ॥ పల్లవి

తీపుచేసి వలపులు తీర నాపైఁ జల్లకువే
పోపో నీగొల్లచల్ల పుల్లనేకాదా
మాపటంత వచ్చేఁగాని మగుడి చూడకువే
చేపట్టి చూడఁజూడఁగ చీఁకటింద్లే వెలుఁగు ॥ కానీ ॥

మాటలనే నామీఁద మందులు నూరకువే
మూటగట్టితే గొల్లముంజులేకావా
చీటికిమాటికి నాపై చేతులు చాఁచకువే
వాఁటమైతే నీరు[1]వారు వచ్చే నే నాడకు ॥ కానీ ॥

వేయవట్టి తియ్యకువే చేరి నన్ను లోనికి
పాయపుగొల్లెతలకు బలువేకాదా
వేయిటికిఁ గూడితి శ్రీవేంకటేశుఁడను నేను
యీామెడ జాతొకటాయ నింటికి వచ్చేనే ॥ కానీ ॥ 505

1. నీరు + పారు

ఎట్టు నమ్మవచ్చునే ఇంతి నీమనసు నేఁడు
వొట్టి యొకవేళబుద్ధి యొకవేళ వచ్చునా ॥ పల్లవి

వెన్నెలబయట నుండి వేఁడిఁబడి యుండాఁగా
సన్నల నీపతిఁ గూడి చల్లనైతివి
వున్నతపుఁజందురుఁ డొక్కఁడే వెన్నెలొక్కటే
కన్నెభావాలు రెండుగతులాయ నివిగో ॥ ఎట్టు

కోయిలకూఁతలకే గుండె బెదరి యుండాఁగా
యీయెడ నీపతిఁ గూడి యిచ్చగించేవు
ఆయెడాఁ బలు కొక్కటే అప్పటి నీవు నీవే
రాయడి నీగుణములే రండుదెఱఁగులాయ ॥ ఎట్టు ॥

వేడుక చల్లగాలికి విసిగితి వుండాఁగా
కూడి శ్రీవేంకటేశుతో కోరే వదియే
ఆడనే నీయాలవట్ట మదియును నొకటే
యిండా నాడాఁ దలపోఁత లివియే వేరు ॥ ఎట్టు ॥ 50[illegible]

లలిత

ఊరకే గడించుకొనీ నోయమ్మా । తన—
నోరే ఘనముచేసీనో చూడరమ్మా ॥ పల్లవి ॥

తనివార నొకమాఁటు తప్పక చూచితి నింతే
వెనక తనచేఁతకు వెంగెమా యిది

గొబ్బునను దనమోఁది కోపమా యిది
విబ్బరానఁ దనమూఁతే విఱమంటేఁగాక నేను
దబ్బరలుచేసినట్టితలఁపా యిది ॥ ఊర ॥

కడుఁదమకానఁ దన్నుఁ గాఁగిట నించితిఁగాక
సుడిగొన్నతమకాఁక చూచుటా యిది
యెడయక శ్రీవేంకటేశుఁడు గాఁగాఁ దన్ను
బడివాయఁగాక యిది పైయద్దికములా ॥ ఊర ॥ 507

భైరవి

తరవాతిపనులెల్లఁ దా నెఱఁగఁడా
విరుదే నెరపుఁగాక పిలిపించనేఁటికే ॥ పల్లవి ॥

గోరుకొన సోఁకకతాలుతే కోపగించేవాఁడు తాను
యీరీతి నుంగరము నా కేఁటి కంపెనే
పీరివారిమాటలకు వెఱ పింతగలవాఁడు
దారకుఁడై వుండుఁగాక దగ్గరి రానేఁటికే ॥ తర ॥

వీసము నేయనందుకే విడనాడేవాఁడు దాను
ఆసమాటలేల చెప్పియంపెనే నాఁడు
వాసిమెరమెచ్చులకు బయలీఁదించేటివాఁడు
వేసాన నే నున్నచోటు వెదకఁగనేఁటికే ॥ తర ॥

అండకు రాకమునుపే యంతా మఱచేవాఁడు
నిండినమోహము నాపై నించనేఁటికే
మెండగు శ్రీవేంకటాద్రిమేటి ఇతఁడె వచ్చి గూడె

పాడి

గుట్టున నుండుటచాలు కూడివచ్చేకా
అట్టె ఆమీఁదిపను లప్పుడే చెప్పేమ ॥ పల్లవి ॥

చూడకురా అద్దము సొంపగు నీ నుదుటను
యేదో లత్తుక చూచి యెంత సిగ్గవునో
ఆడకురా మాఁటలు ఆయపునీమోవిమీఁది-
నీడ కెంపులు లాఁగితే నీ కెంత నొచ్చునో ॥ గుట్టు ॥

వెలి వెళ్ళకురా నీవేఁడిచెమట గారితే
చెలుల యెదుట నెంత చింత పుట్టునో
కులికి నవ్వకురా కొప్పు నేస రాలితే
యెలమి నీబాసలు ని న్నేమనునో ॥ గుట్టు ॥

కాఁగిటఁ బెనఁగకురా కమ్మఁగస్తూరిబేంట్లు
చేఁగలై రాలితే నీచిత్త మెట్టవునో
తూఁగుబడి నన్ను నీవు తోడుతనే కూడితివి
పాఁగినశ్రీవేంకటేశ పచ్చి యెంత దోఁచునో ॥ గుట్టు ॥ 50

988 ఆహిరి

చిక్కితి మీపాలనూ చేయరె యీవేళనూ
ఇక్కడనే వేగిరించే రేమందు నేనూ ॥ పల్లవి ॥

చెక్కిటిమీఁదికి చెయ్యి చిత్తములోనిది నుయ్యి

నెలవులనే నగవు చెప్పఁబోతేనే బిగువు
యెలమి మీరు మొక్కఁగ నే నేమందునే ॥

చెదరిన నీ(యీ?)కురులు నేసకొప్పున విరులు
తుదమొద లెఱుఁగరు తొలఁగరే
యెదుట శ్రీవేంకటేశుఁ డిదె వచ్చి నన్నుఁ గూడె
నిదెవో మీతో నింక నేమందు నేను ॥ చిక్కి

శ్రీరాగం

ఇచ్చకమే మదిఁ దోఁచీ నేమందునే
వచ్చినది పదివేలు వాని నేమందునే

కన్నులఁ జూచినప్పుడే కాఁకలెల్లాఁ బెడఁబాసె
యెన్నికల కేదలేదు యేమందునే
మున్నిటినుద్దు లెంచితే మోహములు చవిదప్పీ
విన్నదే విందవుత మేలు విభుని నేమందునే

నెలవి నవ్వినప్పుడే చిక్కులెల్లాఁ బెడఁబాసె
యెలయించఁ దరిగాదు యేమందునే
పలికితే సంతోషభావములు చవిదప్పీ
పిలుపే కోటానఁగోటి ప్రియుని నేమందునే

కాఁగిట నించినప్పుడే కడమలు వాసె నిట్టె
యేఁగకున్నఁ జవిదప్పీ నేమందునే
పాఁగినశ్రీవేంకటాద్రిపతి యిన్నిటా నాతో

నీవు మంచివాఁడవు నిచ్చలు నన్ను
చేవముంటి(ముట్టి?) వోటులై చిమ్మిరేఁచీఁగాని ॥పల్లవి॥

కన్నులు నీవి మంచివి కడలఁ గెంపులు నిండి
యెన్నఁగఁ గోపమురేఁచె నిదే కానిది
అన్నిటా నీమాట లెస్స అందులోనే దగదొట్టి
విన్నని నీయలపులే వెతరేఁచీఁ గాని ॥నీవు॥

ముంగిటినవ్వు మంచిది మోవిని వొక్కులు నాకు
చెంగటఁ జిగురుచేఁదులే చేసీఁగాని
అంగడిఁ జక్కనివాఁడ వౌదువు నీమేనిమీఁది—
వుంగిటివింతవాసన లుడికించీఁగాని ॥నీవు॥

అతిరతి నీయధరామృతము తియ్యనే
సతులెల్లాఁ జవిగొంటేఁ జప్పన గాని
ఇతవుగా శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
కతలుగావా నిన్నుఁ గైకొంటిఁ గాని ॥నీవు॥ 51

ఆందోళి

ఇంతులాల నావంక నిదే తప్పు
కొంతైనాఁ బిలువనంటాఁ గొసరీ మనసు ॥పల్లవి॥

మాటకు మాటాడను మరి కల్లలెంచను
నాఁటుకొన్న చూపులతో నవ్వితి నేను
గీఁటెఁ గొనగోరఁ దానే కిందుపడ నొక్కెఁ దానే

పతికిఁ బతి సేయను పను లేమి నడుగను
అతికాంక్షఁ దనమేనే అంటితి నేను
కతలు చెప్పీఁ దానే ఘాతలు సేసీఁ దానే
తతితో దగ్గరనంటాఁ దమకించీఁ దాను

కాదుగూడ దనను కలికరి సేయను
యీదెసఁ దనకుఁ బంతమిచ్చితి నేను
నేదదేర నన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడు దానె
పోదితో మెచ్చితినంటాఁ బొదిగీఁ దాను ॥ ౩

లలిత

[1]నవ్వితినే గొల్లెతా నాయ మపుర గొల్లఁడా
యెవ్వ రేమనిరే నిన్ను నియ్యకొంటిఁ బదరా

కానీవే గొల్లెతా కద్దులేరా గొల్లఁడా
పోనా మఱవకువే అట్టె కానీరా
నే నేమంటిని నిన్ను నీకే తెలుసురా
మానితినే ఆమాట మంచిదాయఁ బదరా

అదియేమే గొల్లెతా అందుకేరా గొల్లఁడా
కదిసెఁ గడుపనులు కల్లగాదురా
ఇది నిక్కమటవే ఇంతకంటె నటరా
పదరకువే నీవు పలుమారు నేలరా

మెచ్చితినే గొల్లెతా మేలు లేరా గొల్లఁడా

మరిగిననీకేకాక మాకేలరా
తెరమఱఁ గింతే నీవు తీసివేయనేలరా ॥ పల్లవి ॥

అడకురా నాముందర ఆకెగుణములు సారె
గోడ గడుగ నసలే కుప్పవడీని
వోడక నీ కితవైతే వుట్టి గట్టు కుందు గాని
సూడుబంటుతో బలాలు చూపి చెప్పనేలరా ॥ మరి ॥

యెంచకురా ఆకెపొందు యెక్కుడుగా నాయెదుట
యెంచఁబోతే మంచముకిందింతా నుయ్యే
కంచముపొత్తు గలితే కలవెల్లా నితవుగా-
నించుకాఁ జలిలేకున్న నేండగాయ నేలరా ॥ మరి ॥

తప్పకురా ఆకెచీర గట్టుకొంటి వదె నీవు
వుప్పొలికి యినుమడౌ నొద్దికై తేను
యిప్పుడె శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
దప్పికి నీరేకాక తగ నీ నెయ్యేలరా ॥ మరి ॥ 515

989 లలిత

ఎంతటఁగాని మెచ్చవు ఇంకా నిది
పంతానకు నీవే పైకొనపద్దా యిది ॥ పల్లవి ॥

పక్క(క్క?)న నలిగినట్టిపడఁతి ఇవ్వలిమోమై

వలవంతఁ గోపగించి వంచినట్టిరెప్పలను
 మెలుపున నిన్నుఁ జూచె మేలుగా యిది
 చలములే యిందాఁకా సాదించినట్టినీ—
 చెలియ నీతో నవ్వె చెల్లదా యిది ॥ఎంత॥

వేఁడుక నీవు వట్టితే విదిలించుకొన్నచేత
 పీడెమిచ్చి వూరకుండె వెలితా యిది
 వీడుపడ్డచోనె శ్రీవేంకటేశ కూడెఁ జెలి
 యీడఁ దనివిదీరదా ఇంకా నిది ॥ఎంత॥ 51

హిందోళం

నీడా యండా నొక్కటే నినుబోఁటికి
 ఆడకురా మారుమాట లాయనాయఁ బదరా ॥పల్లవి॥

తెల్లనివెల్లాఁ బాలే తెలిసితి వవులేరా
 గొల్లదోమటాయ [1]నాఁడుఁగులమెల్లాను
 చల్లలమ్మఁ బోనీరా సారె నన్నుఁ బట్టకుం-
 చల్లువలపులు పైపైఁ జప్పనాయఁ బదరా ॥నీడా॥

కన్నదే కంటి గురుమ కంటివి నీవవులేరా
 అన్నిటా నీ కాఁడుఁబోడి అగ్గువా యను
 నన్ను నింటి కేఁగనీరా నవ్వులెల్లఁ జాలుఁజాలు
 వెన్న నున్నగా నూరితే వేసటాయఁ బదరా ॥నీడా॥

పట్టినదే పంతమాయఁ బైకొంటి వవులేరా
 కట్టినకంకణమాయఁ గొంతలెల్లాను

## శంకరాభరణం

ఎరవులకోపఁ బిఁ(పంబిఁ?)కనెల
   తెరమఱఁగున నిఁకఁ దిరుగఁగవలదే ॥ పల్లవి

చెలియ నీనగవు నెలవుల నుండఁగ
   యెలమి మారుమొగ మిఁకఁ దగదే
   కలిగినయాసలు కన్నుల నుండఁగ
   చలముల బొమ్మల జంకెన దగదే ॥ ఎర

ననుపులమాఁటలు నాలుక నుండఁగ
   పెనఁగేటిబిగువులు పెంచకువే
   చెనకేటితమకము చేతుల నుండఁగ
   యెనలేనిజగడ మిఁకఁ బేర్చకువే ॥ ఎర

కరఁగినభావము కాఁగిట నుండఁగ
   పరగేటిమోనము పనిలేదే
   యిరవుగ శ్రీవేంకటేశుఁడఁ గూడితి
   సరి వెనకటి వెంచఁగఁ బనిలదే ॥ ఎర ॥ 5

## శ్రీరాగం

నిన్నుఁ బాసి రమణికి నిమిష మెందును [1]నేఁడే
   మన్నించితి రమణుఁడ మాచెలిని నేఁడే ॥ పల్లవి

చిత్తమెల్లా నీరాయ చెమట లేరులు వారె
   యెత్తినవానకాల మింతా నేఁడే
   [illegible]

[illegible]

చలిమంచికాలాలు సతికి నేఁడే

తలఁపెల్లాఁ జిగిరించె తమకపుటెండ గాసె

వెలయువసంతము వేసవియు నేఁడే ॥ నిన్నుఁ॥

పగడపుమోవివంటిపచ్చివెచ్చికొండ నిండె

మొగి యామనికాలము మొదల నేఁడే

నిగిడి శ్రీవేంకటేశ నీవే యింతిఁ గూడితివి

బగివాయ నిద్దరికిఁ బండుగలు నేఁడే ॥ నిన్నుఁ॥ 51

లలిత

జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామవీరలక్ష్మి

ప్రియురాలవై హరికిఁ బెరసితివమ్మా ॥ పల్లవి॥

పాలజలనిధిలోని పసనైనమీఁగడ

మేలిమితామరలోని మించువాసన

నీలవర్ణునురముపై నిండిననిధానమవై

యేలేవు లోకములు మమ్మేలవమ్మా ॥ జయ॥

చందురుతోడఁబుట్టినసంపదలమెఱుఁగవో

కందువ బ్రహ్మలఁ గాచేకల్పవల్లి

అందినగోవిందునికి అండనే తోడునీడవై

వుందానవు మాఇంటనే వుండవమ్మా ॥ జయ॥

పదియారువన్నెలతో బంగారుపతిమ

చెదరనివేదములచిగురుఁబోడి

యెదుట శ్రీవేంకటేశునిల్లాలవై నీవు

చెలువుఁడ యెంతైనాఁ జెల్లదా నీకు
నెలవు వెట్టితి మాకు చెల్లదా నీకు

వొరసి నేమిద్దరము నూరకే వాదు లడువఁగ
శిరసువంచుకుండఁగఁ జెల్లదా నీకు
పరగ మాలో నేమే పగలు చాటుకోఁగా
సిరులతో నవ్వేవు చెల్లదా నీకు

ముప్పిరి నీకుఁగా మొకాలు చూడకుండఁగ
చెప్పవచ్చేవు సాకిరి చెల్లదా నీకు
రెప్పలతుదల మాకు రేసులు వుంటుండఁగాను
చిప్పిలి మోముకళలు చెల్లదా నీకు

యిక్కడనే దగ్గరితి మిందరినడుమా వచ్చి
చెక్కుల నొక్కేవు యింతచెల్లదా నీకు
మక్కువ శ్రీవేంకటేశ మమ్ముఁగూడితి విద్దరి
చిక్కితిమి నీపాలఁ జెల్లదా నీకు ॥ చె

రేకు 990 హిజ్జిజి

ఒకటిపై నొకటేల వొద్దే యింత
చికురము పీడెఁ జాలు సిగ్గులు నీకేలే

తియ్యనిపెదవినోటఁ దెగి వెంగెమాడఁబోతే
వొయ్యనే కారములయ్యీఁ వొద్దే యింత

వుల్లసపుచేఁగదేరీ వొద్దే యింత
చెల్లఁబో నడపుకరి సింహమునడుము నీపై
పెల్లునఁ బెనఁగీ నాతోఁ బెనఁగ నీకేలే ॥ ఒక

మెత్తనితామెరచేత మీఁటి నన్ను దొబ్బఁబోతె
వొత్తి మరునమ్ములయ్యీ వొద్దే యింత
యెత్తి నిన్ను శ్రీవేంకటేశుఁడ నేఁ గలసితి
హొత్తులరతులు చెల్లె పూఁపనవ్వు లేలే ॥ ఒక ॥ 52

## శంకరాభరణం

ఎట్టు గడించుకొంటివే ఇవి చక్కఁదనమంటా
చుట్టములు గావే అవే సూడుబంట్లు ॥ పల్లవి

తామెరలవంటివేమో తరుణి నీకన్నులు ఆ—
తామెరలే మరునికి తగ బాణాలు
సోమునివంటిదే నీసొఁపై(సొంపై?)నమొగము ఆ—
సోముఁ డాతనిఁ గలసి జోడౌతెఱఁగవా ॥ ఎట్టు

జక్కవలఁ బోలినవి సతి నీకుచములు ఆ—
జక్కవలే మరునికిఁ జనవరులు
మిక్కిలితేంట్లఁ బోలె మేలిమి నీకురులు
పక్కన నాతని కవి బంట్లౌతెఱఁగవా ॥ ఎట్టు

చిగురుఁ బోలినదె చెలియ నీమేను ఆ—
చిగురేపో మరునికిఁ జేకత్తులు

నీకే తెలుసుఁగాక నీవొళ్ళిపనులు
కై కొని యెఱుఁగుదుమా కదమ నున్నవారము ॥ పల్లవి ॥

ఔరా నీమాట నిజమందునో కల్లందునో
దూరి దూరి యేమన్నా దోసమయ్యీని
యేరా నీమోవి యిది యెంగిలో పావనమో
యేరుపరచ వెఱతు మెఱఁగ మిఁ తే(మింతే?)సి ॥ నీకే ॥

యేచిననీకన్ను లవి యెఱ్ఱనో తెల్లనో
సూచించితే నిజము నిష్ఠూరమయ్యీని
తాచి నీగుణము మంచితనమో కపటమో
చేచేత నడుగరా చెప్పేరు వీధిని ॥ నీకే ॥

నీవుగా సించినచీర నీదో వారులదో
భావించి యేమన్నాఁ బచ్చిదోఁచీని
శ్రీవేంకటేశ నేఁడు చేరి నన్నుఁ గూడితివి
నీవే నే నను కొంటి నిందుకుఁడు(కుండు?) మిఁకను ॥ నీకే ॥ 524

శుద్ధవసంతం

ఇందరిలో బిగినేవు యిప్పుదేలా
విందలమాట లన్నియు నీపై నున్నవిరా ॥ పల్లవి ॥

పంతగాఁడ వవుదువు పలుకరా
యింతచాలదా కోప మిఁక నేలరా
దొంతిననది వలపు తొలఁగకురా

తొల్లి నీకు మొక్కితి దూరులేలరా
వెల్లవిరాయఁ జనులు వెంటనే రారా। నీ-
పల్లద మేమిగల్లాను పానుపుపైఁ జూపరా ॥ ఇంద ॥

డుజాణ వౌదువు కాఁగిలించరా
వడఁబడ నిఁకనేల వద్దువద్దురా
కడఁగి శ్రీవేంకటేశ కలసితిరా। నీ-
అడియాల మింతయు నాయంగముపై నించరా ॥ ఇంద ॥ 525

## దేసాళం

రవులు సతమౌనా యెందాఁకనే। కానీ
తరవాత నయ్యీఁగాక తరవెందాఁకనే ॥ పల్లవి ॥

తిఁ దనయంతటనే తనకు లేనిమోహ-
మితరులు యెచ్చరించే దెందాఁకనే
పతిఁ బిలువకతొల్లే పైకొని వచ్చేరాక
సతుల నంపఁగ వచ్చె సట లెందాఁకనే ॥ ఎర ॥

క్కువతోఁ దనంతనే మాటాడించనిమాట
యెక్కించి మీ రాడించే దెందాఁకనే
ఇక్కువ గరఁగి తానే యెదురుకొని కాఁగిలి
చిక్కి నేఁ గొసరఁగాను చేరే దెందాకనే ॥ ఎర ॥

ంతతము నిదేపనై జంటవాయకుండేపొందు
ఇంత దలఁపించి కూడే దెందాఁకనే

ఏమైనా నయ్యీఁగాక యెందాఁకనే
ఆమనిపచ్చలమీఁదిఆస లెందాఁకనే ॥పల్లవి॥

తానే వచ్చీఁగాక తగిలి పిలువనేల
యేనుగఁ గఁబా(గంబా?)నఁ దీసే దెందాఁకనే
కానీలేవే వానిచేఁత కాదుగూడదననోప
మాననిగుణములకు మందు లెందాఁకనే ॥ఏమై॥

తీటీ నలుకలు దానే దీమస మెడలనేల
యేఱులు వంకలు దిద్దే దెందాఁకనే
ఆఱడి నేయఁగనేల అంది పొంది పాయనోప
నూతేటివెన్నలకు నును పెందాఁకనే ॥ఏమై॥

అండనే శ్రీవేంకటేశుఁ డాదరించి నన్నుఁ గూడె
యెండమావులదప్పు లెందాఁకనే
నిండుదొర పీనిమీఁద నేరమెంచ నే నోప
వండ వండనట్లయినవాసు లెందాఁకానే ॥ఏమై॥ 52

991 శంకరాభరణం

ఇందాఁకా నెందు వోతివి యీపాటివాఁడవు
సందడిఁ బెండ్లి నేఁడు చక్కఁబెట్టరాదుగా ॥పల్లవి॥

నాటఁగ దొరవు నాతో నవ్వితివంటా నవ్వ
బూటకాన నే గాదెఁ బోయరాదుగా

చేగలనది వాఁటము సేయరాదుగా
తీగెల మాటలాడి తేనెలు పూసితివంటా
వేగిరించి తమకము వెళ్లఁబోయరాదుగా

కరఁగి నీ విట్టె నన్నుఁ గాఁగిలించితివంటా
మరునమ్ము వాఁడిచెడ మందు లేదుగా
ఇరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
వొరసి నిన్నిట్లాడకుండరాదుగా ॥ ఇ

ముఖారి

నిజమాడరా నాతో నీవు నీవే
[1] బజనచెడ్డవలపు పనిలేదురా

అరయ నామీఁదితలఁ పంత నీ కున్నదా
వరుస వంతుకు నేనే వచ్చేఁగాక
సరసమాడేయందు చవిగద్దా నామీఁద
వొరసిన నాచేతివొత్తులుగాక

వసమా నాకు నీవు వద్ద నుండి వూరకైనా
అసమదించనిమాట లాడేఁగాక
సుసరమా నీపొందు సుదతు లిందరిలోన
కసుగాటు నీవలపు కైకొనేఁగాక

ఆరీతి నాపై తమక మంత నీకుఁ గలదా
గోరపెట్టి నిన్ను నేనే కూడేఁగాక
సేరిచి యానవెట్టేవు నీవు నాపై మోహమంటా

ఆయనాయ నూరకుండు మంతే చాలు
చాయలు సన్నలు నైతేఁ జప్పనయ్యా నీకను ॥

కన్నులు దెరచి చెలి గక్కున రెప్పలు వంచె
వెన్నెలో అది నీకు వేసఁగో కాని
మున్నిటిమీమోహములముచ్చటలకొలఁ దింతే
పన్ని నేము చెప్పఁబోతే పచ్చిదోఁచు నీకను

పెదవులు గదలించి పేరుకొన కూరకుండె-
నది నీకుఁ జిగురో చేగాయనో కాని
యెదుట మీలోలోనే యెనసినకొలఁ దింతే
పొదిగి యేమన్నాను పొరయెత్తీ నీకను

చేరి నీయెదుట నుండి చిఱునవ్వు నవ్వె నింతె
పేరడి నీకవి పాలో పెరుగోకాని
కూరిమి శ్రీవేంకటేశ కూడితి రిద్దరు నిట్టె
మేరతో నెవ్వ రేమన్నా మితిమీరీ నీకను ॥ అం

సామంతం

చెలిపలుకులే నీసింగారము
అలరె నీకిన్నియును అవధారు నేఁడు ॥

అంగన నిన్నుఁ గూడఁగ నటు నీపై వడిసేటి-
అంగపుఁజెమట నీకు నభిషేకము

అంచులుమోవ విసరేయాలవట్టాలు
అంచెల మర్మముసోఁక నాడుకొనేమాటలే
కాంచనపుగిన్నెలతో కప్పురబాగాలు

వవిత విడెముతోడ వంచినమోవితేనె
నను పైననీకు మహానైవేద్యము
యెనసి శ్రీవేంకటేశ యిన్నియుఁ గలిగె నీకు
ఘనగోరిమాచేతిమొక్కు లిందవయ్యా ॥చె

రామక్రియ

ఏరా నీవప్పుడే నన్ను నెంతగాఁ జూచితివి
మేరమీరి నీచేతనే మెప్పించుకోనోపనా

ఇట్టె నామోహము నీవే యెఱిఁగేవనుంటిఁ గాక
నెట్టన నిన్ను రప్పించనేరనా నేను
చిట్టకానకు నన్నింత సేయవని వుంటిఁగాక
గట్టిగా నాచేయి మీఁదుగా నడవ(ప?)నేరనా

తెమలించి నీవే మాట తీసేవని వుంటిఁగాక
తమిరేఁచి నిన్ను నాఁగ తడవా నాకు
సముఁడవై నవ్వే వింతే సటలని వుంటిఁగాక
రమణులతో నవ్వితే రచ్చసేయలేనా

అసాసల నీమాటకు నడ్డమాడనైతిఁ గాక
వాసి దెచ్చుకొని నిన్ను వంచుకోలేనా

శుద్ధవసంతం

[1] ఇన్నేసివావులతో నిందరిపాలఁ గలిగె
పిన్నపెద్దై మేలుసేసీ పెంచరే యీబాలుని ॥పల్లవి

నరకాసురునితండ్రి నడురేయి జనియించె
అరుదుగఁ గంసుని కల్లఁడాయను
నిరతి శిశుపాలునినెయ్యపుమఱఁది వుట్టె
పెరుగఁగా మేలుసేసీ పెంచరే యీబాలుని ॥ఇన్నె

వార్ధిక పాండవులకు నుదయించె మేనబావ
బుద్ధితో వసుదేవునిపుత్రుఁ డాయను
వుద్దండపుగొల్లెతల కొగి మగఁడు గలిగె
పెద్దవాఁడై మేలుసేసీ పెంచరే యీబాలుని ॥ఇన్నె

నేరనిదుష్టులకెల్లా నిండుచిచ్చరపిడుగు
నేరిచినశిష్టులకు నిధానము
యీరీతి శ్రీవేంకటేశుఁ డితఁడె బాలకృష్ణుఁడు
పేరడిగా మేలుసేసీ పెంచరే యీబాలుని ॥ఇన్నె॥ 53

కు 992 లలిత

గుఱిగా శ్రీకృష్ణుఁడు మనకు దొర దూరువాఁడు
వెఱవక చేతికొద్ది వెఱఁజరో మీరు ॥పల్లవి

పెట్టిరి గొల్లెతలెల్ల పెరుగు నెయ్యి వుట్ల
కొట్టరో కొట్టరో మీరు కోలలవారు

యెంచిపెట్టిరి దొంతుల నేడలేనిచక్కిలాలు
దించరో కుండలతోనే దిగువకును
పెంచులయినదాఁకా పెనఁగేరు మనతోడ
తుంచి నోరవేసుకొని తొలఁగరో మీరు

తక్కక యదుకులెల్లా దాఁచిరి తమసొమ్మంటా
చిక్కెఁ జిక్కెఁ దీసుకోరో సేన వున్నవి
యెక్కెను శ్రీవేంకటాద్రి ఇదివో మనకృష్ణుఁడు
చక్కనాయఁ బనులెల్లాఁ జాలించి రారో ॥గు

శంకరాభరణం

ఎవ్వనికి వలతువే చెలియా
యెవ్వలఁ బిలిచిన నెఱఁగవే చెలియా

చక్కఁగఁ బయ్యదజారిన దెఱఁగవు
యెక్కడ చూచేవే యిటు చెలియా
చెక్కులవెంటఁ జెమటలు వడియఁగ
ముక్కున నూర్పులు ముంచేవే చెలియా

జాఱినకొప్పునుఁ జక్కఁగఁ బెట్టవు
మీఱేవు పరాకున నేమే చెలియ
మాఱుమాటలును మాతో నాడవు
తీఱక లోవెలిఁ దిరిగేవే చెలియా

వెలయ హారములు వెనకకు వేసితి

ముఖారి

ఎఱఁగ విన్నవించేను యిప్పుడే నేను
తఱవాతఁ దలఁచుకో తప్పదు మాచేఁతలు ॥ పల్లవి ॥

కొప్పు ముడువఁగఁబోతే కుచములు నాటుఁ జేసు—
నప్పు డోరువఁగలవా ఆయముచోటు
చిప్పిల నేఁ జూచితేనే చెమరించె నీమేను
చెప్పి మాచేత సేవలు సేయించుకోఁగలవా ॥ ఎఱ ॥

కుంకుమ పూయఁగఁబోతే గోరికొన దాఁకుఁ జెసు
కొంకక సమ్మతించేవా గుండె దాఁకును
అంకెల మాటాడఁగా నీకట్టే మదనమెత్తె
ఇంక మావూడిగము సేయించుకోనోపేవా ॥ ఎఱఁ ॥

హారములు గట్టఁబోతే నదె కాఁగిలోఁ జేసు
యీరీతి మారుకొన నిఁక వచ్చునా
యేరా శ్రీవేంకటేశ ఇంతలోనే కూడితి
చేరి మాచేతిపనులు చిత్తమువచ్చీనా ॥ ఎఱఁ ॥ 536

శంకరాభరణం

వలపు వేఁచి కొరుకవద్దే నేఁడు
చెలి నింత సేయఁగాను నెలవేమే తనకు ॥ పల్లవి ॥

చిగురుఁబోడికి నేఁడు చింత ఇంత దగునా

కమలగంధికి నేఁడు కాఁక లింత దగునా
తమకానఁ జేకొని దయఁజూడుమనవే
అమరదు యీదోస మంతేసి మేలా
తమబోఁటు లిట్లైతేఁ దప్పించరాదనరే

వెసఁ గోమలికిని విరహము దగునా
యెసఁగి శ్రీవేంకటేశు నీపెఁ గావుమనవే
అసము దించక నేఁ డంతలో విచ్చేసి కూడె
రసికులచేఁతలెల్లా రతికెక్కెననరే ॥ వ

పాడి

ఇంత కింతే చాలదా యేఁటికమ్మా
దొంతులాయ వలపులు తొలరో వోయమ్మా ॥

ఆయనాయ వానిసుద్దు లందుకేమి నే మీకుఁ
జేయఁగల పనులకుఁ జెప్పరమ్మా
పోయినపనులు పోనీ పొద్దువోదా మీకేమి
చాయలు సన్నలు నింక చవులు గావమ్మా

యేడ నుండెనేమి వాఁడు యేమిగారణము మీకు
యీడకు వచ్చినపని యేదమ్మా
యేడకేడ తలపోఁత లింకా మరవరా
నీడలకు యెండలకుఁ గూడునా వోయమ్మా

పుక్కటి వీనికిఁగాను పూనుక రావద్దు గాని
[illegible]

ఓప నోప తియ్యకురే వొడివట్టి రమ్మంటా
యీపొద్దు కాతనివద్ది కేఁగరే మీరు

బాలేవే తనసుద్దు లందరుఁ దెలిసేరా
తేలింపుసటలు నాకే తెలుసుఁగాక
వోలి సూడుబంటౌట వొండెఁ జుట్టమవుట గాక
మైల గొంత అందులో మణుఁగూఁ గొంతా

వింటిలేవే వానికిఁగా వేఁడుకొనే మీమాఁట
రెంటికిఁ గలఁడు తనరీ తెరుఁగుదు
ఇంట నుండవలె నొండె యీడకే రావలె నొండె
కుంటెనలు గొంత మరి కూటములు గొంతా

అట్టేకాదా మీకుఁ దెల్లనైనవెల్లాఁ బాలవును
గట్టిగఁ దనగుణాలు కన్నవే నేను
యెట్టకేలకు శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
తిట్టు గొంతా ఇందాఁక దీవె నీఁకఁ గొంతా ॥

రేకు 993 శంకరాభరణం

ఊరకున్నవారి కూరోపడన్నట్లు
నేరనైతి నే నింక నిన్నేల కొసర

మగిడి చూడఁగఁగదా మనసు నీపైఁ దగిలె
[illegible]గఁగదా దైవారె వలపు
[illegible]

నాటు దమకము గదా నను( బాయనీదు
తేటతెల్లమి సేసె తెగనినాయాసలే
వాటపు(దప్పు నీవల్ల ని(కనేదీ

మొకమోటమున(గదా మొలచె నివ్వెర గొకటి
వొకటి కొకటికి లంకె లమరె మన కిపుడు
వెకలినై కూడితిని వింతగా నిను నేను
అకట శ్రీవేంకటేశ అన(గ( జోటేది ॥

వరాళి

విచ్చేయవయ్యా వెల(ది( జూతువు గాని
ఇచ్చకములాడేము యెట్టయినా(గాని

మరు(డు పువ్వుల నేసె మగువ నేలలు వ్రాసె
ఇరవగునీవలపు లింతగా( జేసె
తెరమర( గిది నీవు దీసిన(గాని పోదు
యెరవుసేయక నే మేమన్నా వాదు

చందురు(డు జామెక్కె సతి చింతలో( జిక్కె
అందపునీచలముతే అన్నియు దక్కె
నింద లిన్నియు నిట్టె నీమీ(ద గురియాయ
అందిపొంది నే(డు మాకు నాడ( జరియాయ

వల్లగాలి కడుహెచ్చె సతి గర(గ(గ(జొచ్చె
ఇల్లిదే నీమాటపట్టు లిప్పుడే వచ్చె

తానేడ నేనేడ దగ్గరి వీఁడు
పూని కన్నులఁ దిట్టినా పోఁడే వీఁడు ॥

సారెకుఁ దప్పకచూచి జాణతనాలాడీని
పోరి పోరి వద్దన్నాఁ బోఁడే వీఁడు
పేరుకొని పిలిచీని పెదవుల గొణఁగీని
పూరకున్నా నవ్వుతాను వూరసీనే వీఁడు

పానుపుపైఁ బవళించీఁ బనులుచెప్పఁ బిలిచీ
మోనాన నే నుండినాను మొక్కీనే వీఁడు
మానములు సోఁక నవ్వీ మంతనాలే వెదకీని
వీనులు చూరఁగనీఁడు విన్నపాలు వినఁడు

పట్టినచలమే పెంచీఁ బైఁ జేయివేసీని
గుట్టున నుండఁడు నాతోఁ గొంతైనా వీఁడు
ఇట్టె శ్రీవేంకటేశుఁ డేలయించి నన్నుఁ గూడె
అట్టె కెక్కించెను నన్నాఁబడిసేసి వీఁడు ॥తా

శ్రీరాగం

చెప్పఁగ సిగ్గులవడే విదే చేఁతలు నేమే కంటిమి
ఇప్పుడుగా మాకోరిక లిటు ఫలియించినది ॥

చెక్కుల జారినచెమటలు చిందరవందరకురులును
గక్కన నరవిరిబాగులు కంటిమి నీకిపుడు

కామించినభాగ్యంబులు గలిగెనే నీ కిపుడు
నేమే చెప్పిన నొల్లవు నీయంతనే నీ కిప్పుడు
యీమోహపుటసురుసురులు యెక్కడివే నీకు ॥ చె

సదమదమగురతియలపులు సారెకు సారెకు వెరగులు
నిదురలు మిక్కిలి మించెను నేఁడే నీ కిపుడు
కదియుచు శ్రీవేంకటపతికాఁగిటఁ గూడఁగఁ గలిగెను
ఇదివో ఇంతకముందర యెక్కడివే నీకు. ॥ చెప్పఁ

ముఖారి

అందరి మెప్పించుదాఁకా నణఁగేఁ గాక । నే-
నిందులోనే పాలు నీరు నేరుపరచలేనా ॥

ఇంకాఁ దానే యెరిఁగీని ఇప్పుడేలంటాఁ గాక
అంకెలం బదరనైతి నయ్యో నేను
వంకలొత్తి నేఁ దనవంటిదాననైతేఁ గన
లంకెల మీతోఁ దనలాగులెల్లఁ జెప్పనా ॥

ఇప్పటికోపము మీఁద నిట్టే వుండదని కాక
కప్పుడునాచేఁతలెల్లఁ గంటే నేను
తప్పని నాగుణములు తనగుణములఁ బోలితే
చొప్పుతో నక్కునఁ బోసి చూపనా మీకు ॥

పోరానిచుట్టరికపుపొందు దనదని కాక
చేరి నోరు మూసుకొంటి చెల్లఁబో నేను

అటుగనక నినుఁ దలఁచు కంతట నుండుటమేలు
అటుమటము లెందాఁక నంపతా నీవు

చెంతల వేరొకతెపై చిత్తము నీకుండఁగా నే
యెంతప్రియము చెప్పిన నేమి సెలవు
ఇంతట గుట్టున నుండ నెరిఁగేవు గాక నీవే
కాంతుఁడ నిద్రించువారికాళ్లు గడుగవః మా

అవ్వల నెవ్వతెపసకో అసురుసురు గాఁగ నిను
నవ్వించఁబోవు టిన్నీ నగుఁబాట్లు
దవ్వులపొందులే చవులు దగిలేవు నీవు నను
నెవ్వగ నీరువట్టుకును నేయి మందగునా

వేరే యేసతినో తలఁచి వేడుకలు చెలఁగఁగ
కూరిమి నేఁ బైకొనుట కూళతనము
చేరువనే కూడితివి శ్రీవేంకటేశ్వరుఁడ
తేరిపోయినపనికి తిరుగ మాఁటేలా ॥

రేకు 994 దేసాళం

పోయినపనులకేల పోనీవయ్యా
చాయ సేసుకొంటినా సమ్మతైతిఁ గాక

వలవవద్దంటినా వడి నీవెవ్వరికైనా
అల మాయింటికి రాకుమంటిఁ గాక

ఆడా నీడా మమ్మంటకుమంటిఁ గాక
వేడుకకాఁడవై నీవు వీధి నుండవద్దంటినా
యేడలేనిప్రియాలు నా కేఁటికంటిఁగాక ॥ పోయి ॥

నగఁగా వద్దంటినా నసుపుసతులతోడ
యిగురుమో వదుగకు మిట్టంటిఁగాక
అగపడి శ్రీవేంకటాధిప కూడితి నిన్ను
మొగమోడకుండితినా మొక్కనైతిఁ గాక ॥ పోయి ॥ 54

పాడి

వాఁడిగో దగ్గరివచ్చె వద్దే యింత
ఆఁడుదాన వెదురేఁగి యందము గైకొనవే ॥ పల్లవి

యీతఁడు విచ్చేయుటేడ ఇంతేసి మాట లేడ
రాతిరెల్లా నీవు నిద్రవోతివో పోవో
చేతికి లోనైనవేళఁ జేతురా యింత యగడు
యేతువ [1]లెత్తాడఁ బతి నిల్లాలికిఁ జెల్లునా ॥ వాఁడి

నిన్నతఁడు చూచుటెంత నీవు తలవంచుటెంత
కన్నెకోప మెంత మూఁట గట్టుకొంటివో
మన్నించవచ్చినవేళ మగవానిఁ బరతురా
తిన్ననిపంతాలు చూప దేవులకుఁ జెల్లునా ॥ వాఁడి

మగఁ డాడ వుండనేల మంచాన నీ వుండనేల
బిగువే నీకు వెన్నెతోఁ బెట్టిరో యేమో
నగుతా శ్రీవేంకటాద్రినాథుఁడు గూడెఁ గమ్మటి

నిన్నింతసేసినందుకు నే నేమిసేతు దాని
అన్నిటా నెక్కెనుఁ గోప మప్పటినుండిరా

నగవులు వెదచల్లి నయములు మాటలాడి
జిగురువలె నిన్నది చిక్కించెఁగా
పగటులు పచరించి పడఁతి కనుచూపుల
సగమే జళిపించి జట్టిగొనెఁగా

నటనలనే నడచి నంటువినయాలు సేసి
యిటువలె నది బయలీఁదించెఁగా
సటల సిగ్గులు చూపి చాయలు సన్నలు సేసి
కటకటా నిను నింత కరఁగించెఁగా

కొప్పు దువ్వి నీచెక్కు కొనగోర నంటించి
ముప్పిరిఁ జెమటలలో మునిఁగించెఁగా
ఇప్పుడె శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
అప్పు డాకె నిన్నుఁ గూడి అలయించెఁగా ॥నిన్ని

గుజ్జరి

బాపు బాపు మెచ్చితిని పదవే నీవు
తీపులోనఁ జేఁదేల తెగకువే నీవు

నెలవి నే నవ్వేటేడ చేరి నీ గొణఁగు లేడ
మెలఁకువ లెస్సాయ మేలే నీవు

పొంది నేఁ జేయిచేయి పెంత బొమ్మల నిజంకె నెంత
అందు కందుకు తెస్పాయ నౌనే నీవు
కందువై నమనలోనఁ గపట మించుక లేదు
యిందరుఁ జూడఁగఁ గోప మేడనుండి వచ్చెనే ॥

కాఁగిట నేఁ గూడు పెట్టి కరఁగే వింతలో నెట్టు
రాఁగె నిదివో వలపు రావే నీవు
చేఁగదేరఁ గూడితిని శ్రీవేంకటేశుఁడ నేను
ఆఁగినరతుల నింత అలయఁగఁదగునా ॥ బాపు

ఆహిరి

అండఁ గూచుండెను చెలి యంత చాలదా
నిండునీతో జూజమాడ నేఁడే నేరుచునా ॥

పగడవాతెర యెత్తి పలికెను చాలదా। నీవు
మగువను మంతనాన మాటాడియ్యఁగా
తగినకన్యక ఇంతే(త?)తమకించనేల
ఇగిరించె సిగ్గులు నేఁ డీప్పుడే తేరునా ॥ అ

తలుపుమాటున నుండి తమిఁ జూచెఁ జాలదా। నీవు
పిలిచి చేయివట్టి పెనఁగఁగను
చలివాయ నిప్పు డిట్టె సరసము లేల
వొలసి రట్టడితన మొక్కమాఁటే వచ్చునా ॥ అ

కాఁగిలించఁగా నీతోఁ గరఁగెను చాలదా। నీవు

గౌళ

ఏమని చెప్పదమే ఇద్దరిభావములును
ప్రేమము లీరూపములై పెనఁగఁగఁ జొచ్చినవి ॥పల్లవి॥

కోపగించుకొని రాఁగా కొంగువట్టీ రమణుఁడు
వోపనంటేఁ బెనఁగీనే వొయ్యనే చెలి
పైపై కాఁగిటఁబట్టి బలిమిసేయఁగఁబోఁగా
తీపులపెదవి వంచి తిట్టీ నతనిని ॥ఏమ॥

పెదవి గొణఁగుకోఁగా ప్రియుఁ డాకెచెక్కు నొక్కె
చెదర నాడుత(చు?) లోనై చిక్కీఁ జెలి
మొదలఁ గోలుముంచుగ మోవి గంటిసేసె నాడ
అదివో చురుముఁ(కుఁ?)జూపు లాకె చల్లీ మీఁదను ॥ఏమ॥

పక్కన నానవెట్టఁగ పానుపుపైఁ బడవేసీ
చొక్కుచుఁ గరఁగి తానే సొలసీఁ జెలి
యిక్కువైన శ్రీవేంకటేశుఁడు గూడె నిట్టె
ముక్కుమీఁదివేలితోన మోనమున నున్నది ॥ఏమ॥ 55

కు 995 అహిరి

అల్లదె మేడమీఁద నతివ
వెల్లవిరయ్యీ నిట్టె విచ్చేయవయ్యా ॥పల్లవి॥

వాలుకచూపులు నీపై వంచీ

మనసు నప్పైఁ గడుమింగి
వొనరుఁజెలులమీఁద నొరగీ
తనివిదీర దెంతైనా తానుఁ నీకే
అనయము దలఁచితి నన్నది మాపిన్నది

తమకపుఁజెమటలఁ దడిసీ
జమళికోరికలచే జడిసీ
నెమకి శ్రీవేంకటేశ నిన్నుఁ గూడి
గమ్ములై ననీగుణాలు కన్నది మాపిన్నది ॥ అ

నాదరామక్రియ

అంది తెలియఁగరాదా అంగననేరుపులెల్లా
కందువతారుకాణలు గలిగె మీకిప్పుడు

నిద్దపునొసలిమీఁద నిలువుఁగస్తురిబొట్టు
అద్దము చూచి గోర నటుదిద్దఁగా
వొద్దిక వెనకవంకననుండిననీనీడ గని
ముద్దుచూపి నన్నసేసీ మొరఁగులేలయ్యా

గుబ్బలపై మాణికాలఁ గుచ్చినహారములు
అబ్బురానఁ దలవంచి యమరించఁగా
నిబ్బరాన నీవెదుట నిలిచితే నీనీడ
గబ్బితనమునఁ గని కాఁగిలించె నదివో

మించుబంగారుపావాలు మెట్టఁగ శ్రీవేంకటేశ
చంచుల నీవును దనసరి నుండఁగా

ఫాడి

బిగిసే వింకా నీవు పిలిచినరావు
చిగురువలెనే వుండు చేఁగసుమ్మీ వలపు ॥ పల్లవి ॥

చిత్తజునియమ్ములనుఁ జెలియచూపులు లోలోఁ
బొత్తుల నున్నవి పాలువో దెన్నఁడు
హత్తినజక్కవలును నంగనచన్నులు నొక-
జొత్తుసుమ్మీ మీఁద బెత్తు చూచుకొందుగాని ॥ బిగి ॥

తుమ్మిదలపవుఁజులు తొయ్యలినెరిఁగురులు
వుమ్మడి నున్నవి పాయ కొకటొకటి
చిమ్మలపలుకులును చిలుకలుఁ దమలోన
దొమ్మిచుట్టరిక మింకఁ దోఁచినది దెరువు ॥ బిగి ॥

చందురునివెన్నెలలు సకియలేఁతనవ్వులు
ముందువెనకలు వాసి మొద లొక్కటే
ఇందునె శ్రీవేంకటేశ ఇంతనేసి కూడితివి
పొందినసతికి నీకుఁ బోదుసుమ్మీ యెపుడు ॥ బిగి ॥ 55

లలిత

చేసినట్టెల్లా నీవు సేయవయ్యా
వోసరించి నవ్వుతా నే నూరకుండే నిఁకను ॥ పల్లవి ॥

మల్లడిమీగుణములు మానుమన మాకేల

చి త్తమువచ్చినవారే చెప్పేరుగాక
మె త్తనైనచోటికే మించినగుద్దలి వాఁడి
వొ త్తనేల వింతవార మూరకుండే మీఁకను

అంగపునీరేకలు అవి చూప మాకేల
చెంగట సలిగెవారే చెప్పేరుగాక
అంగవించి శ్రీవేంకటాధిప నన్నుఁ గూడితి–
వుంగిటిరతులతోడ నూరకుండే మీఁకను ॥

శంకరాభరణం

ఇద్దరూ [1] నేకములైతే నేమాయనే
చద్దివేఁడి వలపులు జాగుసేయఁ జెల్లునా

తుమ్మెదవంటివాఁడు తొలుతనే మగవాఁడు
యెమ్మెలకు నేడనున్నా నేమాయనే
తమ్మిపువ్వువంటి దింతే తగిలినయాఁటదెల్లా
సమ్మతించవలెఁగాక సడిఁబెట్టఁజెల్లునా

వెన్నెలవంటి దింతే వెస మగవానినవ్వు
యెన్నిచోట్లఁ గాసిన నేమాయనే
యెన్నఁ జకోరాలవంటి వింతులకనుఁగొనలు
అన్నిటాఁ బొందౌటగాక అలుఁగఁగఁజెల్లునా

సిరులగాలివంటిది శ్రీవేంకటేశుమనసు
ఇరవై యెందువారినా నేమాయనే
విరులతావివంటివెలఁదివి నిన్నుఁ గూడె

అందుకే చింతయ్యీని అప్పటనుండియు నాకు
కందువ నెదుగఁబోయి కమ్మరఁ దేవుగా

పడఁతి వాని నొడఁబరచి తోడుకరావే
కడు నీనేరుపు లిందే కనుఁగొనేఁగా
వడిఁ బరాకైతినంటా వాఁడే యలిగిపోయె
బడి నేఁగి నామాఁరు పైకొని మొక్కవుగా

యెంతరానన్నా వాని నీపొద్దే తోడుకరావే
యిఁతి(యింతి?) నీవు నేసేమేలు ఇందుఁజూచేఁగా
పంత మేమోఅంటినంటా పట్టఁగా నలిగిపోయె
ఇంతలో నామాఁట వానిఇంటికి నేఁగవుగా

శ్రీవేంకటేశుని నన్నుఁ జేకొని కూడించితివే
యీవేళ నిన్ను మెచ్చే దిందువంకఁగా
పూవుల వేసితినంటాఁ బొదిగి నన్నిదె పట్టె
ఆవల నామాట నీవు అతని వేయవుగా ॥

రేకు 998 పరాశి

ఆఁడువారి కింతలోఁగే వదేమిరా
నేఁడు నాఁడు నొక్కఁడవు నీవే కదరా

నవ్వుతా గోర నిబంటె నాఁటెనంటాఁ గోపించేవు
ఇవ్వల రాకాసికయ్యా టెట్టుసేసితో
పువ్వుల వేయఁబూఁచితేఁ బొరిఁ

యెలమి రోలఁగట్టితే నెట్టుంటివో
చిలికినపన్నీటిజిగి నుద్దుకుదిచేవు
పలుజలధుల నెట్టు పవ్వళించితివిరా ॥ఆఁడు

సరి నన్నొకతెఁ గూడి సదమదమైతి విట్టె
యిరవై పదారువేల నెట్టు గూడితో
అరయ శ్రీవేంకటేశ అన్నిటా నన్నేలితివి
పరగ నాతోనే నీకు బలిమి చెల్లదురా ॥ఆఁడు॥ 5

ఆహిరి

చెప్పఁ గొలఁదులుగావు చెలియ సింగార మిది
చొప్పుగా నిందరికి సూచనై నిలిచె ॥పల్లవి

వెలఁదికుచములమీఁదివెలిపెంపుపయ్య దిదె
యెలమిఁ బోలింపరే యెట్లున్నది
కులికి పతిఁ గలియుచోఁ గురియుఁ జెమటలజడికి
మెలఁగి కొండల మొయిలు మేసినట్లాయ ॥చెప్ప

సుదతి నెన్నుదుటిపైఁ జూడఁ గుంకుమబొట్టు
యెదుటఁ బోలింపరే యెట్లున్నది
కదిసి తననాయకునిఁ గలసినప్పటివేళ
మదనరాగం బిపుడె మలసినట్లాయ ॥చెప్ప

సతితురుములో విరులు జారి పైరాలె నిదె
యితరులకుఁ బోలించ నెట్లున్నది

ఱఁగఁజొమ్మి యపు డేమీ నేను
మొఱఁగు లన్నిటికిని మొక్కే నే నిపుడు ॥ పల్లవి ॥

క్కమును దొరవంటా నిన్నుఁ జూడవచ్చితేను
చిక్కనివలపు నామైఁ జిమ్మిరేఁచితి
నెక్కొని నేఁ గళదాఁకి నీమీఁద నొరగితి
తక్కక నాకాలు చేయి దాఁకదుగదా ॥ ఎఱఁ ॥

ంటి నీ వున్నాఁడవంటా వూరకే నే వచ్చితేను
యింటివా రెఱఁగకుండా నింత సేసితి
జంటనై కాదనలేక సరిగా నేఁ గూచుంటి
అంటితిని మందెమేళా లాయనో కదా ॥ ఎఱఁ ॥

ంచివాఁడవని నీతో మాటలాడ వచ్చితేను
యెంచకే యింత సేసితి వేరా నీవు
కొంచక శ్రీవేంకటేశ కూడితి మిద్దరమును
అంచల నారతుల నీ వలసితివో కదా ॥ ఎఱఁ ॥ 560

## మాళవి

ంత సేయఁ జెల్లునా యీరమణిఁ బెడఁబాసి
యెంత కెంత విన్నవించే నింక నీచిత్తమురా ॥ పల్లవి ॥

రులు ముడువఁబోతే వెలఁది యేమోకాని
మరునిబాణములంటా మచ్చరించీని

కయ్య మందించేనంటాఁ గసరీని
పుయ్యఁగ గందము చూచి పొరిఁ గాలకూటమంటా
నెయ్యపుఁజెలులఁ జూచి నేరమెంచీని

అరుదైనమాణికాలహారము లియ్యఁగఁబోతే
విరహాగ్నిశిఖలంటా వెఱచీని
గరిమ శ్రీవేంకటేశ కలసితి వింతలోనే
యిరవై యలమేల్మంగ యిటు మెచ్చీని ॥ ఇ

ఆహిరి

అడుగువెట్టితే నీకు ఆకెపాదమాన సుమ్మీ
నిడు(డుఁ?)జంగనడపేల నిలవయ్య పోక

సారె జాఱె మొలనూలు జడిసె ముత్తేలపేరు
భారపుసొమ్ముతో నిన్నుఁ బట్టరాఁగాను
వూరకే యలిగిపోయే వువిదదిక్కు చూడక
నేరుచుకొంటివి నేఁడే నిలవయ్య పోక

కురులు చెమటఁదోఁగె కుచయుగ మిటురాసె
బెరసి నీచేయివట్టి పెనఁగఁగాను
శిరసు వంచుకొంటివి చెలియకు మొకమోడి
నెరవేరెఁ బనులెల్లా నిలవయ్య పోక

పులకలు మేన నిండె భోగపుఁగళలు మించె-
నలమేలుమంగ నిన్ను నలముఁగాను

ఇంటికి విచ్చేసె నాతఁ డేమే నీవు
కంటకములాడేది కాదే నీవు ॥ పల్లవి ॥

అగడుఁ జెమటతోడ నలసివచ్చినపతి
యెగసక్కెలే యాడే వేమే నీవు
మగవానిమోహ మింత మదివిచ్చి చూడఁబోతే
యిగురువంటి దింతే యేలే నీవు ॥ ఇంటి ॥

చెంతల నిన్ను నవ్వించి సిగ్గులెల్లాఁ బాపినాఁడు
యెంతైనా మెచ్చవైతి వేమే నీవు
పంతపుదొరలపొందు పచ్చిగాఁ బిసుకఁబోతే
యింతలోఁ బసురువేసు నిదియాలే నీవు ॥ ఇంటి ॥

నెయ్యాన గడ్డముపట్టి నిన్నతఁడు వేఁడుకొనీ
యియ్యకొనవే పనికి యేమే నీవు
తియ్యఁగా శ్రీవేంకటాద్రిదేవునిఁ గూడితి విట్టె
అయ్యెడ నలమేల్మంగ వవునవునే నీవు ॥ ఇంటి ॥ 563

రేకు 997 సింధురామక్రియ

ఔరా రాజసము అంతేసి తగదా
గారవాన నీవా కెకుఁ గలకాలము ॥ పల్లవి ॥

నిలుచుండి పిలిచేటినీతో నంగన నేఁడు
మలగుపై నొరగుండే మాటలాడీని

చెంగటఁ బ్రియముచెప్పి చెక్కునొక్కఁగా నీవు
ఎంగిలిమోవి గదల నించుకంత గొణఁగె

పూనిపట్టి కొప్పు దువ్వి బుజ్జగించె నియ్యెడకు
మేనెల్ల మఱచె నలమేలుమంగ
ఆని పట్టి శ్రీవేంకటాధిప కూడితి విట్టె
తానై తే నీవురమెక్కి తానకమై నిలిచె ॥ చెం

మాళవి

ఊడిగపు సతులాల వుండరే మీరు
ఆడరే [1] మెల్లనిమాట లంతంత మీరు ॥

మాటలాడే రిద్దరును మాణికపుటింటిలోన
తేటలుఁగ దేవుఁడును దేవులు నిదె
యేఁటికి దగ్గరిపోయే రిదివేళగాదు మీకు
బోఁటులాల పిలిచితే పోదముగాని

తూఁగుటుయ్యాల లూగేరు తొలఁకుమోహముతోడ
యేఁగివచ్చి లోని కేఁగి రింతకముందు
తోఁగిచూడకురే మీరు తొడరి తమంతనే
పొఁగి పిలిచినప్పుడే పలుకుదము

యేకతాన శ్రీవేంకటేశుఁ డలమేల్మంగయుఁ
బైకొని కూడున్నవారు పానుపుమీఁద
పోకురే చనవుచేసి పొలఁతు లిపుడే వారు
అకుమడువఁ బిలిచే రప్పుడే పోదము ॥ ఊ

అప్పటి నెత్తము జూజమాడేవు పరాకున
యిప్పుడు నీవద్ద నున్న దిదివో చెలి ॥ పల్లవి ॥

ముంచిముంచి నవ్వునవ్వి మొగలిరేకులకొప్పు
యించుకించుక -గదల నిదివో చెలి
తుంచితుంచి నిన్ను వేసీ తోరపుఁబువ్వులదండ
ఇంచువిలుతునివలె నిదివో చెలి ॥ అప్ప ॥

చిత్తగించి మాఁటలాడీ చెక్కులమెరుఁగు మించ
యెత్తినవదనముతో నిదివో చెలి
తత్తరించి వీఁపునఁ దనపేరు వ్రాసీని
యిత్తల నేమీ నెఱఁగ దిదివో చెలి ॥ అప్ప ॥

తొడమీఁదఁ దొడవేసీఁ దోరపుకుచము లానీ -
నెడనెడ నొత్తుతాను యిదివో చెలి
పడఁతి శ్రీవేంకటేశ పరాకుమాని నిన్ను -
నెడయక గాఁగిలించె నిదివో చెలి ॥ అప్ప ॥ 566

సామంతం

వలెనా నీకింతదూరు వనితలతో నేఁడు
యెలమి నామాట విని యింటికి రావయ్యా ॥ పల్లవి ॥

ఆగడాలు నీవే నేసి యలిగేవు రానంటా నీ -
లాగులు చూచినవారు లందఁ డందురు

తలపోసి నీకుఁగా దప్పిఁబడ్డయాఁడువారు
చలమరి పీఁడేడ జాణఁ డందురు

ముంచినప్రియముతోడ మొక్కినాఁ గైకొనకున్న
చంచలించినట్టివారు జడుఁ డందురు
యెంచి చూచి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
వంచ నింత లేకుండితే వడి గర్వి యందురు ॥వ

## ఆహిరి

జమళిఁ గల్యాణము సరసుఁడాడె నేఁడు
చెమట లేఁటికి వచ్చెఁ జెప్పరే ॥

తూఁగుమంచముమీఁదఁ దొయ్యలు లిద్దరిఁ
గాఁగిలించుకొంటాఁ గరఁగీని
యేఁగుబెండ్లికొడు కెవ్వరిపై మోహాము
చేఁగదేర నిది సరిఁ జెప్పలే

ఇదె పెండ్లిపీఁటపై యిద్దరి కౌకమూఁచే
కదిసి పచ్చడము గప్పీని
యెదుగ దోసిట నించి యెవ్వరిపైఁ దలఁబాలు
చెదరకుండాఁ బోసెఁ జెప్పరే

పొలఁతులిద్దరితోడ బువ్వానఁ గూచుండి
చలివాయఁ గళ్ళిచ్చీ సరిగాను
యెలమి శ్రీవేంకటేశుఁ డెనసె నీవేళ నే—

దీపించ( జక్క(దనము దేవునికిని
పైపై( జల్లేరు నే(డు పన్నీరుకాపు

వుడివోనికల్పభూజ మొద్దిక( గొమ్మలతోనే
పొదవెల్లా( దెల్లనై పూచెనో కాక
యెడలేక తిరుమేన నింతటా మెత్తిరిదివో
కడలేనిహరికిని కప్పురకాపు

తిరమై యాకాసమందు తెల్లనిచంద్రునిమీ(ద
వరుస నిల మేఘము వాలెనో కాక
సరసనే శశివర్ణ[1]మైనందు
పురిగొన నించిరిదే పుణుగుకాపు

పొంచి నీలగిరిమీ(ద( బొస(గి బంగారుకొండ
అంచెల( గీలించినట్టియందమో కాక
మించి శ్రీవేంకటపతిమెద నలమేలుమంగ(
జంచుల( బెట్టిపూసిరి చందనకాపు ॥ దీ

రేకు 998 లలిత

ఇందుకే నీవు వచ్చితి వీడనే నే నున్నవా(డ
విందువంటినీగుణాలు వేవేలు గదవే

మట్టెలు గల్లురన(గ మగువ యెందు వోయేవే
యిట్టే నీకెదురుచూచి యీడ నున్నా(డ
కట్టిన[2] నీదవ్వ(ప్ప?)టము గజభజించ(గ నీ—

వదచల్లుపానవత  పదక పవ్వరన
యిదె నీవు రమ్మనఁగా నీడ నున్నాఁడ
కదిసి నీము(ముం?)జేతికంకణాలరవళికి
చదల నీవిన్నపాలు సందడినే వున్నవే ॥ ఇందు ॥

కలకలనవ్వులతో కమ్మటి నేమిచూచేవే
యెలమి నిన్నుఁగాచుక యీడ నున్నాడ
చెలఁగి కూడితి నిదె శ్రీవేంకటేశుఁడ నిన్ను
పలుకుఁబంతము నింతబలువాయఁగదవే ॥ ఇందు ॥ 570

శంకరాభరణం

ఆయలేరా మాతోనే అంత యేఁటికి
చాయలకు సన్నలకు చవులువుట్టీనా ॥ పల్లవి ॥

బలిమిఁ బట్టకురా పనిగల దీవేళ
బలిమెల్లా నాఁడువారిపై సేయటరా
చల మింతేఁటికిరా సమ్మతి రేపయ్యీఁగాక
వలపు లింతటిలోనే వడ్డికిఁబారీనా ॥ ఆయ ॥

కొనగోర నొత్తకురా కుమ్మెవోయీ ము(ముం?)జేయి
కొనఁబెట్టి(ట్ట?) మోహాలు కొనసాగీనా
వెనక వచ్చేరా వీరిడిఁ జేయకు నన్ను
ననిచినమన సిట్టే నాని మెత్తనాయనా ॥ ఆయ ॥

పయిఁ జేయివేయకురా పట్టరాదు మేనికాఁక
ప్రియములు పెంచఁ బెంచఁ బెంటలయ్యీనా

విచ్చేయవయ్యా వేగమె అక్కడికి
అచ్చమైనకోరికతో నలసీఁ జెలి ॥పల్లవి॥

వుప్పరిగెలోన నీవు వున్నాఁడవంటా వచ్చి
అప్పుడే రావైతివంటా నడిగీఁ జెలి
తొప్పఁదోఁగేచెమటతో తూఁగుమంచముపైఁ బండి
ముప్పిరి మోహములోన మునిఁగీఁ జెలి ॥విచ్చే॥

వేడుకతో నీకు నిచ్చే పీడెమిచ్చేనంటా వచ్చి
వీడుపడి యందు నిందు వెదకీఁ జెలి
వాడుచు మలగుమీఁద వడి నొరగుండి తాను
పాడించుకొనీ నీపై పాటలిన్నిఁ జెలి ॥విచ్చే॥

వుట్టిపడి నీవు కొలువున్నాఁడవంటా విని
అట్టె నిన్ను రమ్మని చెప్పెంపీఁ జెలి
గుట్టున శ్రీవేంకటేశ కూడి యలమేలుమంగ
నట్టనడుమ నిందుకే నవ్వీఁ జెలి ॥విచ్చే॥ 572

హిందోళం

ఎంతమోహమో మీకు నిట్టే బతుకరయ్య
సంతసపువేళ మీకు చవి చెరిచితిఁగా ॥పల్లవి॥

యిద్దరు నొక్కపచ్చడ మిటు గట్టుక మీరు
అద్దరిపాటు నే రాఁగా అట్టె లోఁగేరు

యేపున నుండఁగ నే నేలవస్తినో
రాపుల నాకుఁగా మీరు రహిఁ దియ్య నింతయేల
తీపులమీగుండెలకు దిగులైతిఁగా

మంచి యిద్దరునుఁ గూడి ముచ్చటలే యాడుకోఁగా
యెంచక పొడచూపితి నిట్టే నేను
అంచెల శ్రీవేంకటేశ అలమేలుమంగను నే
మంచమెక్కి కూఁడుటకు మనసైతిఁగా ॥ ఎం

వరాళి

ఎరవు సతమవునా యెప్పుడు నేము నేమే
మొరిపెపుటాకెఁ గని మొగమోడితివి

మగువ కప్రమునోట మాటలాడీ వినవయ్య
వెగటైననేమేమన్నా వినవైతివి
బిగి ఉంగరపువేలఁ బిలిచీఁ బోవయ్యా
జిగి నేము యెంత విలిచినా రావైతివి

మొనగోరిచేత నాకె మొక్కీఁ జేకొనవయ్య
పనివడి మాతోనే పరాకైతివి
ననుపున నాకె నీతో నవ్వె నీవు నవ్వవయ్య
చనవున మానవ్వు చవిగాదు నీకు

గందము పూసినమేనఁ గాఁగిలించీ మెచ్చవయ్య
ఇందుకుఁగా మాతోడ నింత నేసితివి

ముఖారి

ఎదురు చూచీ నీవు యెప్పుడు వత్తువో యంటా
[1]పదఁగదవే నీతో పొలుపడ్డాఁ డతఁడు ॥ పల్లవి

కొంకక కూడినదాఁకా కొండవంటిది వలపు
అంకెకు వచ్చినదాఁకా నాయమువంటిది చింత
సంకెదేరినందాఁకా చలివంటిది సిగ్గు
యింకా నేఁటికి రావే యీడనున్నాఁ డతఁడు ॥ ఎదు

మనసు గలయుదాఁకా మరులువంటిది తమి
యెనయఁ బిలుచుదాఁకా యేరువంటిది కోరికె
కని మాటాడుదాఁకా చీఁకటివంటిది మోనము
కినియకువే నీవాకిటనున్నాఁ డతఁడు ॥ ఎదు

సరిఁ గాఁగలించుదాఁకా జాలివంటిది వయసు
ధరఁ దలయెత్తుదాఁకా తలుపువంటిది చూపు
ఇరవై శ్రీవేంకటేశుఁ డీడకే విచ్చేసి కూడె
వరు సడుగక రావే వద్దనున్నాఁ డతఁడు ॥ ఎదు ॥ 57

రేకు 999 వరాళి

ఏమోయని వుంటి మిందాఁకా
యీమాటలేకా యిఁక నేలరా ॥ పల్లవి

అందరిఁ బొమ్మని యంకెకుఁ బిలిచేవు
యిందుకా వోరీ యిందాఁకా

యెఱఁగనైతిరా యిందాఁకా
మఱి జంకించకు కడమా నేఁ జెప్పేఁగాని
తఱిగాదు యీవేళ తడవకురా

చెక్కునొక్కి నన్నుఁ జేకొని కూడితి
యెక్కెరా నీచల మిందాఁకా
చిక్కనినవ్వుల శ్రీవేంకటేశుఁడ
దక్కితి నీకె నెందూఁ దలఁగకురా ॥ ఏ

శంకరాభరణం

ఎక్కడౌతా నెఱఁగదు యెంత వలచెనో కాని
చిక్కవడ్డవేళ బుద్ధిచెప్పరే చెలులు

కోరి మాఁటలాడీఁ గాని కొప్పు వీడు టెఱఁగదు
ఆరయ విభునితోడ నయ్యో చెలి
పారితెంచీఁ జనుఁగొంగు బయలౌతా నెఱఁగదు
గారవించి మీరైనాఁ గప్పరే చెలులు

తప్పక చూచీఁగాని తన్నుఁదానె యెఱఁగదు
అప్పుడే మోహము నాఁటీ నయ్యో చెలి
చిప్పిలఁ బైనొరగీని చెమరించు టెఱఁగను
దప్పిదేర విసరరే దగ్గరైనఁజె(నచె?)లులు

కాఁగిలించుకొనీఁగాని కళదాఁకు టెఱఁగదు
ఆఁగి తనివిదీరక అయ్యో చెలి
నీఁదక కడపలోన శ్రీవేంకటేశుఁ గూడి చెలి

కొలువున్నాఁ డదివో గోవిందరాజు
కొలఁదిలేనిసొమ్ముల గోవిందరాజు ॥ పల్లవి ॥

గారవానఁ బాదములు కాంతలపైఁ బారఁజాఁచి
కూరిములు వెదచల్లీ గోవిందరాజు
దీరత సంకుఁజక్రాలతెల్లనికన్నులతోడ
కోరినవరము లిచ్చీ గోవిందరాజు ॥ కొలు ॥

దట్టపుంగరాలవేళ్ల దాపలిచెయి వారఁజాఁచి
గుట్టుతో నూరకున్నాఁడు గోవిందరాజు
వొట్టుకొనె వలకేలు వున్నతిశిరసుకింద
కొట్టఁగొననవ్వులతో గోవిందరాజు ॥ కొలు ॥

చిప్పిలుతా నొత్తగిలె శేషుపడగెనీడ
గొప్పకిరీటముతోడ గోవిందరాజు
అప్పుడే బొడ్డునఁ గనె నజుని శ్రీవేంకటాద్రి—
కుప్పెకటారముతోడ గోవిందరాజు ॥ కొలు ॥ 578

కేదారగౌళ

వద్దుసుమ్మీ ఇది నీవువలచిననీరమణి
వొద్దనుండఁగానే యింత వుమ్మలఁబెట్టేవు ॥ పల్లవి ॥

చెక్కుఁలెల్లాఁ జెమరించెఁ జెలియకు విభుఁడ నీ—
వక్కడనెందో పరాకై వుండఁగా

మనసిచ్చి సతులతో మాటలాడఁగా
కనుఁగొన లెత్తినాయ కలికి నవ్వఁగ నీవు
యెనలేనితలపోఁత లెక్కుడో పెంచఁగను

మచ్చికలే దైవారె మగువవిన్నపము నీ-
విచ్చగించి ఇన్నిటికి నియ్యకొనఁగా
పచ్చిగా శ్రీవేంకటేశ పైకొని కూడితి చెలి-
నచ్చలములెల్లాఁ దీరె నంతేసి సేయఁగను ॥వ

ఆహిరి

వేగిరించకురే మీరు వెలఁదులాల
బాగుగా నారమణుఁడు పాడెఱఁగఁడా

దగ్గరి వచ్చినవాఁడు తానే మాటాడఁడా
యెగ్గువట్టీ నుండరే యిదేమనక
బగ్గన రమ్మన్నవాఁడు పైకొనక మానీనా
సిగ్గువడీ మానరే చేరి విన్నవించక

నన్ను మన్నించినవాఁడు నవ్వక మానీనా
సన్నలు సేయకురే జడిసీఁ దాను
అన్నిటా వలచినాఁడు ఆదరించకుండునా
యిన్నేసి దూరకురే యేమసేనో అతఁడు

ఇయ్యకొనినట్టివాఁడు ఇటమీఁదెఱఁగఁడా
కొయ్యతనాలాడకురే కోపగించీని

చిన్నదాననైనాను చేఁతలివి మేలమ్మ
నిన్నుఁ జూచినసతులెల్లా నేఁడు మెచ్చేరమ్మా

చెక్కునఁ బెట్టినచేయి సెలవినవ్వినవ్వు
తక్కక వోచెలి నీకే తగునమ్మా
పక్కన నిట్టూర్పులును పతితోడిమాటలు
నెక్కొని యింతేసి యాడ నేరిచితివమ్మా

తేలగింపుఁజూపులును తియ్యనివినయములు
కాలమందే నీయందే కంటిమమ్మా
తాలిమి నివ్వెరగులు తమకపుఁగరఁగులు
వేళతో విభునిమీఁద వేసితివమ్మా

వసివాడునటనలు వలపులఘటనలు
యెసరెత్తితివి నేఁడే యేమమ్మా
కొసరి శ్రీవేంకటేశుఁ గూడితి వింతటిలోనే
రసికతనము నీకు రతికెక్కెనమ్మా ॥ చిన

రేకు 1000 నాదరామక్రియ

ఆతని నేఁ పేనంటా నట్టే నీవు వేఁగేవు
యీతలఁబోయేపొద్దు లెవ్వరికి సెలవే

తడఁబాటుపతితోడ తలుపుమాఁటున నుండి
యెడమాట లాడించే వేమే నీవు

వీడెమిచ్చి పంపే వేమే వెలఁది నీవు
వేడుక నాతని నీవు విరహానఁ బెట్టేనంటా
తోఁడ నీవు విరహానఁ దొలఁకేవు గదవే ॥ ఆత ॥

మాటలాడేపతితోడ మంచముమీఁదనే వుండి
కాటుకకన్నులఁ జూచి కరఁగేవేలే
యీటున శ్రీవేంకటేశుఁ డింతలో నిన్నుఁ గలసె
వాటమై నీవూఁ గలసి వసమైతి గదవే ॥ ఆత ॥ 582

## సామంతం

రెంటికి వచ్చెఁగదే నీరీతులు చెలి
ఇంటనుండి మమ్ము నేఁప నింతేలే నీకు ॥ పల్లవి ॥

[1] సిగ్గుతోఁ బెట్టినయట్టి చెలి నీచెక్కిటిచేయి
వెగ్గళపుఁ జింతలంటా వెరచితిమే
బగ్గన నీవుయ్యాలపై నూఁగేపయ్యెదజారు
విగ్గుల విరహమంటా విన్వెర గందితిమే ॥ రెంటి ॥

ముసిముసినవ్వులతో మోనాన నీవున్నకీలు
పసురుఁగోపములంటా భ్రమసితిమే
అసురుసురులతోడి యలపోక నిద్దురలు
కొసరునలుకలంటాఁ గొంకితిమే నేము ॥ రెంటి ॥

శ్రీవేంకటేశుతో నీచేముట్టినసరసాలు
తావుల మీవాదులంటాఁ దలఁకితిమే
వోవరిలో మీరిద్దరు నొనగూడి వుండఁగాను

పళపంజరం

చెప్ప వెఱతుము నీకు చేరి సారెసారెకును
యిప్పు డిట్టె రారాదా యిది యేమే నీవు ॥ పల్లవి ॥

వంచిన శిరసుతోడ వలపు చింతల నీడ-
నంచల నీపతి వున్నాఁడదె కదవే
మించినచెమట గార మీఁటుకొనీఁ గొనగోర-
నించుకంతా దయసేయ విదియేమే నీవు ॥ చెప్ప ॥

నిట్టూరుపు మోఁతలును నేలపై వాఁ(వ్రా?)తలును
వొట్టుక నీపతి లోన నున్నాఁడదె
అట్టె కఁ(కం?)బాన నొరగె ఆయములు లోఁ గరఁగె
యెట్టని మాఁటాడవైతి విది యేమే నీవు ॥ చెప్ప ॥

నిండినకోరిక వెంచి నెరిఁ బులకలు ముంచి
అండనే శ్రీవేంకటేశుఁ డదె నీపతి
పండినకెమ్మోవితోడ పైకొని నిన్నిటు గూడె
యెండ నీడ కన్నెఱఁగ విది యేమే నీవు ॥ చెప్ప ॥ 584

రామక్రియ

వద్దే యింతేసి మాతో వట్టిసణఁగు
గద్దరివై యీపంతమే కడకూ నడపేవా ॥ పల్లవి ॥

కప్పుర మియ్యఁగఁబోతే కాఁతాళించి చూచేవు

పొంచి చెయివేసితే బొమ్మముడివెట్టేవు
నించి చన్నుఁగొండలానేనీ కిది వేఁగా
మంచముపైకిఁ దీసితే మరిఁ దలవంచేవు
యెంచఁగలపనులాయ నిఁకనేలే కొంకు

అంది కాఁగిలించుకొంటే నసురుసు రయ్యేవు
కందువరతులు నేఁడే ఘనమాయనా
విందువలెఁ గూడితి శ్రీవేంకటేశుఁడను నేను
ముందువెనక వాసింతే మొక్కలములేలే ॥వ

లలిత

ఎంతటివాఁడవౌ(దౌ?)తా నెఱఁగ వీతని నీవు
ఇంతట నీపతియైతే నిటు సేయఁజెల్లునా

పుప్పొది చల్లఁగదమ్మ పూఁచి నీవెంట రాఁగాను
చిప్పిల నీపతిమేను చెమరించెను
కప్పుర మియ్యఁగదమ్మ కడు నీతో మాటాడఁగా
దప్పిదేరీఁ గెమ్మోవి తగఁ జూచరాదా

పచ్చడము గప్పవమ్మ బడి నీపై నొరగఁగా
పచ్చిదోఁచి గరుపారెఁ బతిమేనెల్లా
మెచ్చి కొప్పువెట్టవమ్మ మేరమీరీ నీపనులు
ఇచ్చకానకుఁ జేయఁగ నిదె పీడెఁ దురుము

తూఁగుమంచ మూఁచవమ్మ తుద శ్రీవేంకటేశుఁడు
కాఁగిట నిన్నుఁ గూడి కడు నలసె

బౌళి

ఇన్నిఁ గన్నవే నేము ఇంకాఁ గొన్నేలరా
పన్నినసీసటలేల పదరా ఇంటికిని

పంతపుఁబురుషములను బయలీఁదేవారము
ఇంతేసిమాటల బయలీఁదించేవా
బంతిఁ దొల్లె జవ్వనపుభారములవారము
రంతుల నీమోహపుభారము గొంత గట్టేవా ॥

గొబ్బునఁ బెరిగేచనుఁగొండలలో వారము
వుబ్బించి కొండ లెక్కించే వూరకే నీవు
దొబ్బరానిచిఁకటితురుములవారము
తబ్బిబ్బుఁగాఁగలజీకు తప్పించేవా నీవు ॥

బచ్చనల సిగ్గులచప్పరములోవారము
యిచ్చఁ జప్పరానకు నన్నిటు దీసేవా
మెచ్చ శ్రీవేంకటేశుఁడ మిమ్ముఁ గూడినవారము
నిచ్చలుఁ బైకొని నన్ను నీవూఁ గూడేవా ॥ ఇన్ని

శ్రీః శ్రీః శ్రీః

* * *

# ...గ రాగముల అకారాది సూచిక.

## అకారాదిగ సంకీర్తన, రాగ, సంఖ్యా సూచిక

| సంకీర్తన మొదలు | రాగము | స |
|---|---|---|
| అంగనజవ్వన | దేవగాంధారి | |
| అంగనలీరే | లలిత | |
| అండకు రావయ్యా | దేసాళం | |
| అంత మనసున | సామంతం | |
| అంతలోనె | శ్రీరాగం | |
| అందరికి సిరితే | భైరవి | |
| అందరి మెప్పించ | ముఖారి | |
| అంది తెలియ | నాదరామక్రియ | |
| అందుకుగా | మధ్యమావతి | |
| అందుకే చింత | సామంతం | |
| అందుకేపో | నాదరామక్రియ | |
| అందుకేమి | ముఖారి | |
| అందులోనె వున్న | సౌరాష్ట్రం | |
| అందులోనేకాన | లలిత | |
| అండగూచుండె | ఆహిరి | |
| అంపవయ్యా | నారాయణిగౌళ | |
| అటుగనక | దేశి | |
| అడియాలా | సామంతం | |
| అడుగరే చెలులాల | దేశాక్షి | |

| కీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ |
|---|---|---|
| ోరఁబో యేవని | ఆహిరి | 82 |
| నుడైనవాని | ఆహిరి | 8 |
| ాయలసన్నల | రామక్రియ | 44 |
| ాలుఁజాలు | సామంతం | 37 |
| ాలునింత | తెలుఁగుఁగాంబోది | 86 |
| ంతవంతలిఁక | శ్రీరాగం | 40 |
| క్కితిమీపాలనూ | ఆహిరి | 51 |
| ిగురుఁబెదవి | శ్రీరాగం | 24 |
| ిగురో చేఁగ | సామంతం | 49 |
| ిత్తగించవోయి | లలిత | 3 |
| ిత్తగించినీవు | ఆహిరి | 6 |
| ిత్తగించుతమక | పాడి | 25 |
| ిత్తగింతువు | ధన్నాసి | 16 |
| ిత్తజుని | వరాళి | 37 |
| ిత్తాననోరుపు | నాట | 8 |
| చిన్నదానవై నాను | శ్రీరాగం | 58 |
| చూచితివో | నీలాంబరి | 26 |
| చూడఁబిన్నవు | మంగళకౌశిక | 28 |
| చూడవమ్మా | సౌరాష్ట్రం | |
| చూడవే | హిందోళం | 2 |
| చూతువుగానీ | పాడి | 1 |
| చెక్కునొక్కి | బౌళి | |
| చెప్పకునీసుద్ది | సామంతం | 3 |
| | ఆహిరి | 2 |

| కీర్తన మొదలు | రాగము | సంకీర్తన సం |
|---|---|---|
| చెప్పదుయెంతైన | శంకరాభరణం | 6 |
| చెప్పమనేవు | రీతిగౌళ | 30 |
| చెప్పరయ్యమీరిద్దరు | పాడి | 32 |
| చెప్పరయ్యావూడిగాలు | సౌరాష్ట్రం | 1 |
| చెప్పరాదుచూపరాదు | తెలుఁగుకాంబోది | 4 |
| చెప్పవద్దాబుద్దులు | మాళవిగౌళ | 2 |
| చెప్పవెఱతుము | పళవంజరం | 5 |
| చెప్పితేనారచి | వసంతవరాళి | 4 |
| చెప్పితేనిష్ఠూరము | సాళంగం | 3 |
| చెప్పుడుమాటలు | లలిత | 2 |
| చెయ్యెముంచిన | సామంతం | 4 |
| చెలఁగినావిభు | తెలుఁగుఁగాంబోది | 3 |
| చెల్లదానీవే | దేశాళి | 1 |
| చెలిపలునోఁకు | సామంతం | 5 |
| చెలులాలచూడరే | గౌళ | |
| చెలువుఁడవెంతైనా | ముఖారి | 5 |
| చేతికిలోనైన | లలిత | 4 |
| చేతికిఁగొంత | రామక్రియ | 4 |
| చేసినట్టెల్లా | లలిత | 5 |
| చేసేనావినయ | ఆహిరి | 4 |
| జంకించేవు | శుద్ధవసంతం | |
| జమళిఁగల్యాణము | ఆహిరి | 5 |
| జయలక్ష్మివరలక్ష్మి | లలిత | 5 |
| జవ్వనపుదా | హిందోళవసంతం | 1 |

| | | |
|---|---|---|
| గిలినేఁదడవి | ముఖారి | 3 |
| గుతగునీదొర | వేళావళి | |
| నకేసంతోస | సామంతం | 4 |
| నజాడలేల | సౌరాష్ట్రం | 4 |
| నిసితి | లలిత | 3 |
| నువిందు | ఆహిరి | 34 |
| మ్ముఁదామే | బౌళి | 3 |
| రవాతిపనులెల్ల | భైరవి | 50 |
| రుణిచెనకులు | లలిత | 2 |
| రుణులతోడ | పాడి | 4 |
| తెలివమొక్కఁగా | ఆహిరి | 1 |
| లఁచుకొమ్మన | కాంబోది | 20 |
| లపోసి | నాగవరాళి | 3 |
| తానేడనేనేడ | సామంతం | 54 |
| తారుకాణ | నాగవరాళి | 2 |
| తెలిపిచెప్పఁగ | ఆరబి | 30 |
| తెలియఁజెప్ప | పాడి | 2 |
| తెలియరాదు | రేవగుప్తి | 27 |
| తెలిసినపనులకు | దేవగాంధారి | 37 |
| తేటతెల్లమిగ | కన్నడగౌళ | 20 |
| తొలుతనెఱఁగవా | సాళంగనాట | |
| తొల్లె ఇన్నిటా | సింధురామక్రియ | 5 |
| గ్గరికూడుట | ముఖారి | 47 |
| యఁజూడవయా | తెలుఁగుఁగాంబోది | |